




కలాభివర్ధనీ పరిషత్తు
రాజమహేంద్రవరము

11

# హెచ్చరిక

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి

చిన్నకథలూ,
నవలలూ,
నాటకాలూ,
రూపికలూ,
చరిత్రలూ,
మీగడతరకలూ,
ఖండకావ్యాలూ,
వర్ణచిత్రాలూ,
మెరుపుదెబ్బలూ,
వ్యాఖ్యానాలూ,
వ్యాసాలూ
మొదలయినవి

లిఖితరూపంగా వారి అనుమతి పొందకుండా

భాషాంతరీకరణం, ప్రదర్శనం, బ్రాడ్ కాస్టింగు,
రికార్డింగు, స్క్రీనింగు, అనుసరణం,
ముద్రణం, ప్రకటనం,
వగైరా ఏవిధంగానూ ఎవరూ
వుపయోగించుకో గూడదు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి నవలలు

# విషభుజంగము

(శ్మశానవాటిక)

కలాభివర్ధనీ పరిషత్తు
రాజమహేంద్రవరం

| | | | |
|---|---|---|---|
| మొదటికూర్పు (శ్మశానవాటి పేరుతో) | 1917 | మేయి | 1000 |
| రెండోకూర్పు | 1952 | జూలై | 1000 |
| మూడోకూర్పు | 1953 | ఆగష్టు | 1000 |




రాజమహేంద్రవరం ఒద్దేపల్లి నాగేశ్వరరావుగారిచే
సరస్వతీ పవర్ ప్రెస్సున ముద్రించబడ్డవి.

V

# మహారాజపోషకులు

కళాప్రపూర్ణ, సాహిత్యసామ్రాట్టు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారు **డి.లిట్**

# ప్రధానపోషకులు

శ్రీ అడ్దేపల్లి నాగేశ్వరరావుగారు

ప్రొప్రయిటరు :—సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి

కీ. శే. దురిశేటి శేషగిరిరావు పంతులుగారు, కాకినాడ

# పోషకులు

శ్రీ తూములూరి శివరామయ్యాపంతులుగారు
బి ఏ., బి ఎల్ అడ్వకేటు, నెల్లూరు

శ్రీ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు
ప్రొప్రయిటరు: వావిళ్ళ రామస్వామిశాస్త్రులు & సన్సు, మద్రాసు

శ్రీ ఏడిద వెంకటరావు పంతులుగారు
భూస్వాములు, మహేంద్రవాడ

శ్రీ బెజవాడ రామచంద్రా రెడ్డిగారు
బి. ఏ, ఓ బి. యి, ఎమ్. పి. బుచ్చిరెడ్డిపాలెం

శ్రీ ద్వారంపూడి వెంకటరెడ్డిగారు భూస్వాములు, అనపర్తి

శ్రీ వుప్పల శ్రీరామమూర్తిగారు మిల్లుఓనరు, అనకాపల్లి

శ్రీ ఎం. వి. ఆర్. అణహారాచార్యులలుగారు
అగ్రహారంవారు మద్రాసు

శ్రీ వి. నాగయ్యగారు రేణుకాఫిలిమ్సు డైరెక్టరు, మద్రాసు

శ్రీ క్యాప్టెన్ తోలేటి కనకరాజుగారు
**M. B. B. S., F. R. C. P. (E)** రాజమండ్రి

శ్రీ వింజమూరి సూర్యనారాయణమూర్తిగారు
ప్రొప్రయిటరు: వినాయక కాఫీకంపెనీ. రాజమండ్రి

శ్రీ. శ్రే. సజ్జెళ్ళ వద్దయ్యగారు — కొంకుదురు
,, కర్రి చినవెంకటరెడ్డిగారు — మారుటేరు
,, చిట్టి నారాయణమూర్తిగారు — తణుకు
,, ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు — చింతలూరు
,, ద్వారంపూడి రామారెడ్డిగారు — అనపర్తి

# విషభుజంగము



## ఉపక్రమణిక

ఇన్నూటయేఁబది సంవత్సరములకుఁ బూర్వము తుల్యానదీతీరమున "పులిబూరు" అను నొక గ్రామ ముండెడిది. ఇప్పుడా గ్రామ మా పేరుతో నచ్చట లేకపోయినను, బూర్వ మొకప్పు డచట నొక గ్రామ ముండెడి దని చెప్పుటకుఁ దగిన కొన్ని గుఱుతులు మాత్రము నశించి పోలేదు. రామచంద్రపురసంస్థానపుఁ బ్రారంభదినములలో నది యొక తాణాగ్రామమై, యున్నాగ్గు ఆశ్వీక పిరులకు నివేశమై యుండెడిది; గాని యిప్పుడా సంగతి నెఱిఁగినవారు లేరనియే చెప్పవచ్చును.

తుల్యభాగ యను నామాంతరము గల తుల్యానది మహాత్తమి సప్తశాఖలలో [illegible] కలదు. ప్రతిసంవత్సరమును పౌషబహుళామావాస్యనాఁడు [illegible] కినారె చెంత నున్న "నౌగాంగి" యను గ్రామమున [illegible] తుల్యాసాగరసంగమస్థలమున సవగాహనము చేయవచ్చు వేలకొలంది యాత్రికులు తుల్యానదీప్రభావమును వినియే యుందురు. ఇప్పు

డానది ఖండఖండములై, కొన్ని స్థలములయందు రూపాం
తరమును బొందినను, బూర్వకాలమున నిరర్గళప్రవా
హమై వాణిజ్యోజ్జీవికమైయుండెను. ఈమధ్యకాలమున
నాంగ్లేయప్రభువులవలనఁ ద్రవ్వింపఁబడిన కుల్యలు ప్రజ
లకు మహోపకారకములైన పిదపఁ దుల్య కొన్నిచోట్లఁ
గేవలము మురుఁగుఁగాల్వగా నుపయోగింపఁబడుచున్నను,
బ్రజలకుఁ దానియెడలఁ గల గౌరవభావము నశించిపో
లేదు. వైశాల్యమునఁ దుల్య కుల్యతోఁ బోల్పఁదగినదియే
యైనను జీవనదియై యుండును. వంకర టింకరగ నుండు
టచే నౌకల స్వచ్ఛందవిహారమున కనువుగ లేకున్నను
అది చాల లోఁతుగలది. ఇప్పటికిఁ గూడఁ బర్వదినముల
యం దనేకులు క్షుద్రస్వరూపమైపోయిన యీనదియం
దవగాహన మొనరించి విముక్తపాపు లగుచుందురు.

పులిబూరు ఆ నదీతీరమునకంటి యున్న దన్నంత
మాత్రమునఁ దృప్తికాదు. ప్రాక్పశ్చిమంబు లగు నాగ్రా
మవీధు లానది తూరుపు టొడ్డుమీఁదికి వ్యాపించి యుం
డెను. కొన్ని యిండ్ల కానది గభీరపరిఖయై విరాజిల్లు
చుండెను. ఆవరుస నున్న యిండ్లన్నిటియందును గోవింద
భట్టాచార్యుని గృహము పెద్దది. గ్రామమునం దంతటను
గూడ నంతటి పెద్ద భవనములేదు ; గాని యది ప్రాసా
దము మాత్రము గాదు. మనోహరమై రాజమందిరము

ననుకరించు నాభవనము చుట్టును విశాల మగు దొడ్డియు నందు వివిధములగు పుష్పలతాతరునికుంజములచే నలరారు నుద్యానవనమును, దాని చుట్టును సమున్నతప్రాకారము నుండెను.

పేరునుబట్టి భట్టాచార్యుఁడు కేవలశాస్త్రపండితుఁడు మాత్రమే యని తలంచుటకు వీలులేదు. అతఁడు పులిబూరుతాణాకు తాణేదారుఁడు గూడ నై యుండెను. అతఁడు కాశీనగరమున నభ్యసించిన న్యాయవేదాంత శాస్త్రములయందే గాక, బలపరాక్రమములయందును, రాజ నీతియందునుగూడఁ జాల విఖ్యాతి సంపాదించెను. ఈకారణములచే నంతవాని నున్నతోద్యోగము నొసంగి గౌరవింపకున్న యెడల యవనుల దండయాత్రలవలన దేశము మిగుల నల్లకల్లోలమైయున్న యీసమయమునం దనేక కష్టములు సంభవింపవచ్చునను భీతివలనను, సహజముగ నతని పాండిత్యాతిశయమునంగల గౌరవము వలనను, మంత్రిపదవిని స్వీకరింపుఁడని రామచంద్రపుర సంస్థానాధీశ్వరుఁ డెంత ప్రార్థించినను, భట్టాచార్యుఁడు "నేనీ తుల్యాతీరమును విడిచి రాఁజాల" నని ఖండితముగఁ జెప్పి యీ మహోద్యోగమును దిరస్కరించెను. దానిపై నిఁకఁ జేయునదిలేక జమీందారుఁడు చాల యోచించి "అట్లయిన మీ యర్హతకుఁ దగకున్నను

బులిబూరు ఠాణేదారీనైన మీరు నిర్వహింపక తప్పదు. మీయట్టి రాజనీతివిదులు చేయూఁత నొసంగకున్నచో మేము నిరపాయముగఁ బ్రజాభారమును వహింపఁజాలము. మీప్రసాదము నభిలషించి, యిన్నూర్గురు అశ్వికయోధులపై నధికార మొసంగి, మీ కేఠాణేదారునకును లేని గౌరవములను గావింతు'' మని చెప్పి తుదకు భట్టాచార్యుని చే నొప్పించుకొనియెను. భట్టాచార్యుఁడు పేరునకు పులిబూరు ఠాణేదారుఁడైనను, నిజముగ రామచంద్రపుర సంస్థానమునకుఁ బ్రధానామాత్యుఁడై యుండెను. అవసరమైనప్పుడెల్ల రాజు స్వయముగ వచ్చియో మంత్రి నంపియో కొన్ని రాజకార్యముల విషయమున భట్టాచార్యుని యభిప్రాయమును దెలిసికొనకుండఁ బ్రవర్తించి యెఱుఁగఁడు. తత్ఫలముగ రాజు భట్టాచార్యుని సాహాయ్యము వలన ననేక లాభములను బడసెను.

కాని యీ యాఖ్యాన మెప్పుడు ప్రారంభమయ్యెనో యప్పటికి భట్టాచార్యుఁ డుత్తరవయస్సునఁ బ్రవేశించి యుండెను. అయినను రాజకార్య నిర్వహణమున కసమర్థుఁడై యుండలేదు. తన కఱువది యేండ్లు గడచుట వలనను, జ్యేష్ఠకుమారుఁడగు ప్రసాదరాయఁడు విద్యావివేకములయందును, బలపరాక్రమములయందును, దనతోఁ దుల్యుఁడై యుక్తవయస్కుఁడై యుండుట

వలనను, అధికారభారమును బుత్రునిపై నుంచెను. అయి
నను, రాజున కపుడపుడు యోచనలు సెప్పుటయును,
రాజకార్య సంబంధమగు తన ప్రవర్తనయందలి మంచి
చెడ్డలను దెలిసికొనుటకై ప్రసాదరాయఁడు విన్నవించు
సంగతులు వినుటయును మాత్ర మాతనికిఁ దప్పినది
గాదు.

రాజునకు భట్టాచార్యునియం దెంత గౌరవము
గలదో ప్రసాదరాయనియందు నంత గౌరవముగలదు.
ఆతఁడు, భట్టాచార్యుని వలనఁ దనకును, దన జమీందా
రీకి నెంత యున్నతి గలిగినదో ప్రసాదరాయని వలనఁ
గూడ నంతటి యున్నతి గలుగఁ గలదని నమ్మియుండెను.
మఱియుఁ బ్రసాదరాయఁ డిప్పటినుండియు రాజకార్య
ములయందుఁ బ్రసక్తి గలిగించుకొనినచోఁ దన కుమా
రుఁడు పట్టభద్రుఁడగు నప్పటికిఁ బ్రధానామాత్యుఁడుగా
స్వీకరింపఁ దగినంత యనుభవజ్ఞానము సంపాదింపఁ గలఁ
డనియు, నగుటచే భావికాలమునఁ దన కుమారునకుఁ
జాల నున్నతి కలుగుట కవకాశము గలుగు ననియుఁ
గూడ భావించెను. అక్కతన నాతఁ డపుడపుడు యువ
రాజుతో "ప్రసాదరాయనిఁ గేవలము కాణేదారుగా
నూహింపబోకుము. మన సంస్థానమునకుఁ బ్రధాన
మంత్రి యాతఁడే యని భావించెద వేనిఁ జాలమంచి" దని

బోధించుచుండెను. కుమార మహీపతియు వివేక మహితుఁ డగుట వలనఁ బ్రసాదరాయని లోకోత్తర ప్రభావము నెఱింగి యాతని యెడల నట్టి గౌరవమునే చూపుచుండెను.

కుమారమహీపతికిఁ బ్రసాదరాయనియెడలఁ గల గౌరవమునకు మఱియొక హేతువుగూడఁ గలదు. రాజనీతియందుఁ జక్కని పరిజ్ఞాన మలవడుటకై భట్టాచార్యుని పదసేవ చేసి రమ్మని రాజు యువరాజును బురిబూరు పంపించెను. అప్పు డాతఁడు బ్రసాదరాయని శక్తి సామర్థ్యములను బ్రత్యక్షముగఁ దెలిసికొనియెను. యువరాజునకు మల్లవిద్యయందుఁ దా నసామాన్యుఁడను గర్వముగలదు. ఈగర్వమువలన నేదో సందర్భమున నొకదినమున యువరాజు ప్రసాదరాయనితో వినోదముకొఱకు మల్లయుద్ధము గావించి యందోడిపోయెను. అప్పటినుండియు నాతఁడు ప్రసాదరాయనియెడల మిక్కిలి వినీతభావముతో మెలగుచుండెను.

ప్రసాదరాయని వయస్సిపు డిరువదియైదు సంవత్సరములు. అతని కిరువదియేండ్ల యీడుగల మహేంద్ర భట్టారకుఁడను సోదరుఁడు గలడు. అతఁడును విద్యాబల సంపన్నుఁడు; గాని యనుభవజ్ఞానము మాత్రము పూర్తిగ లేదు. తండ్రి మంత్రాంగ సాహాయ్యమువలనను, సర్వతో

ముఖమగు సోదరుని తోడ్పాటువలనను బ్రసాదరాయఁ డలౌకిక ప్రభావసంపన్నుఁడై తన యుద్యోగవిధులను జక్కఁగ నెఱవేర్చుకొనుచు నుండెను.

రాజసభయందును, జమీందారీ గ్రామములయందును గూడ భట్టాచార్యునకుఁ బోలెఁ బ్రసాదరాయనికి గూఁడ ననంతసన్మానము జరుగుచుండెను. అతనిమాట కెందు నెదురాడువారు కానిపింపరైరి. అతని యధికారమునకు లోఁబడిన గ్రామములయందలి వారెల్లరును జోరాదులవలన బాధలేమియు లేక సుఖముగనుండిరి. ప్రసాదరాయఁ డనిన దుర్మార్గులకు సింహస్వప్నముగ నుండెను.

# 1

రాత్రి ప్రథమయామం బతీతంబై, ద్వితీయయామము ప్రారంభమయ్యెను. జగమందంతటను గాంభీర్యము విరాజమాన మగుచుండెను. వాయు సంచాలనంబునఁ దుల్యానదియందుఁ జెలరేఁగు చిఱుతరగల మర్మరధ్వనులును, బండువెన్నెలంగాంచి ప్రభాతభ్రాంతిచే నాహారసంగ్రహణార్థము కులాయములనుండి వృక్షాంతరముల కరుగు పక్షుల రెక్కల రెపరెప ధ్వనులును, మాత్రమా గాంభీర్యమున కొకింత భంగకరములై యుండెను. శర

చ్చంద్రుఁడు తుల్యాతరంగ డోలికలపై నొయ్యారముగ నుయ్యేల లూఁగుచుండెను.

ఆ సమయమునఁ బులిబూరు గ్రామమునందలి భట్టాచార్యుని సువిశాలగృహావరణమున నొక నికుంజము నికటమునఁ బదుగురు మనుష్యులు పొంచి కూర్చుండి యేమో గుసగుస లాడుకొనుచుండిరి. అందఱచేతులయం దును గత్తులు కటారులు బల్లెములు, మున్నగు నిశితా యుధములు ధగధగ మెఱయుచుండెను. ఆయనంత కౌముదీసాహాయ్యమున వారిలోఁ దొమ్మండుగురు యవను లనియు, నొకఁడుమాత్రము భారతీయుఁ డనియు, విస్పష్టముగఁ దెలియుచుండెను. వారి చేష్టలను బట్టి భారతీయుఁడే యా గుంపునకు మొనగాఁడై యున్నట్లు గూడఁ దెలియుచుండెను. అప్పు డాతఁడొక యవనునిఁదట్టి "ఖానుఁడా! ఆ ద్వారపాలకుఁడు పచారు చేయుచుండుటవలన నీ యాఁటె తప్పిపోవచ్చును. విధి వశంబునఁ దిన్నగ నది కంఠమునం దేగుచ్చుకొనక, మఱి యెచ్చటనైనఁ దగిలినచో వాఁడు గొంతెత్తి రోదనము చేయుటయు, నదివిని యెల్లరును లేచివచ్చుటయుఁ, దన్మూ లమున మనకార్యము భగ్నమగుటయుఁ గూడఁ దట స్థింపవచ్చును. కావున నట్లు చేయవలదు. నీవీ కరీముని వెంటఁబెట్టుకొని పూలచెట్లమాటున నుండి మెలమెల్లఁగఁ

బోయి యాకస్మికముగ వాని నెత్తిఁ గిక్కురుమనకుండ బంధింపఁగలవా?" యని యడిగెను.

ఖానుఁడందులకు సిద్ధపడియెను. నేను నేనని యెల్లరును గూడ సిద్ధపడిరి; గాని నాయకుఁడు వారి నందఱను వారించెను. తుదకుఁ దనయీఁటె నటనుంచి రెండు జనప నార పగ్గములం గైకొని కరీముని వెంటఁబెట్టుకొని, చెట్ల చాటునుండి మెల్లఁగఁ జని, ఖానుఁడు ద్వారికునకతి సమీపమున వాని కెఱుకఁ బడకుండ నొక ప్రాఁకుటీరమునఁ గూర్చుండెను. ద్వారికుని చేత సశిత మగు నొక భల్ల మును, అవలగ్నబంధమునఁ దీక్ష్ణతరం బగు కటారియు నుండెను. వాని సాహాయ్యముకలిమి నత్యంత గర్వితుఁడై వాఁడు తనకు రానున్నయాపద నెఱుంగక సదర్పముగ ద్వారరక్షణము గావించుచుండెను.

ఇంతలో దైవదుర్విపాకమువలన నాద్వారపాలకునకు రెండుచేతులతోడ నొక్క మాఱుగఁ గాళ్లు గోకికొన వలసిన కారణ మేదియో తటస్థించెను. వెంటనే యామంద భాగ్యుఁడు బల్లెమును గోడకుఁజేర్చి నిలిపి వంగి గోకికొనఁ దొడగెను. ఈయవకాశమున ఖానుఁడు కరీమునిఁ బ్రబో ధించి, తటాలున ద్వారపాలునిపై నుఱికి కంఠము గట్టిగ నొక్కిపట్టెను. తోడనే యూపిరి తిరుగకపోవుటచే బల హీనుఁడై వాఁడు క్రిందఁ బడిపోయెను. ఈసందర్భమునఁ

గంతము నొక్కివేయుటచే నీషద్విరళితమై యున్న వాని నోట గుడ్డలు గ్రుక్కి కరీము వెంటనే కాలుసేతులు బంధించివేసెను. ఇదంతయుఁ దొంగితొంగి చూచుచు నికుంజముచెంతఁ గూర్చుండియున్న తక్కిన విద్రోహులు చాల నానందముతో నచ్చటకు వచ్చి ఖానుకరీముల నెంతయు మెచ్చుకొనిరి. పిదప "ఏనినిఁ గొనిపోయి మొదట బంధింపఁబడిన వారిచెంతఁ బడవేసి చాల జాగ్రత్తగ నుండుఁ" డని ఖానుకరీముల కాజ్ఞాపించి తక్కిన వారిని వెంటనిడుకొని నాయకుఁ డటనుండి కదలెను.

ఆస్థలమున కుత్తరమున సాంద్రముగఁ బెరిగియున్న పూలచెట్లమాటున భట్టాచార్యుని వాసగృహముండెను. అది ప్రాక్పశ్చిమమును, దక్షిణోత్తరమునగు రెండు వెనుబద్దలు కలిపి కట్టఁబడిన సువిశాల మగు సుందరమందిరము. ఇప్పుడా గృహమునఁ బడమటిదెస నున్న యొక గది వివృతమార్గమునవచ్చి దీపపుఁగాంతి కుసుమలతాతరుగుల్మముల గ్రొంబసిమి నిగ్గులను జెంగలింపఁజేయుచుండెను; గాని తక్కిన గదు లన్నియుఁ గవాటపిహితములై యుండెను. దీపముగలయాగది గూడ నిశ్శబ్దముగనుండెను. భట్టాచార్యుఁ డింకను ద్వారమున కెదురుగ, నా స్వచ్ఛ దీపికానికటమునఁగూరుచుండి గీతాభాష్యమును జూచుకొనుచుండెను. అప్పుడు యవనుల నెల్లరను జాటున నిలువఁబెట్టి

యావిద్రోహుల నాయకుఁడు భట్టాచార్యున కెదురుగ నాదీపము వెలుఁగున గంభీరముగ నిలువఁబడియెను.

అప్పుడాకస్మికముగను, అప్రయత్నముగను భట్టాచార్యుని చూడ్కి యెదుట నున్న విద్రోహుల మొనగానిపైఁ బడెను. తోడనే యాతఁడు వానిం జూచి "ఎవరు?" అని పలుకరించెను; గాని వాడుమాట్లాడలేదు.

భట్టాచార్యుఁడు చదువుచున్న పుస్తకమును విడిచి వేసి తీవ్రముగఁ జూచుచు "జగ్గయ్యా!" యని బిగ్గఱగఁ బిలిచెను. జగ్గయ్య గూడఁ బలుకలేదు.

విద్రోహులనాయకుని వయస్సు ముప్పది సంవత్సరముల కించుక దాఁటి యుండును. వాని శరీరము బక్కపలుచనై, సమున్నతమై, శ్యామలవర్ణమై యుండెను. వాని మొలలో నొక్కకై జారుమాత్రముండెను. భట్టాచార్యుఁడు "జగ్గయ్యా!" యని మఱలఁ బిలిచెను; గాని యిప్పుడుకూడఁ బ్రత్యుత్తరము రాలేదు. అప్పుడు నాయకుఁడు భట్టాచార్యునితో "నిప్పుడు జగ్గయ్యకుఁ బని కల్పింపవలసినంత యవసర మేమి వచ్చినది? జగ్గయ్య యొక్కఁడే కాదు. మీనౌకరు లందఱు నిప్పుడెంతపిల్చినను రాఁజాలని స్థితిలో నున్నారు. ప్రకృతము నాసేవకులే మీ యాదేశమును నిర్వర్తింపఁగల" రని చెప్పి ప్రక్కకుఁ జూచెను. తోడనే యాప్రక్క రహస్య

ముగ నిలచియున్న తురుష్క సేనమందుగురు నొక్క మాఱుగ గదిలోఁ జొచ్చి భట్టాచార్యుని చుట్టును మూఁగిరి. అది యంతయుఁ జూచి భట్టాచార్యుఁడు తటాలున లేవఁబోయెను; గాని యొక యవనుఁడు "కదల వలదు. చూచితివా?" యని తన కటారిం జూపుచు భట్టాచార్యునిఁ జేయిపట్టుకొని కూర్చుండఁబెట్టెను. భట్టాచార్యుఁడు తప్పించుకొనుటకెంత ప్రయత్నించినను బ్రయోజనము లేకపోయెను. అప్పుడు నాయకుఁడు వికారముగ నవ్వి "భట్టాచార్యులవారూ! మీరు శ్రమపడ నక్కఱలేదు. మీరు నాకుఁ గావించిన యుపకారమున కిది ప్రత్యుపకార" మని చెప్పి "యిఁకఁ జూడనల" దని యనుచరులను హెచ్చరించెను.

వెంటనే తురుష్క సేనమండ్రును దమ కటారులం దూసి మఱల మాట్లాడకుండ భట్టాచార్యునిపై బడి చిత్రవధఁ గావించివేసిరి. భట్టాచార్యుల యాత్మ సూర్యమండలమును భేదించుకొనిపోయెను. ఈవిధముగా నాతఁడు యవనుల చేతులలోఁబడి, తన భవనమునందే, తన పఠనమందిరమునందే జ్ఞానబోధకమును శాంతిప్రదమును, భవతారకము నగు శాంకరగీతాభాష్యమును మననము గావించుచు నిముసములో నశ్రమముగఁ బ్రాణములు విడిచెను.

పిదప దురంతకులనాయకుఁడు చాల సంతసించి యనుచరులలోఁ గొందఱి కిల్లు దోఁచుకొనన నాజ్ఞయిచ్చెను. మిగిలిన వారినిఁ జూచి "భట్టాచార్యుఁ డిప్పు డింట నేకాకియై యున్నాఁడు. ఈతని కిరువురు కొడుకు లున్నారు; గాని ప్రకృతము వారన్యత్ర నుండుటచే నీశవము దిక్కుమాలిన దైపోయినది. దీని నిట్లే విడిచిపోవుట మనకు ధర్మముగాదు. ఇప్పు డాకొడుకు లిరువురు నిచ్చట నుండినచో నేమిచేసెదరో యాపని మనమే చేయుద" మని చెప్పి, తిన్నగ నంటయింటిదెసకు బయలుదేఱెను. అచ్చట నంటచెఱకు గుట్టలుపడియుండెను. అందునుండి శవదహనసంస్కారమునకుఁ గావలసినన్ని తీసికొనిరండని యవనులకు నియమించి నాయకుఁడు యథాస్థానమునకు వచ్చి కూర్చుండెను.

తమనాయకుని యాజ్ఞాప్రకార మాయవనులు కట్టెలం గొనివచ్చి సువిశాలమును, మనోహరమును, బుస్తకపూర్ణము నగు నాగదియందే యొక చితిఁ బేర్పఁ దొడఁగిరి. అట భట్టాచార్యుని యాసనమునకుఁ బ్రక్క మషీజలమును, లేఖినియుఁ, గాగితములును సిద్ధముగ నుండెను. వానిం గొని నాయకుఁ డేమో వ్రాయఁ దొడఁగెను.

ఒకింత తడవునకుఁజితినిర్మాణము పూర్తియయ్యెను. అప్పటి కప్పుడే నాయకుని వ్రాంతగూడ సంపూర్తి

యయ్యెను. ఇంటిదోపుడు ముగించుకొని తక్కిన యావనులు సైత మచ్చటకు వచ్చిరి. ఇది యంతయు నిశ్శబ్దముగనుఁ గడు శీఘ్రముగను జరిగిపోయెను. పిదప నాయకుఁ డిరువురు తురుష్కుల సాయంబున భట్టాచార్యుని కళేబరమును జితి నధిరోహింపఁజేసి చిచ్చు ముట్టించెను. యవనుల ప్రయత్నమువలన నగ్నిహోత్రుఁడు క్షణములో విజృంభించెను. తోడనే యిఁక రండని చెప్పి నాయకుఁ డనుచరసహితముగ నివ్వాలకు వచ్చెను. భట్టాచార్యుఁడు ఈతీరునఁ దన యింటియందుఁ జంపఁబడుటయే గాక, యచ్చటనే దహనసంస్కారముగూడఁ గావింపఁబడియెను.

పిదప విద్రోహులును, నాయకుఁడును బూఁదోఁట నడుమ నిలిచి యొకరినొకరు చూచుకొని మందహాసము గావించుకొనిరి. కొందఱి మందహాస మకలుష చంద్రికాలహారిని బ్రవృద్ధము గావించును; గాని యిది యట్టిది గాదు. సహస్రమయూఖుని యమలినకాంతిపూరము నెదుటఁ దాటాకులమంట యెట్లు కళావిహీనమై యుండునో సానలుదీఱిన జాతిరత్నము నెదుటఁ క్షుద్రకాచశకల మెట్లు తేజోవిహీనమై యుండునో యాయఖండశరత్కాముదీలహరియం దాదురంతకుల దరహాసము అట్లే వికటమై, తేజోహీనమై, హృదయభేదకమై యుండెను.

పిదప నెల్లరును ద్వారరక్షకులచెంత కరిగిరి. అట

వాండ్రనుగాచికొనియున్న యవనులు వారి నారసి, సంభ్ర మముతో దిగ్గున లేచి "యేమైన"దని యడిగిరి. "ఏమి కావలెనో యదియే యైనది. ఇఁక నీమందభాగ్యుల ప్రాణ ములతో మనకుఁ బ్రయోజనములేదు. మనము వెడలిపోయిన పిదప నెప్పటికైన వాండ్రకుఁ జైతన్యము రావచ్చును. ప్రసాదరాయఁడు వచ్చి వాండ్రవలన మనలం గుఱించి యేమైనఁ దెలిసికొనఁ గలఁడేని దెలిసికొననిండు. చైత న్యమువచ్చిన తరువాత వాండ్రిక్కడ జరిగిన కృత్యములను జూచి తమ యజమానునికొఱకు మనసారవిచారింపనిండు. వాండ్రలో జగ్గయ్య యనువాఁడు ఠాణేదారునకు నచ్చిన బంటు. వాఁడసామాన్యుఁడు. అయినను వానికి నదియే శిక్ష" యని చెప్పి నాయకుఁడు తానువ్రాసిన కాగితము నొక పారావని చొక్కాజేబులో నుంచి యిఁక రండని ముందు బయలుదేఱెను. యవను లాతని ననుసరించిరి. క్షణములో నా పండు వెన్నెలలో నా దురంతకులు నిరపా యముగ నా యూరువిడిచి పోయిరి.

## 2

ద్వితీయ యామము గూడ నతీతంబయ్యెను. ఆకసమున నల్వంకలను ధవళవసనములంబోలు శరన్మేఘశకలములు

అటనటఁ గౌముదీ ప్రసారము కలిమిఁ దళతళ మెఱయు చుండెను. కువలయమునెడల శీతమయూఖునకుం గల దయామృతసారము వర్షించుచున్నదో యనునట్లు దట్టముగ నీహారము వర్షించుచుండెను. కళానిధి యొనరించు చక్కిలిగింతలవలనఁ బరవశలై తొగకన్నెలు సుఖసాగరమునఁ దేలియాడుచుండిరి.

అట్టి సమయమునఁ దుల్యానదిలోఁ దెడ్లతాఁకుడుల వలనఁ గలిగిన దబదబధ్వనులును, నావికులపాటలును, వాయువశమునఁ జల్లఁగ వినవచ్చుచుండెను. మృదంగ ధ్వనులను భేదించుకొని గీతారావము లెట్లు వినిర్గతము లగునో యట్లే యాపాటలు తెడ్లశబ్దములను భేదించుకొని వినవచ్చుచుండెను. అనంతకౌముదీ విలసనము వలననో, సుకుమార వాయు ప్రసారమువలననో, గంభీరంబగు నిశీథినీసమయం బగుటనో, నీహారప్రవర్షణముచే వాతావరణము శీతలం బగుటనో, మనోమోహినియగు ప్రకృతికామిని హృదయమునకు నైర్మల్యమును బ్రసాదించుచుండుట వలననో, జన్మమధ్యమున గానశాస్త్రశిక్ష యన నెట్టిదో యెఱుఁగని యాక్షుద్ర నావికులు పాడు పాటలు గూడ నెంతో శ్రావ్యములై యుండెను. వానిభావ మిట్లుండెను.

## —: గీతము :—

అధికదుర్దమనీయ తుల్యాప్రవాహ
మందుఁ బడి కొట్టుకొనిపోయి యంతమునకు
మఱల మొదటికి రాఁగల్గు సుమ్మఁ గూడఁ
ప్రబలసుఖదుఃఖ వీచుల పాలుఁ జేసి. 1

ఆమయావర్తములఁ ద్రిప్పి యంతఁ బోక
క్రమ్మఱం దేలనీక యగాధవిలయ
మను జలధి ముంప శక్తి యున్నంతమాత్రఁ
గాలమా? నీకు నంతటి గర్వ మేల. 2

అరసిచూడుము నీదు నిరంకుశాధి
పత్యమున కించుకేనియు వశులు గాక
ఉత్సవముతోడ నీ కెదురొడ్డి నిలిచి
తివిరి నీ వేగ మెల్ల మందీకరించి. 3

సహాధికోత్తుంగవీచులఁ జక్కఁ జేసి
యిమ్ముగా నీకు సంకర తెల్లఁ దీర్చి
సరగ సరళప్రచారత సంఘటింపఁ
గల మహాత్ము లనేకులు కలరు సుమ్ము. 4

అసమకర్కశకలుషమానసముతోడ
భీకరంబుగ నీవు గాస్పించి నంత

హృదయవీథి భయంబు వహింపఁబోక
పట్టువిడువక మత్రాంగబలము మెఱయ 5

నతితర మ్మగు నీదు దార్ష్ట్య మ్మడంచి
పరమసుకుమారమైన రూపంబు గూర్చి
నీవయి నిజాధికారంబు నెఱపు నేర్పు
గల మహాత్ముల నేకులు గలరు సుమ్ము. 6

అంతకంతకు గానము దగ్గరగా వినవచ్చుచుండెను. చిరుతరగలపై జ్యోత్స్న ప్రతిఫలించుటచే జిత్రదర్పణ ప్రతిమానం బగుతుల్యా జలప్రవాహమును భేదించుకొని వచ్చుచున్న నౌక దృక్పథమునఁబడియెను. చూచుచుండఁగనే యా చిన్ని నౌక క్షణములోఁ బులిబూరు ఘట్టమునకువచ్చి చేరికొనియెను. నావికులు తెడ్లు వేయుట మాని నౌకను మెల్లగఁ దీరమునకుఁ జేర్చి కట్టివేసిరి. మాలిమికాఁడు లేచివచ్చి లోనికిఁజూచి "బాబూ! వచ్చితిమి. ఇఁక దిగవచ్చు" నని చెప్పెను.

వెంటనే సుదృఢదీర్ఘకాయుఁ డగు నొక పురుషుఁడు నౌకాగర్భమునుండి పైకివచ్చి, నలుదెసలు దిలకించి రొండలు విఱిచికొని యావులించి, "దిగుడుబల్ల సమర్పు" మని మాలిమికానితోఁ జెప్పెను. ఆతని కంఠస్వరము మధురమై, శ్రావ్యమై, గంభీరమై యుండెను. ముఖమం

డలమాయతమై, మనోహరమై, పట్టుకుచ్చులంబోలు మీసములచే గభీరమై, దర్శనీయమై యనంతజ్యోత్స్న ప్రసారమువలన మెఱయుచుండెను. సమున్నతము లగు నురఃస్థలమును, మాంసలము లగు భుజాదండములను, గోపనము గావించు కాశ్మీరశాలువయు, పాదముల నొఱయు పట్టంచుల కట్టుపంచెయుఁ, గుడిచేతి కనిష్ఠాంగుళినలంకరించు స్వర్ణాంగుళీయమున స్థగితంబై యున్న చిన్న రతనము, నతనిసంపన్నతను జాటి చెప్పుచుండెను.

ఆజ్ఞయైన క్షణములో నావికులు మెట్లబల్ల నమర్చిరి. అప్పుడా పురుషుఁడు నౌకాగర్భమువంకజూచి "జానకీ" యని పిలిచెను. తోడనే యప్పుడే నిద్రనుండి మేల్కొని బద్ధకమువలన మందమైనస్వరముతో నొక స్త్రీ యెందుల కని యడిగెను. "నొక పులిబూరుఘట్టమునకు వచ్చినది. ఇఁక దిగవలెను. రా" మ్మని యాతఁడు మఱలఁ బిలిచిన వెంటనే యించుమించుగ నిరువదినూఁడేండ్ల వయసుగల యువతి పడవమీఁది కెక్కివచ్చెను.

శ్వేతవస్త్రధారణమువలనను, భూషణములను ధరింపకుండుటను, ముఖమునఁ దిలకము లేకపోవుటవలనను, ఆమె విగతభర్తృక యనివిస్పష్టముగఁ దెలియవచ్చుచుండెను. అయిన నామెశీర్ష మింతవఱకే కారణము వలననో ముండితము కాకయుండెను. తుమ్మెదరెక్కలంబోలు

కబరీరాశి వితంతువుల కుచిత మగు రీతిని ముడువఁబడి మెడపై నడయాడుచుండెను. ఆమె యట్టి స్థితిలో నుండి నను నల్లకలువ రేకులంబోలు కన్నులవలనను, ధనుస్సన్నిభము లగు భ్రూలతలవలనను, దర్పణప్రతిమానములగు కపోలఫలకములవలనను, సువిశాల ఫాలతలమువలనను, ప్రవాళాధరమువలనను ముఖమండలము మనోమోహనమై, మహోదారసుగుణములకు నికేతనమై కృపానిలయమై పూజ్యభావజనకమై యుండెను. తనువల్లి సుకుమారమై పొడవును బొట్టియుఁ గాక బలిష్ఠమై మంజులమై స్వచ్ఛసువర్ణచ్ఛాయగలిగి లావణ్యవాహినియై యలరారుచుండెను; గాని దుర్భర వైధవ్యమువలన నామె యపారసౌందర్యలహరి మరుభూమిం బ్రవహించు నిర్ఝరిణివోలె నిరర్థకమై పోయియుండెను.

అట్లు నడవమీఁది కెక్కివచ్చిన జానకి ఘ్రాణము నభినయించుచు జూడ్కులు నాల్గుదెసలకుఁ బఱపి "మామా! సమీపముననే యేదో శవము దహనము చేయఁబడుచున్నట్లు తోఁచుచున్నది. అదియేమో" యని ప్రశ్నించెను. అపుడు పురుషుఁ డది గ్రహించి "నేను గ్రహింపఁ జాలక పోయితిని. ఇక్కడకు శ్మశానవాటిక చాలదూరమున నున్నది. ఈకము పకంపింతదూరము వచ్చుటకుఁ గారణము కానుపింప" దని జానకి సందేహమును బలపఱిచె.

తుద కేరికిని సందేహము తీఱలేదు. "ఈసమీపమున నేజంతువైనఁ గుళ్ళి యట్లు గంపుకొట్టుచున్నదేమో!" యని మాలిమికాఁడు చెప్పెను; ఈసందేహముతోడనే మొదటఁ బురుషుడునుఁ బిదప జానకియు నాకాంతరణము కావించి యూరిదారిఁ బట్టిరి. మాలిమికాఁడు కళాసులచే లోపల నున్న పెట్టెను బరపులను బట్టించుకొని వెనుక బయలుదేఱెను.

# 3

జానకి గోవిందభట్టాచార్యుని జ్యేష్ఠపుత్రిక. పురుషుఁ డాతని స్యాలకుఁడగు మాధవశర్మ. ప్రసాదరాయుని సతి యగు రాధాదేవి రాజమహేంద్రవరమునఁ బుట్టినింట నుండెను. మకరసంక్రమణమున కని చెప్పి యామె జనకుఁడు వచ్చి యల్లునాహ్వానించి కొమార్తను ముందుగఁ దీసికొని వెళ్లెను. జానకికి నామెకు నొకటే ప్రాణము. రాధ పుట్టింటికి కరిగి యొక నెలయైనఁ గాకపోయినను, జానకి యీ స్వల్పకాలపు వియోగమునకే యోర్వఁజాలక తన యనుంగుచదినె నొకమాఱు చూచి వచ్చుటకు వారముదినముల క్రిందట రాజమహేంద్రవరమున కరిగి యుండెను.

సుహేంద్రభట్టారకుని భార్యకుఁ దలిదండ్రులు తొలుత నేదో పేరు పెట్టియుండిరి; కాని యాతని కది మనస్కరింపలేదు. అక్కారణమున నాతఁడు తన భార్యను శచీదేవి యని పిలుచునట్లు చేయవలసిన దని తన సోదరికి కెఱింగించెను. తోడనే జానకి యామె నట్లు పిలువవలసినదని యెల్లరను శాసించెను. పుట్టింటఁ దక్కఁ దక్కినచోట్ల నాఁటనుండియు నామె యట్లే పిలువఁబడుచుండెను. ఆమె నాల్గుమాసముల క్రిందట ప్రథమరజస్వల యయ్యెను. ఆమె యిప్పుడు పుట్టినింట ధవళేశ్వరమున నుండెను. జానకి కీప్రయాణమున శచీదేవినిఁ జూచివచ్చుట కూడఁ గలిసి వచ్చెను. ఆమె నేఁడు ధవళేశ్వరమునుండియే బయలుదేఱి వచ్చెను. మాధవశర్మ భట్టాచార్యునిచే నాజ్ఞప్తుఁడై మేనగోడలినిఁ దీసికొనివచ్చుటకుఁ బోయి యుండెను. ఆతఁడును బులిబూతునివాసియే.

నిముసములో వారు భట్టాచార్యుని యింటికి వచ్చి చేరిరి. చూడఁగా వారి కానిశీథసమయమునఁగూడ సింహద్వారము తెఱువఁబడియే యుండుట తెలియవచ్చెను. సాధారణముగా నా ద్వార మట్టి సమయములయందుఁ దెఱువఁబడి యుండు నలవాటు లేదు. ఈకారణముచే వా రాశ్చర్యచకితులై "యేమిది!" యని యచ్చటనే నిలువఁబడిపోయిరి. అప్పుడు వారికా దుర్వాసన గూడ

మఱింత యధికమై బాధింపఁ దొడఁగెను. వారిహృదయములయం దేర్పరింపరాని యాందోళన మేదియో పొడసూపి కలఁచివేయసాగెను. అంతలో నావికులువచ్చి "బాబూ! నిలిచితి రేల? తలుపు తెఱువఁబడియే యున్నది గాదా!' యని మెల్లగఁ జొచ్చిరి. మాధవశర్మ వారి కేరికిని బ్రత్యుత్తర మీయకయే "జగ్గయ్యా!" యని రెండుమూఁడుతడవలు పిలిచెను. ఎంతకును బ్రత్యుత్తరము రాకపోవుటఁ జూచి జానకిని రమ్మని చెప్పి యాతఁడు సోపానారోహణము గావింపఁ జొచ్చెను.

నావికులు గుమ్మముదాఁటి లోపలఁ బ్రవేశించి బల్లెము గోడకుఁ జేర్పఁబడి యుండుటఁ గాంచి "జగ్గయ్యగారూ!" అని పిలిచిరి; గాని జవాబు రాదయ్యెను. అప్పటికి మాధవశర్మయు, జానకియు లోపలకువచ్చిరి. మాధవశర్మ యెవరును బలుకలేదా? యని యడుగుచు నాకస్మికముగ మోమెత్తి యెదుటఁ జూచెను. అప్పు డాతనికి భట్టాచార్యుని గదినుండి చుట్టలుచుట్టుకొని వచ్చు సనంత ధూమరాశియు, నా సాంద్రధూమపటలమును భేదించుకొనివచ్చు మంటవెలుఁగును దృగ్గోచరము లయ్యెను. వెంటనే యాతఁ డాశ్చర్యచకితుఁడై తటాలున నాగది చెంతఁ కరిగెను. నావికు లాతనిని వెంబడించిరి. జానకి నిశ్చేష్టయై తుద కచ్చటఁ జేరుకొనియెను.

అప్పటికి వారి కాగడియుండే యేదో శవము దహనసంస్కారము గావింపఁబడుచున్నట్లు తోఁచెను. అనంతదుర్గంధమును సహింపఁ జాలక జానకి యటనుండి కదలి యంగణముదెసకు బయలుదేఱెను. ఆయంగణ మునఁ గల దీపము లన్నియుఁ జక్కఁగ వెలుఁగుచుండుట వలన గదు లన్నియుఁ దెఱువఁబడి యుండుటయు, వాని యందలి సామానంతయుఁ జెదరిపడి యుండుటయు నామెకుఁ దెలియవచ్చెను. అంత జానకి హృదయ మొక్కమాఱుగ వేయిశకలములుగ బ్రద్దలై పోయెను. తోడనే యామె నిలువలేక "మామా! ఇంట నేదో ఘోరకృత్యము జరిగిపోయినది" యని యేడ్చుచుఁ గూలఁబడియెను.

ఈ విపరీత మేమో తెలిసికొనవలయు నని మాధవ శర్మ యుక్కిరి బిక్కిరి యొదవించు నా ధూమరాశిని, ఆదుర్గంధమును లెక్కసేయక గదిలోని కరిగెను. తోడనే యాతని కంతయుఁ దెలిసిపోయెను. అప్పటికప్పుడే కపాల మోక్షం బైపోయియుండుటవలనను, మిగిలిన కళేబర మంతయుఁ దీవ్రానలజ్వాలలచే నావృతమై కసులిపోయి యుండుటవలనను, నిదమిత్థమని నిర్ణయించుట కవకాశము లేకపోయినను, భట్టాచార్యుని సంగుకామీఁద విప్పఁబడి యున్న గ్రంథము, కూరుచుండు పఱుపు, నోఱగునిండి

యయు, రక్తసిక్తములై యుండుటవలనను, శవ పరిమాణ, మును బట్టియు, నింక నొకటి రెండు దృష్టాంతములవలనను, దహనసంస్కార మగుచున్న శవము తన బావ మఱిదియగు గోవింద భట్టాచార్యునిదే యని నిశ్చయించుకొని వెలుపలకువచ్చి దిగ్భ్రాంతురాలై నిలువఁబడి పోయెను. ఒకటిరెండు నిముసములాతఁడట్లే యుండెను. పిదప విచారముతో గొంతు ముపశమిల్లఁజేసికొని డగ్గుత్తికతో "జానకీ! కొంప మునిఁగిపోయినది. బావగారి నెవరో పొడిచి చంపి యింటియందే దహనసంస్కారము గావించివేసి"రని చెప్పి మఱల మాట్లాడఁజాలకపోయెను.

ఈవాక్యము వజ్రాయుధమై జానకి హృదయఫలకమునకుఁ దీవ్రముగ నాటెను. ఇంతవఱకును జానకి యిట్టి వజ్రాఘాతములను రెంటి ననుభవించి యుండెను. ఇది మూఁడవది. దుర్భరము లగు భర్తృమరణమువలనను, దల్లి మరణమువలనను, బీటలువాఱి యున్న యామంద భాగ్యురాలి హృదయఫలకము తండ్రి మరణసంబంధమగు నీవాగ్వజ్ర ప్రఘాతమువలన సహస్రధా విచ్ఛిన్నంబై పోయెను. అవి రెండును దీనికంటె గురుతరతీవ్రాఘాతములే యైనను, వానివలనఁ గలిగిన మనోదౌర్బల్యముచే నిదియే గురుతర మైనదిగఁ దోఁచెను. జానకి యావిషాదమును సహింపలేక ఘోరముగ విలపింపసాగెను.

ఇంతలో నావికులు వచ్చి యెవరో యిల్లంతయుఁ గూడ దోచుకొనిరని చెప్పిరి. మఱియు వాండ్రు ఇల్లంతయు నిర్మానుష్య మైయున్నదనియు, నెచ్చటను జీను మైనఁ జిటుక్కు మనుట లేదనియుఁ, జిన్న దొరగారును, బుల్లిదొరగారును గూడ నెందును జాడలేరనియుఁ గూడఁ జెప్పిరి. జానకి యామాటలు గూడ వినియెను. తోడనే యామె విచార మిబ్బడి యయ్యెను. హఠాత్తుగ నాలుగుపనదులువచ్చి కలిసినపుడు నది యెంతకూలంకషమై ప్రవహించునో యా మాటలు వినుటవలన జానకి కన్నుల నుండి యశ్రులహారి యంత పొంగిపొరలుచుఁ బ్రవహింపఁ జొచ్చెను.

ఇదంతయుఁ జూచి సంకుచితమైపోయి యున్న హృదయమున యోచనము గావించి మాధవశర్మ "పెద్ద బందిపోటుగాండ్ర గుంపొకటి వచ్చి యూరంతయుఁ గొల్లగొట్టి యుండవలెను. అట్లుగాకున్న విక్రమోద్భటు లగు నిన్నూర్గుర ఆశ్వికవీరులకు నిలయమైయున్న యీయూర సర్వాధికారులగు ఠాణేదారుగారి యిల్లు దోచుకొనిపోఁబడుటయు, యోధానుయోధులగు ఠాణేదారుగారును మహేంద్ర భట్టాచార్యుఁడును గాన్పింపకపోవుటయు భట్టాచార్యులవారింటియందే చంపఁబడుటయుఁ దటస్థించి యుండదు. సంగతి సందర్భము లన్నియుఁ జూడ నూరం

తయు నిట్లు కొల్లకొట్టఁబడి శవములతోడను క్షతుల తోడను వ్యాప్తమై నిర్మానుష్యమై యుండునట్లు తోఁచుచున్నది. బందిపోటుగాండ్రు ఊరినంతటను దమ దౌర్జన్యము నెఱపియుండనిచో నింతటి ఘోరము జరిగినప్పు డూరంతయు నిట్లు నిశ్శబ్దమై యుండుట పొసఁగదు వీరాధివీరుఁ డగు జగ్గయ్య కానిపింపక పోవుటను, నాతనిచేతి నిశితభల్లము గోడకుఁ జేర్పఁబడి యుండుటకుఁ గూడఁ గారణము స్ఫురించలేదు. గ్రామస్థితి యెట్లున్నదో మీరు పోయి చూచి రండని నావికులను నియమించెను.

అచ్చటి స్థితిగతుల నరయుటవలనను, మాధవశర్మ యాజ్ఞను వినుటవలనను, నావికుల యుల్లమును జల్లుమని డిల్లపోయెను. ధైర్యము చెదరిపోయెను. తోడనే యుద్దండమగు బందిపోటుగాండ్రగుంపొకటి వారి యాంతరంగిక చక్షుస్సుల యెదుట సాక్షాత్కరించెను. ఇంక నేమిచేయవచ్చును? మాధవశర్మ యాజ్ఞ యవిలంఘ్యము. ప్రాణములకైన నాశవదలుకొని యూరంతయుఁ దిరిగి చూచి రావలసినదే. ఇంకఁ జేయునదిలేక తుదకు నావికులు మొగములు వ్రేలవైచికొని కాళ్లు కంపింపఁ గొనయూపిరితో గ్రామములోనికిఁ బయలుదేరిరి.

మాధవశర్మ జానకిచెంతఁ గూరుచుండి యామె ననేకవిధముల నూరడింపసాగెను; గాని యా ప్రయత్నమంతయు

వ్యర్థమై పోయెను. మహావిద్వాంసుఁడై, దేవేంద్రవైభ
వము ననుభవించి జగజ్జెట్టులైన కుమారులకై సాంసా
రికభార మంతయు నుంచి, గ్రంథపఠనముతో శాంతిము
గఁ గాలము బుచ్చుచు, రాజర్షివలె దివ్యతేజశ్శాలియై
యొప్పుచుఁ దల్లియుఁ దండ్రియుఁ దానయ్యెయుండి నేఁ
డిట్టినికృష్ట మరణము పాలైన భట్టాచార్యునిఁ దలఁచు
కొని జానకి యేడుపకుండ నుండఁజాల పోయెను. అప్ర
యత్నముగఁ బ్రవహింపఁదొడఁగిన యావిచారలహరి
యెంత ప్రయత్నించినను నిరుద్ధము గాక పోవుటయేగాక
యంతకంత కధిక మగుటయు, దానితోఁ బాటు రోదన
ధ్వని హెచ్చయిపోవుటయుఁగూడఁ దటస్థించెను. జగ
మంతయు నిశ్శబ్దముగ నుండుటవలన నారోదనధ్వనులు
చాలవఱకు వ్యాపింపసాగెను. అడవిని గుఱితించి నావ
మీఁది తక్కిన నావికులు గూడఁ జనుదెంచి, వృత్తాంత
మంతయు విని, చాలవగచి, మాధవశర్మచే నాజ్ఞప్తులై
గ్రామమున కుత్తరపుదిక్కున నున్న యాశ్వికసేనానివే
శపు స్థితిగతుల నరయుటకును, నక్కడ నేమియుఁ గల్లో
లము లేక రౌతులు నిదురించుచున్నచో లేపి తీసికొని
వచ్చుటకును బయలుదేరి పోయిరి.

గ్రామస్థితిగతుల నరయుటకై తొలుత నియుక్తులై
పోయిన నావికులిరువురును, దక్కినగృహము లన్నియుఁ

గవాటపిహితములై యుండుటఁ జూచి యా ఘోరావస్థ తమ యజమానుని కొక్కనికే తటస్థించెనని యూహించిరి. ఈయూహావలన భయప్రభంజనహతిచే గడగడలాడి పోవుచున్న వారొకింత కోలుకొనిరి. ఆరాట మొకింత శాంతించెను. కాళ్లయందలి కంపమును, గంఠమునందలి గాద్గద్యమును గూడ నొకింత యుపశమిల్లెను. ఆలుబిడ్డ లేమైపోయిరో, కుటీరము లెంత విధ్వస్తము లైపోయినవో యను విచారము మొదలంట నశించిపోయెను. కేవలము తమ యేలిక దుర్మరణమును గుఱించియు, నాతని యింటిదోపుడును గుఱించియు నొదవిన విచారముమాత్ర మప్పుడు వారిని వేధింపసాగెను; గాని యది సామాన్య మైనదియా? స్వకుటుంబవిషయికము లగు నపాయశంకల వలనను, దమ బ్రతుకునందలి నిరాశవలనను, ఇంక ననేక విధములగు విచారములవలనను హృదయము కలఁగి పోయి యుండుటచే నింతవఱకును వారావిచారపరిమితినిఁ దెలిసికొనఁజాలక పోయిరి. ప్రకృత మాశంకయు నానిరాశయు, నావిచారము నంతర్హితంబు లగుచు, మహైశ్వర్య సంపన్నుఁడును, భోగదేవేంద్రుఁడును, వీరాధివీరుఁడును, గరుణామయుఁడును, అనాథులను సేవకులను బ్రేమించి యాదరించు దీనబాంధవుఁడును, దమకుఁ బోషకుఁడు నైన భట్టాచార్యుని ఘోరమరణమును గుఱించిన విచా

రము మేఘప్రతిసీరనుండి వెలువడిన గ్రీష్మభానుని ప్రచం డాతపమువలె వారికి మర్మోద్ఘాటనము గావింపఁ బ్రారం భించెను.

ఈ దుస్సహదుఃఖమువలన వాండ్ర కున్న రవంత ప్రాపంచిక జ్ఞానమును గూడ నశించిపోయెను. తుద కున్మాదావస్థ తటస్థించెను. ఈరూపమున భయ మం తయు మటుమాయమైపోయెను. తోడనే వాండ్ర కెప్పు డును లేని బలము వచ్చెను. దానినే ప్రాజ్ఞులు వెఱ్ఱిశక్తి యందురు. వెంటనే వాండ్రు తలుపులు బద్దలై పోవునట్లు తట్టుచు, గొంతెత్తి గృహయజమానులను బేరులుపెట్టి పిలుచుచు దమ పిలుపులకు గృహనాథు లిచ్చు ప్రత్యు త్తరములను వినిపించుకొనకయే మఱలమఱల పెట్టించి పిలుచుచుఁ క్షణములో గ్రామ మంతయు గగ్గోలుపడఁ జేసిరి. తమ రాక్షసకృత్యములకు వెఱచి లేచివచ్చి యేమి యేమని స్థితిగతులను దెలిసికొనఁగోరెడి యెల్లరతోడను వాండ్రు "ఇఁక నేమియుఁ దరువాయిలేదు. పెద్ద బంది పోటుగాండ్ర గుంపు వచ్చి తాణేదారుగారి యిల్లంతయుఁ గొల్లకొట్టి భట్టాచార్యులవారిని హత్య గావించి వారి శరీరము నింటియందే దహనము కావించివేసి లేచిపోయె" నని చెప్పందొడఁగిరి.

అట గుజ్జుపురాతులను బ్రబోధింపనరిగిన నాయికులు

గూడ నిట్లే యుత్రస్తులైరి. వాండ్రుగూడ నిట్టి కృత్యములనే గావించి యిట్టి సంగతులనే తెలిపిరి. వెంటనే భట్టాచార్యుని యింటికి వచ్చి "నేఁటిరాత్రి బందిపోటునుఁ హత్యయు నిచ్చట మాత్రమే జరిగినవి. సేనానివేశమంతయు నిశ్చలమై యున్నది. రౌతులు నిర్మలహృదయులై గుఱ్ఱుపెట్టి నిద్రించుచున్నా" రని మాధవశర్మ కెఱింగించిరి. గ్రామవాసులను లేపుటకుఁ బోయినవారు గూడ నిట్లే చెప్పిరి.

ఇదంతయువిని మాధవశర్మ తన పూర్వాభిప్రాయములను మార్చుకొనియెను. "ఈ ఘోరకృత్యములు బందిపోటుగాండ్రచేఁ గావింపఁబడినవిగావు. తీవ్రచిత్తులును దుష్ప్రవర్తకులును నగు బావగారి శత్రువు లెవరో యీపని గావించియుందు"రని యాతఁ డూహింపఁ జొచ్చెను. ఆతఁ డీరీతి నూహించుకొనుచు భట్టాచార్యుని చితినుండి యఖండముగ వెలువడివచ్చు ధూమరాశిపై భావరహితములగు చూడ్కులు పఱపుచు జానకి నికటమున నిలిచిపోయెను. నావికులునుబిక్కమొగములతో నట్లేయుండిరి.

## 4

ఇట్లొక గడియ గడచిపోయెను. జానకి యట్లే విలపించుచుండెను. మాధవశర్మయుఁ గళాసులు నామె విచార

ముడుపఁ బ్రయత్నించిరి; గాని లాభము లేకపోయెను. అట్లుండియుండి కళాసులలో నొకఁడు మాధవశర్మతో "చిటిమంట లంతకంత కెగయుచున్నవి. ఇంటికపాయము వచ్చునట్లు తోఁచుచున్నది. వస్తువు లన్నియు జాగ్రత్త చేయుట కర్తవ్యముగాదా" యని పలికెను. ఇందులకుఁ జాల విచారముతో మాధవశర్మ యిట్లు చెప్పెను. "ఇంటి కప్పెత్తుగా నుండుట వలన నట్టి దేదియుఁ దటస్థింపఁ గూడదు. భట్టాచార్యులవా రంతటివారికే యపాయము వచ్చినపుడీక నింటి కపాయము వచ్చినఁ జింతయేమి? జాగ్రత్తచేయుటకు దొంగ లేమివస్తువులను మిగిల్చిపోయిరి? కాని మనమిట్లు కూర్చుండుట వలనఁ బ్రయోజనమేమి? ఇది యేమో తెలిసికొనఁ బ్రయత్నము సేయవలదా!"

ఈప్రశ్నములకుఁ బెద్ద కోలాహల మేదో యొకటి ప్రత్యుత్తర మయ్యెను. సముద్రఘోషమువలె నవ్యాహత మగు నాజనఘోషము నాలకించి మాధవశర్మయుఁ గళాసులు నులికిపడిరి. వెంటనే మాధవ శర్మ వీధిగుమ్మము దెసకుఁ జూచెను. అతని యింగితము నెఱింగి యొకనావికుఁడు వీధిదెసకుఁ బర్వెత్తెను. అంతఁ నాకోలాహలము భేదించుకొని యొక యబలారోదనధ్వనులు వినవచ్చెను. తోడనే యంతవఱకు నొకింత ధైర్యముతో నుండిన

మాధవశర్మ హృదయము మొకింత చలించెను. కన్నులు బాష్పోదకముచేఁ జిప్పిలెను. అయినను అతిప్రయత్నమున విచారమును దిగమ్రింగికొని యాతఁడు నావికుని బిగ్గఱగఁ బిలిచెను. కనుమూసి తెఱచునంతలో వాఁడు వచ్చి "ఊరివారందఱును వచ్చుచున్నారు. అందఱకు ముందుఁ గుమారస్వామిగారును వారివెంట విలపించుచు రుక్మిణీదేవిగారును వచ్చుచున్నా" రని చెప్పెను. ఇంతలో రుక్మిణి ద్వారముదాఁటి లోపలకు వచ్చెను; గాని జానకియు రుక్మిణియుఁగూడ బిగ్గరగ నేడ్చుచుండుటవలన నింతవఱ కొకరియేడుపొకరికి వినఁబడలేదు. రుక్మిణి జానకిని గనులతోఁ జూచుటయు ఆమె రోదనమును వినుటయు నొక్కమారే జరిగెను. రోడనే రుక్మిణివచ్చి జానకి యొడిలోఁబడి యేడువసాగెను. అప్పటి కప్పుడే కుమారస్వామి యక్కడకు వచ్చెను.

రుక్మిణీదేవి గోవిందభట్టాచార్యుని ద్వితీయపుత్రిక. ఆమె భట్టాచార్యుని కడగొట్టు సంతానము. కుమారస్వామి యామె భర్త. అతఁడు గూడ ఆగ్రామనివాసియే.

జానకిని, మాధవశర్మను జూచి కుమారస్వామి తెల్లవోయెను. అంతవఱకును గుమారస్వామికిఁగాని మఱియెరికిగాని మాధవశర్మ యొక్కయు జానకియొక్కయు ఆగమనము తెలియదు. మాధవశర్మయుఁ గుమారస్వామి నరసి

నిర్విణ్ణుఁడై "అతిదారుణ మైనవ్యాపారము జరిగిపోయి నది. దాని యాద్యంతము లేమియుఁ దెలియుట లేదు. దహనసంస్కృత మగుచున్న భట్టాచార్యులవారి శవ మొక్కటియే కాన్పించు చున్నది. ప్రసాదరాయఁడును మహేంద్రభట్టారకుఁడునుగూడఁ గాన్పించుటలేదు. ద్వార రక్షణముగావించు జగ్గయ్యగూడఁ గాన్పించుటలేదు. ఆతని బల్లెముమాత్ర మాతని స్థానమున గోడ కానుకొని యున్నది. ఇల్లంతయుఁ గొల్లగొట్టఁబడినది"యని చెప్పెను. అప్పుడు కుమారస్వామి యిట్లు చెప్పెను. "రామవరము నివాసికరణమునకు సన్నిహితదాయాదుఁ డగు భుజంగ రాయని నెఱుంగుదురుగదా? వాఁడు రామవరపు రహితులుచేసిన యవమానమునకు బదులుగా మొన్న నూరంతయుఁ దురకలను దీసికొనివచ్చి కొల్లకొట్టింపఁ బ్రారంభించెను. ఈసంగతి వెంటనే ఇక్కడఁ దెలిసిపోయెను. క్షణములో మన గుఱ్ఱపుబలము పోయి యాదండును జెల్లాచెదరు గావించివేసెను. హతశేషులగు దురంతకులు పారిపోయిరి. నష్టమేమియు రాకుండగనే విద్రోహులను దఱిమివేయుటచే సంతోషించి రాజావా రక్కడనుండియే బావల నిరువురను నిజస్థానానికి రప్పించుకొనిరి. ఇఁక నిక్కడి ఘోరమును గుఱించియే మనమాలోచన సేయవలసియున్నది."

ఇది విని మాధవశర్మ యంతయు గ్రహించుకొనెను. "పలాయనము గావించిన విద్రోహులే యీదారుణ వ్యాపారమునకుఁ గర్త" లని యాతఁడు నిశ్చయించుకొని యెను. మాధవశర్మయుఁ గుమారస్వామియుఁ గలిసి మఱల జానకీ రుక్మిణుల నూరడింపఁ జూచిరి; గాని దైవ స్వరూపుఁడు, ప్రేమైకనిలయుఁడు, కరుణామయుఁడు, మంగళాకాంక్షి తల్లియుఁ దండ్రియునైనవాఁడు నగు భట్టాచార్యునిఁ దలంచుకొని పిలపించుచున్నవారి కామా టలు వినఁబడనే లేదు. మాధవశర్మయుఁ గుమార స్వామియుఁ దుద కాప్రయత్నము మానుకొనిరి.

ఇంతలో నూరివా రందఱు నొక్కరొక్కరే వచ్చి చేరిరి. క్షణములో నాస్థల మంతయు జనసంకీర్ణ మైపో యెను. వృద్ధులు, తరుణ వయస్కులు, బాలురు, స్త్రీలు నెల్లరును భట్టాచార్యుని గుఱించి వగవ సాగిరి. జానకీ రుక్మిణుల విచారము మఱింత వృద్ధి యయ్యెను.

అందఱు నీఘోరమును గుఱించి యనేక విధములఁ జర్చ ప్రారంభించిరి. కొందఱు "ఇది భట్టాచార్యుని ప్రాఁత శత్రువులెవరో చేసియుందు" రనిరి. మఱికొందఱు "ఇది దొంగల పనిగాని వేఱుగాదు. భట్టాచార్యులవారు దొం గల నదలింపఁబోయి యుందురు. అప్పుడానీచులమ్మహా శయునిపైఁ బడి సంహరించి యుందు" రనిరి. ఇంకొక

కొంద "ఇది సామాన్య చోరులు చేయఁజాలరు. రామవరము కొల్లగొట్ట వచ్చి, ఠాణేదారుగారి యాద్ధత్యమున కోర్వఁజాలక చెల్లాచెదరై పోయిన బందిపోటుగాండ్రి దుష్కృత్యమును గావించి యుందు" రనిరి. వేఱొకకొంద "ఇంక నచిరకాలమున నేదో గొప్ప యాపత్తు రానై యున్నట్లు తోఁచుచున్నది. దీనికిఁదగు కారణము లేమో తెలిసికొనుటకుఁ బ్రస్తుత మవకాశములు లేకపోయినను అవి ప్రబలములగు రాజ్యాంగ సంబంధములై యుండవలెను. అఖండరాజనీతి విశారదులై దుర్జన భయంకరులై వెలయు భట్టాచార్యమహాశయుల ప్రజాహిత తత్పరతకు విపరీతార్థములు గావించుకొనిన తీవ్రచిత్తులెవరో సమయమును దెలిసికొని యీపనిఁజేసియుందురు. ఆశ్వికవీరులచేఁ దఱుమఁ గొట్టఁబడిన బండిపోటుగాండ్రింతలో నింతటి పని సేయఁగల రని యూహింప నాధారములు లే"వనిరి. ఇంక ననేకు లనేకవిధములఁ జెప్పుకొనిరి! తుదకు "ఈయూహాలవలనఁ బ్రయోజనము లేదు. ఇప్పుడు కర్తవ్య మేమో నిర్ణయింపవలె" నని యెల్లరు నూరకుండిరి. మాధవశర్మ యట్లే నిలువఁబడి పోయెను. కుమారస్వామి హృదయమున యోచనలు గలఁతిపెట్టుచుండెను. అగుట నాతఁడుగూడ నట్లే యారక్తనేత్రుఁడై నిలువఁబడి పోయెను.

ఇంతలో "నేమి నాయనా! యేమినాయనా!" యని వగర్చుచు నలువదియేండ్ల వితంతుస్త్రీ యొకతె యాజన సంఘమునుండి ముందునకుఁ ద్రోసికొనివచ్చి జానకీ రుక్మిణులచెంతఁ గూలఁబడియెను. ఆమెను జూచి మాయక్క సెల్లెండ్రు మఱింత యేడువఁదొడఁగిరి. రుక్మిణి యామె యొడియందే పడి యేడ్వఁజొచ్చెను. ఆమె భట్టాచార్యుని యింటివంటలక్క. తల్లి చనిపోవునప్పటికి రుక్మిణి మూడేండ్ల పసిపాప. ఆమె వంటలక్కనే అమ్మా యని పిలుచుచుండును. ఆమె వలె అమ్మా యని పిలువక పోయినను జానకి, మహేంద్రుఁడు, ప్రసాదరాయుఁడు నామెను మాతృభావముతోఁ జూచుచు వెంకమ్మ పిన్ని యని పిలుచుచుందురు. వారందఱు నట్లు విచారించుచుండఁగా నొక వృద్ధస్త్రీ వచ్చి మాధవశర్మను జూచి 'నాయనా! మీరు వచ్చి యెంతసేపైన' దనియడిగెను. "పడవవచ్చి రెండుమూఁడు గడియలైనది. ఈదారుణ కృత్యమును వాలుదొల్త మేమేచూచితి"మని యాతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఇంతవఱకును జానకి రాక యెవరు నెఱుఁగరు.

అప్పుడు కుమారస్వామి "వెంకమ్మగారూ! మీరెక్కడ నెంత రాత్రివఱకు నుంటి" రని యడిగెను. తోడనే వెంకమ్మ "నాయనా! నేను భోజనముచేసి వాకిటిలోనికి

వచ్చునప్పటికి భట్టాచార్యమహాశయులు గదిలోఁ గూర్చుండి గ్రంథకాలక్షేపము సేసికొనుచుండిరి. నేను వారి చెంత సెలవుగైకొని నా కూఁతునింటికి బండుకొనుటకుఁ బోయితిని. అప్పటికి జగ్గయ్యయుఁ గుమారవీరయ్యయు వీథి గుమ్మము చెంతఁ గూర్చుండి యుండిరి. అప్పటికి జాము రాత్రి యైయుండును" అనియెను. తా నడుగకుండలఁ జినపల్లియు నడుగక పూర్వమే వెంకమ్మ చెప్పివేయుటచే సరియేయని తలయూఁచి కుమారస్వామి యేమో యాలోచించి మాధవశర్మతో రహస్యముగ "మీరు మీ మేనగోడండ్రను గనిపెట్టుకొనియుండుఁడు. ఆయబలలను జితిచెంతకుఁ బోనీయవలదు. ఆదారుణమును జూచిన ఆయబలలకు హృదయము బ్రద్దలైపోవచ్చు" నని చెప్పి యొక నావికుని వెంటఁ బెట్టుకొని తిన్నఁగ వీథిలోనికిఁ బోయెను.

అతఁడు గుమ్మముదాఁటునప్పటికి అతిరభసమునఁ జనుదెంచుచున్న గుఱ్ఱపురౌతులు దృక్పథమునఁ బడిరి. వెంటనే యాతఁడు నడివీథిలోనికిపోయి నిలిచెను. రౌతులు తమ చేతులయందలి బల్లెములు తళతళ మెఱసిపోవుచుండ కుమారస్వామి యెదుటకు వచ్చి నిలిచిరి. వారికందఱకును మొనగాఁ డగు భీమారెడ్డి దంటునకు ముందుండెను. అతఁడు కుమారస్వామిని గుర్తుపట్టి చాల

నాత్రముతో, స్వామీ! కళాసులు చెప్పినదంతయు నిజమేనా?'' యని ప్రశ్నించెను.

"కళాసు లేమిచెప్పిరో నాకుఁ దెలియదు. ఇరువురు నావికులు "బందిపోటుగాండ్రు వచ్చి మామగారి యిల్లు దోఁచుకొని వారిని సంహారించి యింటియందే దహనసంస్కారము చేసి వేసి'' రని చెప్పిరి. వచ్చిచూచునప్పటి కంతయు యథార్థమే యైనది. మామగారి శవమింకను దహనమగుచునే యున్నది. ఎవరీ ఘోరకృత్యముగావించిరో స్పష్టముగఁ దెలిసికొనుట కాధారము లేమియుఁ గాన్పించవు. జగ్గయ్య, కుమారవీరయ్య, సోమయ్యయుఁ గూడ నెపులేరు. జగ్గయ్య బల్లెము మాత్రము గోడకుఁ జేర్పఁబడి యున్నది. యోచింపఁగా దీనికంతకును భుజంగ రాయఁడే కర్తయని తోఁచుచున్నది. నిజముగ నీపనిఁ జేసినవాఁడు వాఁడేయైనచోఁ గొలఁదికాలమునందే మఱికొన్ని విపత్తులు మనకు వానివలనఁ గలుగవచ్చునని తలంపు గలుగుచున్నది; గాని నిన్నగాక మొన్న మీ వలన మర్దింపఁబడియు, నేఁడు మీకనులలో దుమ్ముగొట్టి వాఁడింతపని సేయుట చూడఁ జాల వింతగా నున్నది. దీనికి ఠాణేదారుగారి కేమి ప్రత్యుత్తరము చెప్ప వలయునో తోఁచుట లేదు. అయినను దానిని గుఱించి మనము తరువాత యోచించుకొన వచ్చును. ఈదారుణ

వ్యాపారము నడపినవాం డైనప్పటికిని, ఇంతవఱకు నీయూరు వదలి చాలదూరము పోరు. సాధ్యమైనచో వాం డ్రను వెదకి పట్టుకొనుటకు దిక్కునకు నిరువదియైదుగురు చొప్పున నల్వంకలకును నూర్గురు శ్రాస్త్రీకవీరులను వెంటనే పంపు'' మని కుమారస్వామి చెప్పెను. భీమారెడ్డి యట్లు కావించెను.

మఱియు నిచ్చటి సమాచార మంతయుఁ దెలిపి సిలిచియున్నట్లుగఁ బ్రసాదరాయని మహేంద్రభట్టారకునిఁ గొనివచ్చుటకు రాజధానికిఁ బోవ నల్గురు కాతులకును, ఊరంతయుఁ గాపాడునట్లిరువదియైదుగురు కాతులకును, దక్కినవారికి సెలవునకై వేచియుండుటకును ఆజ్ఞాపించి కుమారస్వామి భీమారెడ్డినిఁ దీసికొని లోనికిఁ బోయెను. అంతకు ముందే మాధవశర్మ తన తల్లిని గృహిణినిఁ దీసికొనివచ్చుటకొరకు కళ్ళాసునిఁ బంపెను. మఱలఁ గుమారస్వామి యింకొకమాఱు సమాశ్వాసించుటచేఁ గొంచె మూరడిల్లిరి; గాని యంతలో మాధవశర్మ తల్లియు గృహిణియు వచ్చుటచే జానకీరుక్మిణులు రోదనము మఱలఁ బ్రారంభించిరి. ఆవిచారమును శాంతింపఁజేయుట చాలఁ గష్టమయ్యెను.

అప్పుడు కుమారస్వామి మాధవశర్మ యనుమతినిఁ బడసి జానకీ రుక్మిణులను మాధవశర్మ యింటికిఁ బంపి

వేసెను. వారితోఁ గూడ స్త్రీ లెల్లరు వెడలిపోయిరి. తక్కినవారికి మాధవశర్మ సెలవిచ్చివేసెను. కుమార స్వామి మాధవశర్మ యింటికిఁ గాపాడుట కిరువం్రడు జ్ఞాతులకు ముదల యిచ్చెను.

పిదప మాధవశర్మ "బల్లెము గోడకుఁజేర్పఁబడి యుండుటఁ జూడ జగ్గయ్య మున్నగు ద్వారరక్షకులు వధింపఁబడియో, బంధింపఁబడియో యీ యావరణము నందే యుందురని తోఁచుచున్నది. వెదకించుట లగ్గు గాదా!" యని చెప్పెను. కుమారస్వామి వెంటనే యట్లు చేయఁగా చైతన్యరహితులై పడియున్న పారాజవానులు దొరికిరి. కొంతసేపటివఱకు నుపచారములు చేసినపిదపఁ దేఱికొని వాండ్రు "యెవరో దురంతకులు వచ్చి మీఁదఁ బడి కట్టివేయుట తక్క మా కేమియుఁ దెలియ" దని చెప్పిరి. పిదప వాండ్రు జరిగిన సమాచార మంతయు విని చాల వగచిరి. కుమారస్వామి మాధవశర్మ నింటికిఁ బంపివేసి భీమారెడ్డితోఁ దాను అచ్చటనే పరుండెను.

## 5

మొత్తముమీఁద నారాత్రి శేషమున, ఎవరో కొందఱు సాంసారికము లగు బాధ్యతల నెఱుఁగని పిల్లకాయలును, దుర్దమనీయ మగు జరాభారమువలనఁ గ్రుంగి పోయిన

వయోధికులును, ప్రబలాయాసమువలననో, గతరాత్రి యంతయు జాగారము సేయుటవలననో, మఱి యే యితర కారణములవలననో దుర్బలులై వివశులై పోయినవారును దక్కఁ దక్కిన వారెల్లరును నిద్రాదేవినిఁ బ్రతిఘటించి నిలిచిరి. అన్యమనస్కులై యున్నపుడు గూడ నాకస్మికముగ వారిని నిద్ర తన బిగికౌఁగిటఁ బొదివిపట్టుటకుఁ బ్రయత్నింపలేదు. ఆమె యెఱ్ఱబాఱియున్న వారి కనుల నారసి భయాతిరేకమువలన సమీపించుటకుఁ గూడ సాహసింపఁజాలక పోయెను. గ్రామస్థు లెల్లరు నెవరి గృహములయందు వారు చాల మెలఁకువ గలిగి యుండిరి.

ఇటు భట్టాచార్యుని యింటఁ గుమారస్వామి, భీమారెడ్డి, జగ్గయ్య, కుమారవీరయ్యయుఁ గూడ నట్లే యుండిరి. కుమారస్వామియు భీమారెడ్డియు జరిగిపోయిన దానిని గుఱించి వగచుచు, నిఁక జరుగఁ బోవుదానిని గుఱించిన యోచనమునఁ బ్రవృత్తులై యుండిరి. మర్మస్పృక్కగు భట్టాచార్యుని గుఱించిన వగపును, తన యజాగ్రతను గుఱించి రాజసభయందును, వీరలోకమునందును, జనసామాన్యమునందును అసంతృప్తిరూపకముగ నాక్షేపణములు వెలువడు నను చింతయుఁ, బ్రసాదరాయని కేమని ప్రత్యుత్తర మిచ్చుట యను నాందోళన

మును, నేఁడిట్టి దారుణవ్యాపారమును జరిగించిన దురంత కులను బట్టి శిక్షించుట యెట్లను తీవ్రవిచారము నేకమై వారిని జాల గగ్గోలు పెట్టసాగెను.

ఈతీరున అనంతవిచారమగ్నచిత్తు లగు పులి బూరు గ్రామవాసుల కేరికిని దెలియకుండగనే రాత్రి కడచిపోయెను. కలకల తెల్లవారెను. తన యధికారమున నీవిశాలవిశ్వమునం దంతటను జరిగిన లోకవృత్తములను విమర్శించి తన యెడల నెట్టి నిందారోపణము గావిం చునో యను భయముననో యనునట్లు శశాంకుఁ డపర దిగ్భాగమునకు దెలతెల వోవుచుండెను.

ఈసమయమున నిజస్వరూపములను దెలిసికొనుటకు వీలులేనంత వేగముగ నాలుగు గుఱ్ఱములు వగర్చుకొనుచు వచ్చి కోటాలున భట్టాచార్యుని యింటిముందు నిలిచి పోయెను. తోడనే గుఱ్ఱములను దిగి యిరువురు పురు షులు మెట్లు ఎక్కసాగిరి. నలుగు రచ్చటనే యుండి గుఱ్ఱములను నేద దేర్పఁ బ్రారంభించిరి. లోని కరుగువారు ధరించిన యమూల్య వస్త్రములను బట్టియు, నడికట్టుల యందలి రత్నపుఁబిడులు గల కటారులను బట్టియు, బంగరులతలచే, మనోమోహనము లగు నొఱలయందు విశ్రమించియున్న ప్రచండకరవాలములను బట్టియు, జెమ్కాపని చేసిన ముఖమలుగుడ్డల యొఱలుగల

ముకుందగిరిబల్లెములను బట్టియు, వీరరస నికేతనములై యనంతసౌభాగ్య విలాసమందిరములై వెలయు గభీర ముఖ మండలములను బట్టియు వారు వీరాధివీరులని తెలుపకయే తెలియుచుండెను. నా యిరువురును భట్టాచార్యుని కుమారులు. ప్రసాదరాయఁడు, మహేంద్ర భట్టారకుఁడు నను నన్నదమ్ములు.

వారిట్లతివేగముగ ద్వారము దాఁటి లోపలఁ బ్రవేశించు నప్పటికిఁ గుమారస్వామి వీధిదెసకు వచ్చుచుండెను. వెంటనే యాతఁడు బావమఱఁదుల నిరువురను జూచి నిర్విణ్ణుఁడై నిలువఁబడిపోయెను. ఆతని స్థితి యంతయుఁ జూచి గ్రహించి ప్రసాదరాయఁడు కనుమూసి తెఱచునంతలో నాతనిఁ గౌఁగిటఁ బొదివిపట్టి గంభీరముగ "బావా! విచారింపకుము. ధైర్యము చిక్కఁబట్టు" మని బుజ్జగించెను. అంతఁ జాలఁ బ్రయత్నముమీఁదఁ గుమారస్వామి విచారమును దిగ్రమింగికొనుచున్నంతలో మహేంద్రుఁడు గూడ "బావా! గతమునకు వగచినఁ బ్రయోజనము లేదు. మనమున విచారమునకుఁ జోటీయకు" మని చెప్పెను. ఈతీరునఁ గుమారస్వామి బావమఱఁదులను బరామర్శించుట యైపోయెను.

ఆ యన్నదమ్ముల మాటలు విని యులికిపడి ఖిన్నముఖులై భీమారెడ్డియు, జగ్గయ్యయుఁ, గుమారవీ

రయ్యయు నెట్లో యచ్చోటికి వచ్చిరి. ప్రసాదరాయుఁడు వారు మాట్లాడక పూర్వమే "విచారపడువల" దని ధైర్యము చెప్పెను. భీమారెడ్డి తన విచారము నెట్లో దిగ మ్రింగికొనియెను; గాని కుమారవీరయ్యయు జగ్గయ్యయు మాత్ర మట్లు చేయఁజాలకపోయిరి. చూచుచుండఁగనే వారి కపోలములపై నవిరళాశ్రులహరి ప్రవహింపఁదొడఁగెను. ఎట్టకేలకు వారినిఁ గూడ నూరడించి ప్రసాదరాయఁడు "నాయనగారి చితి యెచ్చట నున్న" దని బావమఱఁది నడిగెను. అప్పుడు విచారభరితములగు "రండు" అను రెండక్షరములు మెల్లఁగ వినవచ్చెను. అందఱును భట్టాచార్యుని పతన మందిరమున కరిగిరి.

అప్పటి కప్పుడే భట్టాచార్యుని భౌతికశరీర మస్థిమాత్రావశిష్టమైపోయెను. ఆచితినిఁ బవిత్రము గావించిన యగ్నిహోత్రుఁడును శాంతమూర్తియై భట్టాచార్యుని మాహాత్మ్యమును జాటిచెప్పుచుండెను. అట్టిసమయమునఁ బ్రసాదరాయఁడును మహేంద్రుఁడును బాహ్యదృష్టితో నగ్నిహోత్రునితో నైక్యమైయున్న తమ జనకుని భౌతికశరీరమును వీక్షించిరి. మఱియు విజ్ఞానశేఖరు లగుటంజేసి వారప్పుడే దివ్యదృష్టితో భట్టాచార్యుని యాత్మకు సాయుజ్య మొనగూర్చిన పరంజ్యోతినిగూడఁ జూచిరి. అక్కటతన వారికప్పుడు విచారమునకు మాఱుగ నానం

దమే గలిగెను; గాని యది క్షణములో మెఱుపువలె నంతర్హితమైపోయెను. అడనే యాస్థలమున విచార ముపస్థితంబయ్యెను.

అంతమాత్రమున వారు వికలహృదయులైరని గాని బాష్పప్రపూర్ణనేత్రులైరని గాని మేము చెప్పఁజాలము. మేఘచ్ఛన్నుఁడగు సూర్యభగవానుఁ డాకస్మికముగ క్షణకాలము మానవులకుఁ గనుల పండువు గావించి మఱల నంతలో మఱియొక వినీలమేఘమాలికలచేఁ దిరోహితుండైనప్పు డాకస మెట్లుండునో వారి హృదయసీమ లప్పుడట్లుండెను. తత్ఫలముగ వారప్పు డచ్చటఁ గొంతతడవట్లే నేష్టులు దక్కి నిలువఁబడిపోయిరి. వార ప్పుడు ప్రాగభిముఖులై యూర్ధ్వబాహులై యనిమిష లోచనులై గాఢసమాధినిష్ఠాగరిష్ఠులై తన్మూలమున వినిర్మల హృదయులై, యెట్టయెదుట సాక్షాత్కరించిన పరమేశ్వరుని దివ్యమంగళవిగ్రహమును దర్శించి, దరహాస భాసురం బగు తన్ముఖమునందే చూడ్కులు నిలిపి యమందానందసాగరమునఁ దేలియాడుచు బాహ్యజ్ఞాన శూన్యులై యుండు మునికులతిలకులవలె నుండిరి.

ఇట్లొక నిముసము గడచిపోవునప్పటికి వారికి బూర్వస్మృతి గలిగెను. వెంటనే యెల్లరును బైటకు వచ్చిరి. ప్రసాదరాయఁ డొక్కసారి నల్వంకలకుఁ దిరిగి

చూచెను. దొంగ లింటినిఁ గొల్లకొట్టిన లక్షణము లన్నియు నాతనికిఁ గాన్పించెను. తోడనే యిండ్లన్నియు నొక్కమాఱు పరీక్షించివచ్చి "భీమారెడ్డీ! శత్రువులు నిర్జనప్రదేశమునఁబోలె మన యింట నిర్భయముగ సంచరించినారు. విలాసమాత్రమున నీవ్యాపారమంతయు ముగించుకొని పోయినారు. చాలఁ దెలివితేటలను బ్రకటించినా" రని పలికి ప్రసాదరాయఁ డొక్క దీర్ఘనిశ్వాసము విడిచెను.

అంతలో మాధవశర్మ యచ్చటకు వచ్చెను. ఆతఁడు మేనల్లుండ్ర నిరువురంజూచి "ప్రచండభాస్కరుఁడు క్షుద్ర కేతువుచేఁ గబళింపఁబడియెను. ప్రపంచము తలక్రిందులై పోయినది. ఇంతకంటె దారుణ మేమి యుండును" అని పలికి వారినోదార్చెను. పిదప నెల్లరు నచ్చటి తిన్నెపై నాసీనులైరి. కుమారవీరయ్య జగ్గయ్యయు నెదుట నిలువఁ బడిరి.

## 6

ప్రసాదరాయఁడు మఱల నొక్క వేఁడినిట్టూర్పు విడిచి "యీ దారుణకృత్యమును గుఱించి నీ కెంతవఱకుఁ దెలియు?" నని యడుగఁ గుమారవీరయ్య యిట్లుచెప్పెను:

"వెంకమ్మగారు తమ కూఁతునింటికి బయలుదేరిపోవు నప్పటికి జాముఁరాత్రి యయ్యెను. అప్పటికి నేనును జగ్గయ్యాయు సింహద్వారమునొద్దఁ గూర్చుండి మాట్లాడుకొనుచుంటిమి. సోమయ్య యంతకుమున్నె గాఢనిద్రం దవిలియుండెను. పిదప నేను నా స్థానమునకుఁ బోయి దక్షిణాభిముఖుఁడనై కూరుచుండి నాసాంసారికస్థితిని గుఱించి యోచించుకొనుచుంటిని. అతీవ్రాలోచనమున నామనస్సు లగ్నమై పోయిన దనియే చెప్పవచ్చును. నాకు బాహ్యస్మృతి యంతగా లేని యీసమయమున హఠాత్తుగ నెవఁడో వెనుకనుండివచ్చి యుక్కిరిబిక్కిరి యగునట్లు నాకంఠము నొక్కిపట్టెను. మఱియొకఁడు నాచేతులను గాళ్ళను జనపనారపగ్గములతోఁ గట్టివేసెను. పిదప నోట గుడ్డలు క్రుక్కి యొక పాదరింటఁ బడవేసిరి. ఒకటిరెండు నిముషములకు నాకు స్మృతి తప్పిపోయెను. కాని యంతకుఁ బూర్వమే సోమయ్యనుగూడ బంధించి నాచెంతఁ బడవైచిరి. దురంతకు లెందరుండిరో నేను చెప్పఁజాలను. నాకు నలుగురుమాత్రము కానిపించిరి. వాండ్ర చేష్టలనుబట్టి యింకను గొందఱున్నట్లు గ్రహించితిని. నాకుఁ గాన్పించిన నలుగురును గూడ యవనులు. పిదప నొక్కఁడు మాయొద్ద గాపుండెను. నాకుఁ జైతన్యము లోపించిపోవుచుండఁగా వాఁడేమో చెప్పెను;

గాని నేనది గ్రహింపలేకపోయితిని. ఇంతకంటె నేనే మియు నెఱుఁగను. అప్పటికి రెండవజాము కావచ్చినది."

పిదప జగ్గయ్య తాను బల్లెము గోడకుఁ జేర్చిపెట్టి కాళ్లుగోఁకి కొనఁదొడఁగినది మొదలు తనకుఁ దెలిసిన దంతయుఁ జెప్పెను. ప్రసాదరాయఁ డప్పుడు మరలనొక నిట్టూర్పువిడిచి. "యోచించిచూడఁగా విద్రోహులు భుజంగరాయని పరివారములోని వారే యని తోఁచు చున్నది. అయినను వాండ్రు గ్రామమంతయుఁ గొల్ల కొట్టక పోవుటఁ జూడ సంఖ్యయందుఁ జాల స్వల్పముగ నుండవలెను. ఒక్క భుజంగరాయఁడు తక్క నీప్రాంతము లందు యవనులతోఁ గలిసి యిట్టి పనులు చేయువాఁడు మఱియొకఁడు కాన్పింపఁడు. వాఁడు బ్రతికియున్నంత కాలము నిచ్చటనిట్టి దౌర్జన్యములకుఁ గొదువ యుం డదు. ఎట్టి ప్రయత్నములు చేసియైనను మనము భుజంగ రాయని సాధింపఁగలమేని మంగళం బగును. ఇతరుల కొఱకు మనము భీతిల్లవలసిన పనిలేదు" అని చెప్పెను. తక్కినవారెల్లరునట్లే భావించిరి. అప్పటి కింకను సోమ య్యకు మెలఁకువ గలుగలేదు. జగ్గయ్య యాతనిం బ్రబో ధింపఁబోయెను; గాని ప్రసాదరాయఁడు వల దని నిషేధించెను.

అప్పుడు గ్రామమునందలి పిన్నలు, పెద్దలు, నెందఱో తాణేదారు వచ్చెనని విని చూచుటకు వచ్చిరి; గాని వారి నందఱను వీథిగుమ్మములో నుండఁగనే చూచి ప్రసాద రాయఁడు "ఒక్క క్షణకాలము మాత్రము మాకు విశ్రాంతి దయచేయవలెను. తరువాత నందఱును రావచ్చు" నని జగ్గయ్యచే వారికిఁ దెలియఁజేసెను. అందుల కెల్లరును సమ్మతించి వీథిలోనిలిచిపోయిరి. జగ్గయ్య గ్రామవాసులను నిలిపివేయుటకై ఉన్నచోటనుండి తటాలున వెనుదిరిగినప్పుడు వాని చొక్కా జేబులోని జాబు ప్రసాదరాయనికిఁ గాన్పించెను. అంతవఱకు జగ్గయ్య గూడ దానినిఁ జూడలేదు. తోడనే వాఁడు దానిని దీసి చూచి పైని మీపేరేయున్నదని యిచ్చివేసెను. ప్రసాద రాయని యనుజ్ఞను బడసి కుమారస్వామి జాబు నిట్లు చదివెను.

"ప్రసాదరాయఁడా!"

"నీప్రియమాత చనిపోయి చాల దినములైనది; గాని తల్లియుఁ దండ్రియుఁ దానయై మిమ్మనేకవిధముల మీతండ్రి కాపాడుచుండుట వలనఁ బ్రకృతము నీవా విచారమును మఱచిపోయి యుంటివి. ఇప్పుడు నీకావిచారమును జ్ఞప్తికిఁ దెచ్చుట నాసంకల్పము గాదు. మఱి యేమి అనఁగా? నీతండ్రిగూడ నేఁడీ లోకమును విడిచి

పోయినాఁడు. ఇదినీకుఁ చాల విచారకారణమే. అయి
నను నీవిపుడు విచారింపవలదు. విచారించితివేని నీవి లేఖ
యందలి మర్మార్థమును గ్రహింపఁజాలవు. అనఁగా
నీ కింకను దటస్థింపనున్న యాపద లేవో తెలిసికొనఁజాల
వనుట. అవి తెలిసికొనఁ గలుగుటకే నిన్ను విచారింప
వలదని చెప్పుచున్నాను; గాని సర్వజ్ఞుం డగు నీతండ్రినిఁ
దలంచికొని నీవు విచారింపకుండ నుండలేవను సంగతి
నేనెఱుంగనిదిగాదు. నీవు తప్పక విచారించెదవు. నీ కుడి
చేయి పడిపోయినది. నీవింక విచారింపకుండ నెట్లుండఁ
గలవు! నాయీ యూహ నీవసత్యము గావింపఁగలవేని
నీవు పురుషసింహుఁడవే. శత్రుంజయుఁడవే. కాదేని
నీపౌరుషము కేవలము హేయమైనది. కొలఁది దినముల
యందే నీ వధఃపతితుడవై పోదువు.''

"నేను నిన్ను విచారింపవలదని చెప్పుటకు మఱియొక
హేతువుగూడఁ గలదు. అదేమందువా? నీవు నా విరో
ధివి. నీకీ సంగతి మొన్నటివఱకును దెలియకపోయి
యుండవచ్చును. నాతో శత్రుత్వమును నెఱపుటకు నీవు
బుద్ధిపూర్వకముగఁ బ్రయత్నించి యుండకపోవచ్చును.
ఇఁక నీకు నాకును శత్రుత్వ మెట్లుకలిగెనని యడుగ
కుము. నీవు నివురు గప్పిన నిప్పు త్రొక్కితివి. ఇఁక
"నాకిది యజ్ఞానకృతం'' బని వగచిన మొదల నాయగ్ని

నిన్ను బాధింపకుండునా? ఎఱుఁగక త్రొక్కితి నని నంత మాత్రమున నల్లత్రాఁచు కఱువక విడుచునా? నీవునాకు విరోధి వగుట యేమో యథార్థము. ఇప్పుడు నీవు ధైర్యముఁ దక్కి వగచితివేనిఁ బురుషాధముఁడ వైపోదువు. అట్టి నీతోఁ గత్తి గట్టుటవలన నాకుఁగూడఁ గలంక మొదవును. కావుననే నిన్ను విచారింపవల దనుచున్నాఁడను. ధైర్యమును జిక్కఁబట్టుము. కర్తవ్యమును గుఱించి యోచన గావింపుము."

"అధీరునితోఁ గత్తికట్టుటవలన నాకుఁ గలంక మొదవు" నను మాట నీకు హాస్యాస్పదముగఁ గాన్పింపవచ్చును; గాని యంత మాత్రమున నాకేమి లోటు గలుగును? అది నీయవివేకమునే వెల్లడించును. అధికారమత్తున కనధికారి యగు విజ్ఞానిశేఖరుఁ డప్రయోజకుఁడు వోలెఁ గాన్పింపవచ్చును. అయిన నంతమాత్రమున ఆ యనధికారి యప్రయోజకుఁ డైపోఁడు. పయింబయిగ నాయధికారికంటెఁ బ్రయోజకుఁడే యగును. ఈసంగతి నిప్పుడైన నీవు గ్రహింపఁగలిగితివేని నీకును నాకును గల తారతమ్యము గ్రహింపఁగలుగుదువు. అనఁగా నేపుట్టలో నేపామున్నదో తెలిసికొనఁగల వన్నమాట. పురాకృత పుణ్యంబున నీవు నాబాహుబంధమునుండితప్పించుకొనిపోఁ గలుగుటయే తటస్థించునేని నీవంటి రాజకార్యధురంధరున

కిట్టి జ్ఞాన మత్యావశ్యకము. సీ! అట్టిజ్ఞానములేని రాజ పురుషుఁడు నరపశువు సుమా''

"ఇఁక నాపేరు దాచుకొనవలె ననియు, నేనేమి చేసె దనో తెలియనీయకుండఁ జేయవలయు ననియుఁ దలంచుట లేదు. భయమును మాటయే నే నెఱుంగను. శాంతముగఁ గాలము గడుపుచున్న నే నకారణముగ నీభయంకరరంగమునకు లాఁగికొనిరాఁబడితిని. ఇట్టి స్థితిలో భయపడుటవలన నేమి ప్రయోజనము? ఇంతవఱకు జరిగిన దేమో జరిగినది. నీజాగ్రతను గనుగొనుటకే నేను రహస్యముగఁ బని ప్రారంభించితిని. ఇఁక నేనేమి చేసినను ఢంకామీఁద దెబ్బగొట్టి మఱియుఁ జేసెదను. "దొంగ" "మానహీనుఁడు" నను నిందకుఁ బాల్పడుట నాకిష్టము లేదు. నీవును బుద్ధిమంతుఁడవు. నాపేరు నీ వింతవఱకే యూహించుకొని యుందువు. అయిన నీముసుఁగులో గ్రుద్దులాటలేల? నేను భుజంగరాయఁడను. ఉన్న సామర్థ్యమును మాత్రము చెప్పుకొనుట యాత్మస్తుతి కానేరదు; కావున నిజము చెప్పవలసివచ్చి నపుడు నిస్సందేహముగ నే నహితమారుతకిశోరములను గబళించు భుజంగుఁడనే. నిష్కారణముగ నామార్గము నరికట్టు బుద్ధిహీను లగు పరవీరులను భస్మపటలము గావించు భుజంగ భూషణుఁడనే. ఆసంగతి ముందుముందు నీవే తెలిసికొనఁ గలవు''

"ఇఁక ముఖ్యవిషయమును జెప్పుటకుఁ బూర్వము నీతండ్రిని గుఱించి యొకింత చెప్పవలసి యున్నది. నీ తండ్రి మహావిద్వాంసుఁ డనియు, వీరాధివీరుఁ డనియు నే నెఱుఁగుదును. రామచంద్రపుర సంస్థాన పరిపాలన మంతయు నీతండ్రి యాలోచన ననుసరించియే జరుగు చున్న దని గూడ నేనెఱుంగుదును. అయిన నట్టివానినిఁ జంపుట నాకు అనివార్యమైనది. నీతండ్రి నాపీఁటలమీఁది పెండ్లి పడఁగొట్టెను. నీతండ్రి, నాకు సంరక్షణము చేయు నాత్మీయు లెవరును నాయింట లేకపోవుటచే సుఖము గలుగదను కారణమున నామీఁదఁ జాల మక్కువ గలిగి యున్న కన్యను మఱియొకని కిప్పించుట నీ వెఱుంగుదువు. బలవంతపు పెండ్లియైన వెంటనే యాబాల నామీఁది ప్రేమను మఱలించుకొనఁజాలక యాత్మహత్య గావించు కొనుటయు నీవెఱుఁగుదువు. ఆమె పోవునపుడు నాయా శను, నా సుఖమును, నా యానందమును, నా చైతన్య మును గూడ దీసికొనియే పోయినది. అనఁగా నేనిప్పుడు జీవన్మృతుఁడ నై యున్నాఁడను. నాయైహిక జీవితము నిట్లు కుంభీపాకనరకమునఁ గూలఁద్రోసివేసిన నీతండ్రిని జూచి నేను కోపము నడఁచుకొనఁ జాలక పోయితిని. ఇప్పుడు నాశరీర మాపాదమస్తకము కోపముతో నిండి యున్నది. నాయనుజ్ఞను బడసి నాయనుచరులు నీతండ్రినిఁ

జిత్రవధచేసి వేసిరి. అట్టి మహాత్ముని శవము నీవు వచ్చు నంతదనుక దిక్కులేక పడియుండుటకు నేనంగీకరింపఁ జాలకపోయితిని. ఆకారణముచే దహనసంస్కారము చేసితిని. అందులకై శవమును గ్రామమునకుఁ జాల దూరమున నున్న రుద్రభూమికిఁ గొనిపోయినచో మారహస్యము బట్టబయలై పోవునను భయమున నింటియందే చితి యేర్పఱిపించితిని. నీయిల్లపవిత్రమైపోయినదని నీవు విచారింపకుము. నీతండ్రి నీయింటియందే దహనము చేయఁబడుటకు విచారించుటకుమాఱుగ సంతసించెదవేని నీవా పండితసార్వభౌమునకుఁ దగిన కుమారుఁడవయ్యెదవు. మంచిగంధపుఁ జెక్కలతో నిర్మింపఁదగిన నీ తండ్రి చితి కేవలముతదితరములగు కఱ్ఱలతోడనే నిర్మింపవలసి వచ్చినందులకు మాత్రము వగచుచున్నాను''

''గ్రామదేవతను గుఱించిన భిన్నాభిప్రాయమును బురస్కరించుకొని గ్రామస్థులెల్లరును గలిసి నన్నతినీచముగ నవమానించుటవలన నేను రామవరమును గొల్లకొట్టఁ దలఁచితిని. రంగువేయుటవలన భయంకరమైయున్న పేదబొమ్మ వారి నీయాపదనుండి యెట్లుతప్పింపఁ గలదో చూతమని నేనాపని చేయఁదలఁచితిని; గాని యంతలో నీవు వచ్చి నాపోఁజును విచ్ఛిన్నము చేసి వేసితివి. ముసల్మానులు భారతీయులును గలిసి నాయను

చరులు ఎనుబదిమందిమాత్ర మేమిగిలిరి. తక్కినవారెల్లరు ననఁగా నూటయేఁబండ్రు నీయాశ్రితవీరుల ఖడ్గములకు బలియైపోయిరి. అదంతయు నీకుఁ దెలిసినదియే. మాయారి పెద్దలు గ్రామదేవతయే తమ్మాపవిపత్తునుండి తప్పించెనని సంతసించుచున్నారఁట. భయంకరమగు ఆదొమ్మిలో నీభటులవలన సంహరింపఁబడిన నాయనుచరు లెల్లరును గూడ గ్రామదేవతకే బలిపెట్టఁబడి రని సంతసించుచున్నారఁట. కానిమ్ము, ఆదేవత యేమిచేయ కలదో నేనింకను బరీక్షించి చూచెదను. నాకంఠములోఁ బ్రాణము లున్నంతవఱకు నేను అగ్రామదేవతను విచ్ఛిన్నము సేయు ప్రయత్నమునుండి విముఖుఁడను గాఁజాలను.''

"ఇంతటితో నాయెడల శత్రుత్వమును వదలుకొనవలసిన దని నేను నీకు సలహా చెప్పుచున్నాఁడను. మఱియు నట్లు చేయవలసిన దని ప్రార్థించుచున్నాను. ఏమన? నీవు వర్ధమానచంద్రుఁడవు. నినుబోలు వీరులు సాయపడకున్నచో రామచంద్రపురసంస్థానము నిరపాయముగ నుండఁజాలదు. అదియుఁగాక; ఇప్పుడిప్పుడే నీయెడల సాంసారిక సౌఖ్యములు ప్రసన్నము లగుచున్నవి. నిన్న గాక మొన్ననే నీకీయధికారము ప్రత్యక్షముగ హస్తగతమైనది. నీది ఇప్పుడు నూత్నాశ; నూత్నసుఖము;

నూతనానందము. ఇంక నాతో విరోధించి వాని నన్నిటిని దగ్ధము గావించివేయకుము. నీతండ్రి వెంటనే నీవుగూడ స్వర్గయాత్రోన్ముఖుడవై యీప్రాంత గ్రామములయం దెల్లఁ బులిబూరికిఁ గల ఘనతను విధ్వంసముచేయకుము. రామచంద్రపుర సంస్థానపు వీరలోకము నాయకమణిని గోల్పోయె నను నపవాదమును గలుగనీయకుము. నా సలహాను మన్నింపుము. నా ప్రార్థనమును బరిపాలింపుము''

"నేనీ స్వల్పవయస్సునందే శతవృద్ధుండ నైపోయితిని. మృత్యుకామిని నాయెడల నింకను బ్రసన్న కాకపోయి నను విలయసాగరమున నీదులాడవలయునని నేను చాల ముచ్చటపడుచున్నాను. నాకదియే సుఖకరము. నా హృదయక్షేత్రమున మఱలఁ బ్రణయము రేకెత్తునని నా కాశలేదు. నా కైహికసుఖ ప్రత్యాశ గూడ లేదు. కొలఁది దినములయందే నేను జీవయాత్ర ముగింపవలయు నని నిశ్చయించుకొంటిని. పోవుచుఁబోవుచు ఘనకార్యములు చేసి పోవలెనని తలంచితి. స్వర్గసౌఖ్యము ననుభవింపవలయునని నాకుఁ జాల నాశగలదు. అది సిద్ధించుటకే నేనీ వీరవిహారమును బ్రారంభించితిని''

"నాదాడితో నీవింకను బ్రసక్తి గలిగించుకొందు వేనిఁ దెలిసియుండియు బుద్ధిపూర్వకముగ నీవీ జూదమును

ప్రారంభించితి వన్న మాట. అదియే నిజముగునేని నేను నా ప్రాణధనముల నొడ్డియే యుంటిని. నీవుగూడ నీప్రాణముల నొడ్డవలయును. నీప్రాణములతో బాటు నీతమ్ముడు నీబావమఱది మున్నగు నెల్లర ప్రాణములు నొడ్డవలయును. నీ సర్వస్వము నొడ్డవలయును. ఈ జూదమున గెలుపు నీకే లభించునేని నాకు సంతోషమే; గాని నా కంఠములో ప్రాణము లున్నంతవఱకును నీవు విజేతవు కాజాలవు. నేనుగూడ నట్లే నీవు బ్రతికియున్నంతవఱకును జయింపజాలను. ఈ జూదమునకు మనలో నొకని మరణమే యవధి. ఇరువురమును జచ్చిపోయినచో విచారమే లేదు; గాని నీవు మాత్రము బ్రతికియుండుట నా యభీష్టము"

"కాని పండ్రెండు దినములవఱకును నీ వీ ప్రయత్నమునఁ బ్రవేశింపవలదు. నీవు నీతండ్రికి నుత్తరక్రియలు గావింపవలసి యున్నది. ఈపండ్రెండు దినములయందే నీవిందులో దిగితివేని నీవు చేసిన కర్మయంతయు వ్యర్థమగుటయు, నీతండ్రి యాత్మకు శాంతి యొదవక పోవుటయుఁ దటస్థించును. నీకీ యడ్డంకులు దీఱునంతదనుక నేనుగూడ విశ్రమించియే యుండెదను. తరువాత మన బలాబలములను జూపుకొందము. అనఁగా మఱల జూదము ప్రారంభింతము"

"నాస్థిరనివాస మెచ్చటనో నేనెప్పుడెచ్చటనుందునో, యెప్పుడేమి చేసెదనో. యేరును దెలిసికొనఁజాలరు. నీ విప్పుడు సంపూర్ణబలుఁడవై యున్నాఁడవు. నేనట్టిస్థితిలో లేను; కావుననే నాకీరహస్యస్థితి. "అట్టి ప్రవర్తనము నీపౌరుషమునకు మాలిన్యమొదవింపదా?" యని నీవడుగ కుము. నీవును రాజ్యతంత్ర పారంగతుఁడవు. ఎట్లు ప్రవర్తించిన నాత్మోదయమును, బరవినాశమును గలుగునో యట్లు ప్రవర్తించుటయే రాజనీతివిదుని ధర్మము. తప్పి వచ్చినపుడు కూట యుద్ధము గూడ శాస్త్రసమ్మతమే. తొలుదొల్త సంతాపాగ్ని హృదయమున రహస్యముగఁ బ్రాదుర్భవించి ప్రత్యేయవము నెట్లు దగ్ధముగావించునో యంతఃకలహములు కుటుంబములను, సంఘములను, రాజ్యములను, దేశములను ఎట్లు విచ్ఛిన్నముగావించునో యట్లే నేను మిమ్ము ముప్పుతిప్పలు బెట్టి మూఁడుచేరల నీళ్లు త్రాగించెదను. కాల మెట్టి వింతలను బ్రదర్శించు చుండునో చూచుచుండుము"

"పండ్రెండు దినములవఱకును నేను నీప్రవర్తనమును బరీక్షించుచుందును. తరువాత నాకొఱకు నీవెదుకఁ జూడ నక్కఱలేదు. నాకు నేనే వచ్చి మన జూదమునఁ బ్రవేశింతును. అప్పుడు నాడాకను నీకు విధిగా నెఱింగించెదను. ఎట్లెఱింగించెదనో యప్పుడే తెలిసికొనఁగలవు. నీవు

ప్రవేశించినట్లు మాత్రము నాకుఁ దెలుప నక్కఱలేదు. నీవు ప్రవేశింపకపూర్వమే నీసంకల్పమును గ్రహింపఁగలను. గోడలకుఁ జెవులుండునని నీవు వినియేయుందువు. ఇప్పు డింతకంటె నీకుఁ దెలుపవలసిన సంగతులు లేవు. ఎప్పు డే యవసరము తటస్థించినను నీకుఁ దెలుపుచునే యుందును; గావున నిప్పు డింతతో విరమించుచున్నాను.

ఇట్లు

భు జం గ రా యుఁ డు.

ఈజాబు తుదవఱకును విని మాధవశర్మాదులు నిర్విణ్ణులైరి. అపుడు ప్రసాదరాయఁడు సదర్పముగ లేచి నిలువఁబడి చుఱుచుఱుఁ జూచుచు—"నేను ప్రథమము నందే యిది భుజంగరాయని పనియని తలంచితిని. అది నిశ్చయమే యయ్యెను. భుజంగరాయనినిఁ బ్రతిఘటించి పనిచేయుటకు మనము పూనుకొనమేని రామవర గ్రామవాసులకు విపత్తు తప్పనిదగును. తన కపాయమువచ్చునని ప్రజల యాపదల కడ్డుపడని రాజపురుషుఁడధమాధముఁడు. ప్రజలు చెమటయోడ్చి సంపాదించుకొనిన ధనమును బన్నులను పేరుతో వసూలుచేసి వారి మంగళముకొఱకు పనిచేయుకపోవుట రాక్షసకృత్యము. రామవరమువారు భుజంగరాయని యెడల నమ్రమముగనే ప్రవర్తిం

చిరి. అయినను భుజంగరాయఁడు సర్వాదాహము సేయఁ బూనినాఁడు. వాఁడు మూర్ఖశిరోమణి. వాని దంభపు వ్రాఁతఁజూచి మనము ధైర్యమును గోలుపోవుట పౌరుషముగాదు. వానికల కూడినంత చాతుర్యముతోఁ గరమును ఖడ్గము నాడినప్పుడు చూత” మని పలికెను. అది విని యెల్లరు నౌ ననిరి. అప్పుడు ప్రసాదరాయఁడు తమ్ముని, బావమఱఁదిని, భీమారెడ్డినిఁ జూచి “మీసామర్థ్యములను జూపుటకు సమయము వచ్చినది. ఇప్పుడు మనము శత్రువులయెడల నవలంబింపవలసినవి మోసము, దంభము, మాయ, రహస్యము, శోధనము, కలకుఁదనము, నిర్దాక్షిణ్యము రహస్యభేదనము మున్నగునవి. మీరిప్పుడు చాల మెలఁకువతోఁ బ్రవర్తింపవలయు” నని మఱలఁ జెప్పెను. అందఱు నందులకు సమ్మతించిరి “ఈ యుత్తరముసంగతి యేరికిఁ దెలియనీయఁగూడ” దని గూడ వారు చెప్పుకొనిరి. భుజంగరాయని వివాహ ప్రస్తావము విని దుఃఖపూరితులై యున్న వారందరును ఫక్కున నవ్విరి.

## 7

అప్పటికి వీథియు నరఁగులును గుమ్మమును గ్రామస్థులగు పిన్నలు, పెద్దలు, యువకులు మున్నగువారితో నిం

పోయెను. ఇంచుమించుగ నాగ్రామమునందలి నూటిండ్ల బ్రాహ్మణులును వచ్చిరి. ప్రముఖులగు వైశ్యులు రెడ్లును గూడ వచ్చిరి. అందఱును లోనికి వచ్చి ప్రసాదరాయనిఁ జూచుటకుఁ ద్వరపడుచు భట్టాచార్యుని మరణమును గుఱించియు హంతకుల సామర్థ్యమును గుఱించియు ముందు ముందు దమకుఁ గలుగఁబోవు నాపత్తులను గురించియుఁ జర్చలు సలుపుచుఁ క్రిందను మీఁదను బడుచుండిరి.

అప్పుడు జగ్గయ్య ప్రసాదరాయని కనుసన్న గ్రహించి లోనికి రావచ్చు నని ప్రజలకుఁ జెప్పెను. వెంటనే కట్ట తెగిన చెఱువు నీటివలె నొక్కక్షణములో నాజనసంఘ మంతయు లోనికి వచ్చి యంతటను గమ్ముకొనియెను. తోలుదోలవచ్చి ముందు మూఁగియున్న బాలురను గిశోరవయస్కులను గొందఱు యువకులను వెనుకకుఁ ద్రోసివేసి, పెద్దలును వెనుకఁ బడిపోయిన ప్రముఖులును ముందునకు వచ్చుటతో నొకటిరెండు నిముసములు కడచిపోయెను. వచ్చినవా రెల్లరును బ్రసాదరాయనిఁ బరామర్శచేయుటకుఁ బ్రారంభించిరి.

కొంద "ఱిట్టి యవస్థ తటస్థించునని మేము కలనైనఁ దలంచి యుండ" లేదనిరి. కొంద "ఱిట్లగు నని తలంచుట కవకాశమే లేకపోయె" ననిరి. కొందఱు చాల దారు

ణము జరిగిన దనిరి. కొంద "ఇది యేరికిని దెలియలేదు. చాల రహస్యముగ జరిగి పోయిన" దనిరి. మఱికొందఱు "తెలిసినచో నింతటి దుర్వ్యాపారము జరిగియుండునా? హంతకులు ప్రాణములతోఁ బోయియుందురా!" యని ప్రతాపములు పలుకసాగిరి. "చిరకాలము కాశీలో వసియించి విద్య సముపార్జించి, యచ్చటివారితో వాదమాడి గెలిచి, యతులైశ్వర్యము నఖండవైభవము ననుభవించి, స్వీయముగ వీరుఁడై, వీరులమధ్య నివసించియున్న వీరజనకునకే యిట్టి యవస్థ పట్టినప్పు డన్యుల పనియేమి కావలసిన" దని కొంద అనిరి. రామచంద్రపురసంస్థానపు విజ్ఞానభానుఁ డస్తమించిపోయె నని యెల్లరు నంగలార్చిరి. పిదపఁ గొందఱు 'హంతకు లెవ్వరో తెలియవచ్చినదా?' యని ప్రశ్నించిరి. "ఈపని భుజంగరాయఁడే గావించి యుండును. సందేహ మేల" యని కొందఱు ప్రశ్నరూపముగ సమాధానము చెప్పిరి.

అపుడు మాధవశర్మ తలయూఁచుచు "నౌనౌను, ఈదౌర్జన్యమును గావించినవాఁడు భుజంగరాయఁడే యని తెలియవచ్చినది. అంతకంటె నిట్టిదుష్కృత్యమును గావించు నశక్తదుర్జనుఁ డెవ్వఁ డున్నాఁ" డని పలికెను. అంతఁ బ్రసాదరాయఁ డాజనసంఘమును జూచి యిట్లనియెను. "మీరనినట్లు చాలదారుణవ్యాపారమే జరిగినది. రామ

చంద్రఘరసంస్థానవిద్వల్లోకము నాయకమణినిఁ గోలు పోయినదనియే చెప్పవచ్చును. హతశేషు లగు ననుచరులతో భుజంగరాయఁ డీచుట్టుపట్లనుండకుండ బాఱిపోయి యుండు నని భావించితిమి; గాని యింత యగునని తలఁప లేదు. మేమట్టియభిప్రాయముతో నుపేక్షించియుండుటను బట్టి వాఁడు నిగూఢముగ వీరమధ్యమున నింతటి పని చేయఁగలిగెను. ఇఁక వాఁడు ప్రాణములతో నుండునని మీరు తలంపకుఁడు. కొలఁది దినములయందే మీరు వాని మరణవార్తను వినఁగలరు. ఇంతటి గ్రామమున నొక్క మాయిల్లుమాత్రమే దోఁచుకొనుటవలన వాని పరిజనుల సంఖ్యాహైన్యము తేటపడుచున్నది. వాఁ డిఁక మీఁద మిమ్ముఁగూడ బాధించు నని భయపడఁబోకుఁడీ. మీరక్షణమునకు మేము తగిన ప్రయత్నము లన్నియుఁ జేసెదము. అయినను మీరు కేవలము నిద్దురవో వలదు. అందఱును గనుగలిగి యుండుఁడు. ఎవ్వరైన భుజంగరాయని రహస్యములను మాకుఁ దెలుపఁగలిగినచో గొప్ప బహుమానము చేసెదము. ఇఁక మాతండ్రిగారినిగుఱించి విచారింపవలదు. దైవసంకల్ప మిట్లున్నదని మనస్సులకు సమాధానము చెప్పుకొనుఁడు. సజ్జనులను బాధించినఁగాని దుర్మార్గుల వినాశమునకుఁ గారణముగలుగదు. ఇఁక నెట్టులును భుజంగరాయఁడు జీవించి యుండఁడు"

ఇంతలో "మంత్రిపరివారసమేతముగా రాజావారు వచ్చినా" రని కోలాహలము చెలరేఁగెను. జనసంఘమంతయుఁ గొంతతడవు కలఁగఁద్రొక్కుకొని దారి యిచ్చెను. వెంటనే రాజోచితవస్త్రములను గాక సామాన్యము లగుదుస్తులనుదాల్చి గుమ్మముదాఁటివచ్చుచున్న రాజు, యువరాజు, మంత్రిప్రభృతులును ప్రసాదరాయాదులకుఁ గాన్పించిరి. వారందఱముఖములునుగూడ మ్లానములై యుండెను. ప్రసాదరాయనిఁ జూచినతోడనే రాజు కన్నుల నీరుగ్రమ్మెను. యువరాజు కపోలములపై నశ్రులహరియే ప్రవహింపఁజొచ్చెను. తక్కినవారి స్థితియు నట్లేయుండెను. వారినిఁజూచి ప్రసాదరాయాదు లెదురేగిరి. రాజు ప్రసాదరాయనిఁ దటాలున గౌఁగిలించుకొని "విజ్ఞానభానుఁ డస్తమించెనా ? నాపాలిటి వేల్పుతేఁడవతారమును జాలించెనా!" యని యాక్రోశింపసాగెను. అదిచూచి తక్కిన వారెల్లరును వగచిరి. ప్రసాదరాయనికిఁ గూడ విచార మాగినదికాదు. రాజు భుజముపై ముఖము నానుకొని యాతఁడు దుఃఖింపఁజొచ్చెను. అతని కనులనుండి దొరలు నవిరళబాష్పధారచే రాజుభుజము మీఁది కంచుకభాగము తడిసిపోయెను.

కొంతతడ వెవ్వరును మాట్లాడఁజాలక నిలువఁబడిపోయిరి. దుఃఖభరమ్మున నెల్లరకంఠస్వరములును రుద్ధము

లై పోయెను; అపుడు మంత్రి "దీనుల పాలిటి కల్ప వృక్షము క్షుద్రవాయువిక్షేపములచేఁ గూలిపోయినది. చూచుచుండఁగనే సరస్వతి తనపురుషమూర్తి నుపసంహరించుకొనినది. రామచంద్రపురరాజ్యలక్ష్మి తనరక్షకుని గోల్పోయినది" యని యాగాంభీర్యమునకు భంగము గలిగించెను. ఈవాక్యము నాధారపఱుచుకొని రాజు మనసు కుదుటఁబఱుచుకొని "లీలామానుష విగ్రహుని చితి యెచ్చటనున్న" దని యడిగి దానింజూచుట కాత్ర పడసాగెను. మాధవశర్మ పురోగామియై రాజును చితి యున్న గదికి గొనిపోయెను. అందఱును జితికి మ్రొక్కిరి. రాజు నిటలతటఘటితాంజలియై గద్గదకంఠుఁడై "సుకృతీ! ఇట్లు లైతివా?" యని యంగలార్చెను. ఎల్లరు నొక్క క్షణ మచ్చట నిశ్చేష్టులై నిలువఁబడిపోయిరి.

పిదప నెల్లరును బైటకువచ్చి ప్రసాదరాయని యాలోచనా మందిరమునకుఁ బోయిరి. తరువాతఁ బులిబూరు గ్రామనివాసు లెల్లరును జితియున్న గదిలోనికిఁ బోయి "మహాత్మా! మమ్ము విడిచిపోయితివా?" యని చితికి మ్రొక్కి మ్రొక్కి వగచిరి. ఆజనసంఘమున మఱలఁ గల్లోలము ప్రారంభమయ్యెను. భీమారెడ్డి చాలఁ బ్రయత్నించి దానివేగమును గొంచె మడఁపఁగలిగెను.

గ్రామస్థు లెల్లరు నీతొందరలో నున్న సమయమున లోపల రాజు ప్రసాదరాయని, మహేంద్రునిఁ జూచి చాల విచారముతో "దైవసంకల్ప మిట్లున్నది. దానికి మనమేమి చేయఁగలము? ఇఁక విచారించుట తగదు. ధైర్యము తెచ్చుకొనవలయును. మీ మీఁదఁ జాలఁ గార్యభార మున్నది. మీరు ధైర్యము వహించి మీ తండ్రిగారి యశస్సు నిలుపవలెను. ప్రకృతము చాల నపాయకర మగు స్థితి సంభవించినది. కనుగలిగి ప్రవర్తింపకున్న లెక్కలేని చిక్కులు కలుగఁగలవు. గతమును విస్మరింపవలెను. భావికాలమున నిర్విఘ్నముగ విజయము నందుటకుఁ బ్రయత్నింపవలెను. ఐహికజీవిత మాపత్పరంపరాకలుషితము. ఇడుముల కడలుట పురుషలక్షణము గాదు" అని యనేకవిధముల సమాశ్వాసించెను. యువరాజు, మంత్రి మున్నగువారు గూడ నిట్లే యొకటిరెండు మాటలు చెప్పిరి.

అందులకుఁ బ్రత్యుత్తరముగాఁ బ్రసాదరాయఁ డిట్లు చెప్పెను. "ఏలినవారికి మాపైఁగల కటాక్షమునకుఁ గృతజ్ఞులము. సామాన్యులకుఁ బురాకృత పుణ్యాపరిపాకమునఁ గాని మకుటధారుల యనుగ్రహపాత్రులగుట సంభవింపదు. తమ భక్తిగౌరవములకు భాజనులైన మాతండ్రిగారు ధన్యులు. వారి యంశ నాయం దెంతమాత్రమును

లేదు. అయినను దేవరవారు మాయెడల నవ్యాజప్రేమను జూపితిరి. ఇది నావంటివాని కలభ్యము. తమ ప్రజలలో నొకఁడ నైనందులకును, విశేషించి తమ సేవకుఁడ నైనందులకు నేను గర్వపడుచున్నాఁడను. విష్ణ్వంశా సంభూతులగు ప్రభువుల యాగమనమువలన మాతండ్రి గారు ఈశ్వరసాయుజ్యమును బడసినారనుట యథార్థము. ఆశ్వికులు వచ్చి మాతండ్రిగారి మరణవార్త చెప్పినప్పుడు దుఃఖాతిశయమువలన జ్ఞానశూన్యులమై తమయానతిఁ గొనకయే వచ్చినందులకు లజ్జించుచున్నాము."

"మీకిట్టి సందేహము వలదు. మాచిరంజీవి యెట్టి వాఁడో మీరు నట్టివారే యని మేము భావించు చున్నాము. మొదటినుండియు మీకును మాకు నట్టి యవ్యాజస్నేహబాంధవ మమరియున్నది. మేము కాల్య ములను దీర్చుకొనునప్పటికి దారుణమగు నీవార్త విన వచ్చెను. ఇఁక నచ్చట నుండలేక పోయితిమి. మంత్రి మున్నగువా రంతకుఁ బూర్వమే మాకొఱ కెదురుచూచు చుండిరి. మేమిక్కడ కెట్లు వచ్చితిమో యెఱుఁగము. అప్పుడు మాహృదయములు కేవలము నిబిడ దుఃఖాంధ కారచ్ఛాయలచే నావృతము లై పోయియుండెను. మీ ముఖేందుమండలమరీచులు ప్రసరించు నంతదనుక మాకుఁ జైతన్యము గలుగలేదు." అని రాజందులకుఁ బ్రత్యు

త్తర మిచ్చెను. అపుడు మంత్రి వారికి దుఃఖార్త యగు రాణి మాటలుగా నిట్లు చెప్పెను. "నాయనగారి మరణము మీకంటె మాకు విచారకరమైనది. అయినను విచారించుటవలనఁ బ్రయోజనములేదు. తను పవిత్ర ప్రవర్తనవలన నీశ్వరసాయుజ్యము నందియున్న నాయనగారిని గుఱించి విచారించుట తగదు. వివేకమహితులగు మీకుఁ జెప్పవలసిన దేమున్నది? నేనిప్పుడే పులిబూరు వచ్చెదను. వచ్చి నాయనగారి పవిత్రచితినైన నారసి ధన్యురాల నయ్యెదను. అవసానసమయమున—బ్రతికి యుండఁగా వారిని మఱియొకమాఱుదర్శింపఁజాలకపోవుట యథార్థముగ నాదురదృష్టమే. నా రాకనుగుఱించి యొకింత తెలియఁజేసి చెల్లెంద్ర నూరడించుచుండుఁడు."

అందులకుఁ గూడఁ బ్రసాదరాయఁ డిట్లు చెప్పెను. "అక్కగారికి మాయందుఁగల సోదరవాత్సల్య మనిర్వచనీయ మగుట యెఱుంగుదుము. ఆమెకూడ స్వయముగ వచ్చి యీవిపత్సమయమున మమ్మాదార్పఁ జూచుట నిజముగ మాభాగ్యమే. మావిచారమున నామెయుఁ బాలుగొనియుండుటవలన మావల్లనైన యపరాధము లన్నియుఁ జెల్లాచెదరై పోయినవన్న మాట."

ఇంక నిట్లు వారు కొంతతడవు మాట్లాడుకొనిన పిదప హంతకుల ప్రస్తావన వచ్చెను. అపుడు ప్రసాదరా

యని సంగీతము నెఱింగి కుమారస్వామి చదువుడని భుజంగరాయని లేఖను మంత్రి కిచ్చెను. అదివిని రాజును వెంటవచ్చినవారును నిర్విణ్ణులై "అన్నా! దుర్మార్గుడెంత పనిఁజేసె" నని మఱియొకమాఱు పగచిరి. పిదప రాజు లేచి యిట్లు చెప్పెను. తక్కినవారెల్లనుగూడ లేచిరి. "ఇది భుజంగరాయని పనియే యని మేమింతవఱకే ధ్రువపఱచికొంటిమి. అది యథార్థమే యైనది. జాబులోని సంగతులను జూడ వాఁడు చాలఁ బట్టుదలతో నున్నట్లు తోఁచుచున్నది. అయినను గేవల మీవ్రాఁతను నమ్ముటకు వీలులేదు. భయపెట్టుట కిట్లు వ్రాసియుండవచ్చును; గాని మన మేమఱి యుండరాదు. మన మెట్లయినను వానిని సంహరించి తీఱవలెను. మన మెంత ధైర్యముతో నున్నను వాని మరణవార్తను వినునంతదనుకఁ బ్రజలలో శాంతి యొనఁగూడదు."

అప్పటి కివ్వలనున్న ప్రజల కలకలం బంతయు నడఁగెను. రాజ ప్రభృతు లెల్లరు నివ్వలకు వచ్చిరి. వారిం జూచి ప్రజలు నిశ్శబ్దముగను గంభీరముగను నిలువఁబడిరి. రాజిట్లు చెప్పెను. "సంగతిసందర్భములన్నియుఁ జూడఁగా హంతకులు భుజంగుని యనుచరులని తోఁచుచున్నది. విద్రోహు లెవ్వరైనను హంద్రను రూపుమాపుట కర్తవ్యము. ఈవిషయమున మేము తగు ప్రయత్నములను

గావించెదము. వానికొఱ కేరును జడియనక్కరలేదు. హంతకుల యునికిని, రహస్యమును మాకుఁగాని ఠాణేదారుగారికిఁగాని తెలిపినను, వాండ్రను బట్టి యొప్పగించినను మంత్రిసామంతాదులతో నిండియున్న మా సభాస్థానమున వారికి విశేషబహుమానము గావింతుము.”

ఇట్లువిని యెల్లరును రాజు నౌదార్యమును మెచ్చుకొనిరి. ప్రసాదరాయఁడు తమ్మునితోఁగూడఁ జెల్లెండ్రను జూచుటకై మాధవశర్మ యింటికి బయలు దేఱెను. రాజును, యువరాజునుగూడ వారితో నరిగిరి. తక్కిన వారు ఠాణాకుఁ బోయిరి.

# 8

ప్రసాదరాయఁడును, మహేంద్రుఁడును దమ యింటి ముందు గుఱ్ఱములను దిగి లోనికరిగిన వెంటనే వారు రాజధానినుండి వచ్చిన వార్త మాధవశర్మ యింటనున్న జానకీరుక్మిణులకుఁ దెలియవచ్చెను. తరువాతఁ గొంచెము సేపటికే మంత్రిసామంతాదులతోఁ గూడి రాజు వచ్చిన వార్తగూడఁ దెలియవచ్చెను. రాజు వచ్చిన తరువాత నచ్చట జరిగిన పనులును, రాజు విచారపరిమితియు, సోదరులను సమాశ్వాసించుచు రాజు పలికిన పలుకులును, నాతఁడు ప్రజలతోఁ జెప్పిన మాటలును, మాధవశర్మ

యింటి కెల్లరును బయ దేరుటయుఁగూడఁ దెలియవచ్చెను. ఆకారణమువలన వారి కపోలఫలకములపైఁ బ్రవహించు నశ్రులహరి యవిచ్ఛిన్న మయ్యెను. దానిని నిరోధించుటకు మాధవశర్మ గృహిణియు, వంటలక్కయుఁ బ్రయత్నించిరి. రుక్మిణి యత్తగారుగూడ నొకటిరెండు తడవలు ప్రయత్నించియే యూరకుండెను. అందఱ ప్రయత్నములవలనను గలిగిన ప్రయోజనము తెల్లవాఱినది మొదలు గొంతెత్తియేడ్చుటమాని లోలో దుఃఖించుట యొక్కటియే.

ఇంతలోఁ బ్రసాదరాయాదు లచ్చటకు వచ్చిరి. తోడనే యీ సంగతి లోపలఁ దెలిసిపోయెను. మఱల జానకీ రుక్మిణుల హృదయములు కలఁగిపోయెను. అశ్రుబిందూద్గమంబున వారి తీక్ష్ణదృక్కులు మందములై పోయెను. మఱల నది యొకింత తేరుకొనునప్పటికిఁ బ్రసాదరాయఁడును మహేంద్రుఁడును వచ్చి ప్రత్యక్షమైరి. రుక్మిణి ప్రసాదరాయనిపైఁబడి గొల్లుమనియెను. జానకి పైటచెఱఁగుతో ముఖము గప్పుకొని రోదనము ప్రారంభించెను. జానకీరుక్మిణుల విచారము మఱల మిన్నుముట్టెను. రాజనేక విధముల వారిని సమాశ్వాసించుచుండఁగా రాణి వచ్చెనను వార్త వచ్చెను. ఆవార్త వెంటనే పల్లకి

దిగి రాణి లోనికి వచ్చెను. మాధవశర్మ గృహిణియుఁ, గుమారస్వామి తల్లియు నామెను లోనికిఁ గొనివచ్చిరి.

జానకియు రుక్మిణియు రాణిపైఁబడి యేడువసాగిరి. అప్పుడు రాణి వారినిఁ బొదివిపట్టి యిట్లు చెప్పెను. "దారుణవ్యాపారమే జరిగినది; గాని మన మిప్పుడు విచారించుటవలనఁ బ్రయోజనమేమి? అమ్మగారు పరమ పదించినప్పటినుండియుఁ దల్లియుఁ దండ్రియుఁ దామెయై మిగుల గారాబముతోఁ బెంచిన బాబయ్యగారికిఁ దట స్థించిన దుర్మరణము తలంపునకు వచ్చినప్పుడు మనస్సు చెదరిపోవుటయు, భావయంత్రము చిక్కుపడిపోవుటయు, ధైర్యకంచుకము బ్రద్దలై పోవుటయు, విచారసాగర ము త్తరంగితమై యుక్కిరిబిక్కిరి గావించుటయు యథా ర్థమే అయినను నాయనగారి గిరిధైర్యమును దలంచు కొనియు, వారి మంగళమును గోరియు మన మిపుడు విచారమును దిగమ్రింగు కొనవలయును."

ఆయక్కసెల్లెండ్రు మఱలఁ గొంచెము మూరడిల్లిరి. పిదప రాణి భట్టాచార్యుని చితి చూచుటకై బయలు దేఱెను. ఆమెతోఁ గూడ జానకీరుక్మిణులును బయల్వె డలిరి; గాని మాధవశర్మ యొకింత నిషేధించెను. అప్పుడు రాణి మాధవశర్మను జూచి "మీయభిప్రాయము గ్రహిం చితి. ఆహేతువువలనఁ జెల్లెండ్ర మనఃఫలకములు మఱల

ప్రబద్ధలగుట నిజమే అయినను, కన్నుమూసి తెఱచునంతలో నాయనగారి భౌతికశరీరము రహస్యముగ నదృశ్యమై పోయినది. ఇఁక నీకండ్ల కాదివ్యమంగళవిగ్రహ మెన్నఁడును గానిపింపదు. దానిని విశ్రమింపఁజేసిన చితినైన నొక్కమాఱు కనులారఁ జూడనిండు. ఇఁక నాయనగారికిఁ బ్రత్యక్షముగ మ్రొక్కు భాగ్య మెన్నఁడును లేదు; గావున నాపరమపూజ్యుని యస్థిశకలములకైనఁ గడసారి వందనము లర్పింపనిండు. దాని వలన దుఃఖశాంతి గలుగ వచ్చును" అని చెప్పెను. మాధవశర్మ మాఱుపలుకకుండ సమ్మతించెను. అందఱును బయలు దేఱిరి.

ఆయింటిని సమీపించునప్పటికి రాణి హృదయమును, జానకీ రుక్మిణుల మనస్సులును దడదడఁ గొట్టుకొనసాగెను. కాళ్లయందుఁ గంప ముదయించెను. కంఠముల గాద్గద్యము తోఁచెను. చూపులు చెదరిపోసాగెను. ఎట్టెట్టులో వారు భట్టాచార్యుని చితియున్న గదిలోని కరిగిరి. అక్కడ కరుగునప్పటికి దుఃఖాక్రాంతమై వారికి చైతన్యము పూర్తిగ లోపించిపోయెను. అక్కతన గొంత తడవు వారా గదియందుఁ బుత్తడిబొమ్మలవలె నిలువఁబడి పోయిరి. రుక్మిణి రాణిభుజముపైఁ దన శిరము నానుకొని యుండెను.

మాధవశర్మ వారిస్థితి యంతయుఁ జూచి రుక్మిణీ యని

పిలిచెను; గాని యామె పలుకలేదు. అదిచూచి రాణి యామెమోమును పైకెత్తుచుఁ జెల్లాయీ యని పిలిచెను. అప్పుడు సుక్మణి దీర్ఘనిశ్వాసము విడుచుచుఁ గనులువిప్పి రాణికంఠము కౌఁగిలించుకొని శిరస్సునామె వక్షమున కానించి "అక్కా! నాయనగారిఁకఁ గాన్పింపరు గాఁబోలు" నని గొల్లుమనియెను. అదివిని జానకియు గొల్లుమనియెను. అప్పుడు రాణి స్థిరచిత్తయై వారి కన్నీరు తుడిచి యనేకవిధముల సమాశ్వాసించి వారితోఁగూడ మాధవశర్మయింటికి వచ్చెను.

జానకీరుక్మిణుల నూరడించుటలోఁ బ్రవృత్తయైయున్న యామె కింతవఱకు ప్రసాదరాయని, మహేంద్రుని బలుక రించి యూరడింపుఁ బలుకులు పలుక నవకాశమే చిక్క దయ్యెను. అప్పుడు తెలివిచేసికొని యామె యాయన్న దమ్ముల నిరువురను అనేకవిధముల విచారముడిపి "నాయ నగారి దివ్యాంశము మీయందు నిక్షిప్తంబైనది. వారి దివ్యయశస్సుగూడ మిమ్ములంకరించును. వారికిమర్దనులై నెగడిరి. మీరును శత్రుంజయులై వెలయుఁడు. సత్కా ర్యములయందును, దుష్టశిక్షణమునందును వారు చూపిన పట్టుదలయు, సామర్థ్యంబును, చాతుర్యంబును, ధైర్యో త్సాహములును మిమ్ము భూషించుఁగాత" మని చెప్పెను.

అప్పటికై దారుగడియల ప్రొద్దెక్కెను. భట్టాచార్యుని నిర్యాణవార్తను విని మిపులదుఃఖితులై ప్రసాదరాయనిఁ బరామర్శచేయుటకై వచ్చిన సమీపగ్రామవాసులగు పెద్దమనుష్యులు వీధియంతయుఁ గిక్కిరిసి పోయియుండిరి. కుమారస్వామిచే నాజ్ఞప్తులై రాత్రి హంతకులను వెదకుటకై నల్వంకలకుఁ బోయిన గుఱ్ఱపు రౌతులు చనుదెంచి తమవ్యర్థప్రయాసను దెలిపి కర్తవ్యము నెఱుంగుటకు నిరీక్షించుచుండిరి. వారెల్లరును భట్టాచార్యుని మరణమునకు వగచుచు, రాజకుటుంబపు టాగమనమున కచ్చెరుపడుచు నితరమును మఱచియుండిరి.

అప్పుడు రాజు, యువరాజు, రాణియు కాణాకు వెడలి పోయిరి. పోవునపుడు రాణి ప్రసాదరాయనింబిలిచి "తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచును. పెద్దమఱఁదలీనడుమనే సంక్రాంతిపండుగ నిమిత్తము పుట్టినింటికి వెళ్ళియున్నది. ఇట్టులగునని యేరెఱుక! మన కంకఱకును గూడ నీయేఁటి మకరసంక్రాంతి దుఃఖసముద్రమున మునిఁగిపోవలసియున్నది. అయిన నేమి చేయఁగలము? నేఁడే మఱదండ్ర నిమిత్తము నావసంపు" మని చెప్పెను.

పిదపఁ బ్రసాదరాయఁడు తననిమిత్తము వీధిలోనిలిచియున్న పెద్దమనుష్యులతోఁ మాట్లాడుటకుఁ బోయెను. రామవరగ్రామవాసులు గూడఁ జాలమంది వచ్చియుండిరి.

# 9

యథాకాలమున దహనసంస్కారముతరువాతఁ జేయవలసిన భట్టాచార్యుని యౌర్ధ్వదైహికక్రియలు యథాశాస్త్రముగఁ బ్రారంభమయ్యెను. మఱునాఁడే పుట్టినిండ్లనుండి రాధాదేవియు, శచీదేవియు వచ్చిరి. వారితోఁగూడఁ బ్రసాదరాయాదులను బరామర్శించుటకు వారి తలిదండ్రులుగూడ వచ్చిరి. అప్పుడే ప్రసాదరాయని తండ్రివైపు చుట్టాలును వచ్చిరి. ఆశ్రితులు, స్నేహితులు మున్నగువారికి లెక్కయే లేదు. అందఱును వచ్చి తామొకమాఱు దుఃఖించి ప్రసాదరాయాదుల నొకమాఱు దుఃఖింపఁజేసిరి. మనస్సులోనైనను భట్టాచార్యుని దూషించినవారొక్కరును లేరైరి. ఎల్లరు నాతని విజ్ఞానమును, వైభవమును, దీనదయాళుత్వమును, బరోపకారశీలతను, శక్తిసామర్థ్యములను, రాజసభలయం దాతనికిఁ గలిగిన పూజాగౌరవములను దలంచుకొని యంగలార్చెడివారే. ఎల్లరు నాకసముపిడుగై మీఁదఁబడినట్లును, విలయము సమీపించునట్లును, బ్రళయాగ్ని చిటచిటధ్వానములును, బుష్కలావర్తమేఘముల గర్జారవమ్ములను వినుచున్నట్లును, చదల నంతటను వ్యాపించిన ద్వాదశాదిత్యుల ప్రచండమయూఖముల వేఁడిమికి మాడిపోవుచున్నట్లును దుఃఖించెడివారే.

రామచంద్రపురసంస్థానమునందలి జనులెల్లరు నిట్లు విచారించిరి. మొత్తముమీఁద నెఱిఁగియున్నంతవఱకు భట్టాచార్యునిఁ దలంచికొని కన్నీరు విడువనివారు లేరు. కోవిదులు విద్వత్పర్వతము క్రుంగిపోయినదని వగచిరి. వీరులు వీరతేజము మాసిపోయిన దని చింతించిరి. ఉత్కృష్ట భోగుల మని విఱ్ఱవీఁగు కొందఱు తమ కగ్ర స్థానము లభించెనని సంతోషించినను వారుగూడనైహిక సౌఖ్యము పీల్చివేయఁబడిన పిప్పియైపోయినదని దుఃఖిం చిరి. దీనులు తమపాలిటి కల్పవృక్షము కూలిపోయినదని యును, సజ్జనులు ధర్మము నిరాలంబమైపోయిన దని యును, రమణీమణులు లోకబాంధవుఁ డస్తమించిపోయె ననియు వగచిరి..

మామగారికొఱకు శచియు, రాధయుఁగూడఁ జాల దుఃఖించిరి; గాని శచివిచారమును రాధవిచారముతోఁ బోల్చుటకు వీలులేదు. రాధ రెండుసంవత్సరములనుండి కాపురము సేయుచుండుటవలన భట్టాచార్యుని ప్రేమా దరములకుఁ బాత్రురాలయ్యెను. భట్టాచార్యుఁడు రాధకు వరుసకు మామయే; గాని యాదరమునఁదండ్రియుఁ, బ్రేమమునఁ దల్లియుఁ, స్నేహమున అత్తయు, సౌహార్ద మునఁ దోఁబుట్టువునై యుండెను. రాధ కిప్పుడా యాద రము, నాప్రేమ, ఆస్నేహము, నాసౌహార్దము నన్నియు

జ్ఞప్తికి వచ్చెను. ఆతఁడుచెప్పిన బుద్ధులుగూడ జ్ఞాపకము వచ్చెను. శచితండ్రి శచిని మహేంద్రున కీయవలయు నను తలంపుతో వచ్చి ప్రశంసించినపుడు భట్టాచార్యుఁడు రాధను నిర్దేశించి "ఆమెయే యిప్పుడీయింటికి సర్వాధి కారిణి యైయున్నది. ఆమెయే మహేంద్రునకు తల్లి. ప్రసాదరాయఁడే యాతనితండ్రి. ఆతనికిఁ బెండ్లిచేయ వలసిన బాధ్యత వారియందే యున్నది. మీరావిషయ మును వారితోడనే ప్రస్తావింపుఁడు. మీ ప్రయత్నము కొనసాగునేని ఆమెయే పెండ్లిపెద్ద. ఆమెకే మీరువియ్యపు టప్పనములు చెల్లింపవలెను. ఆమెయే మీ కొమార్త విషయమై పెండ్లికొడుకునకు నచ్చఁజెప్పఁగలదు" అని చెప్పెను. అట్లే శచితండ్రి రాధతోఁ జెప్పెను. "నాకు మీ రేకన్యను బెండ్లిచేసినను నిశ్చయముకాకపూర్వము నాకామె నొకమాఱు చూపవలె" నని మహేంద్రుఁడు జానకిచేఁ దండ్రికిఁ జెప్పించుట దాను వినియుండుటవలన మామగారి యభిప్రాయమును గుర్తెఱిఁగి యిఁకనీప్రశ్నకు సమాధానముచెప్పుట యెట్లును దప్పదని నిశ్చయించు కొని, చాల సంతోషముతోడను, జాల మొగమోటతో డను, జాలసిగ్గుతోడను రాధ యప్పుడు "పెండ్లికొడుకు మిగులఁ బెంకివాఁడు. మున్ముందు వధువు నాతనికిఁ జూప కుండ మేమేమియుఁజెప్పుటకు వలనుపడదు. మాచెల్లాయి

నొక మాఱు మేము చూడవలయు" నని చెప్పెను. ఆసంగతిగూడ నిప్పుడామెకు జ్ఞప్తికివచ్చెను. మఱియు నామె సంక్రాంతికిఁ బుట్టింటి కరుగునపుడు భట్టాచార్యుఁడు ప్రేమతోఁ బిలిచి "తల్లీ! నీవిప్పుడీ యింటి కధికారిణివై యున్నావు. గృహలక్ష్మి నీచిరవియోగమును సహింపఁజాలదు. నీసాన్నిధ్యమును బాసియుండుటచే వెలవెలఁబోవు నీగృహలక్ష్మిని నేను చూడఁజాలను. వేగ రావలయునుసుమా" యని చెప్పెను. అప్పుడామె ముసిముసినవ్వులతోడనే ప్రత్యుత్తర మిచ్చెను. అదిగూడ నామెకిప్పుడు జ్ఞాపకము వచ్చెను. హా! ఎంత కష్టము.

రాధకివియన్నియు జ్ఞప్తికివచ్చినపుడు హృదయము నీరై పోయెను. అవియన్నియు నామె తలఁచికొని తలఁచికొని విచారించెను. మఱియు నారమణీమణి తన నాథునికిఁ జైతన్యము లోపించిపోయెననియు, దనపాలిటిదేవుఁ డవతారమును జాలించెననియు నేఁటితోఁ దనయింటి పెద్దదిక్కు కడతేఱిపోయెననియు వగచెను. ఈయనంతవిషాదముతో నామె శచీదేవినిఁ జేరఁబిలిచి "చెల్లెలా! నీవే మియు నెఱుఁగవు. నేఁటితో మనసంసారము గహనమై పోయిన" దని చెప్పి శోకించెను. ఇది విని పాపము ముద్దరాలగు శచి, యిందలియర్థము తెలిసికొనలేక తెలిసికొని నట్లే వెక్కివెక్కి యేడ్చెను. ఈతీరున రాధ భట్టాచా

ర్యునికొఱకు జానకీరుక్మిణులకంటె నెక్కుడు విచా రించెను.

రాధాదేవియొక్కయు, శచీదేవియొక్కయు నాగమ నమునిమిత్తము నిరీక్షించుచుఁ బులిబూకు గ్రామము నందే యుండిన రాణి, రాధ వచ్చిన యొకగడియకా మె వచ్చిననార్తవిని పరామర్శించుటకు మాధవశర్మ యింటికి వచ్చెను. రాధ, రాజు రాణి మున్నగువారు వచ్చియున్న సమాచారమును నావికులవలన రాజమహేంద్రవరమునందే వినియెను. రాజదంపతుల యాగమనమువలనను, వారి విచారమువలనను రాధకు భట్టాచార్యునిఘనత మఱింత విశదమయ్యెను. "భట్టాచార్యుఁడు చాణక్యుని తరువాత మఱలనంతటివాఁ" డని తానపుడపుడు పుట్టినింట వినిన జనవాక్యమునందలి యాథార్థ్యమిప్పుడా మెకు మఱింత విశదమయ్యెను. ఆ కారణముచే రాణి చూడవచ్చినపు డామెహృదయమున విషాదసాగరము బ్బెత్తుగఁ బొంగి పోయెను.

రాణి యనేకవిధముల రాధ నూరడించి "నిన్ను జూచి యేమియునెఱుఁగని ముగ్ధరాలు, శచి ఘోరాతిఘోర ముగ విలపించుచున్నది. జానకీరుక్మిణులవలె మీరుగూడ నిట్లు వగచుచుండినచోఁ దమ్ముల కెట్లు ధైర్యము నిలువఁ గలదు? ఈ యాపత్సమయమున వారిపైఁ జాల భార

మున్నది. నీవు ధైర్యముగొల్పకున్నచో వారీవిపత్సము ద్రమును దరించుటెట్లు? జానకీరుక్మిణు లిపుడు విచార వివశలై యున్నారు. ఈ యింటి యాజమాన్య మంతయు నిప్పుడు సంపూర్ణముగ నీమీఁదఁ బడిపోయినది. అనే కులు వచ్చుచుందురు. అనేకులుపోవుచుందురు. నీవిట్లున్న వారిని సరిచూచువా రెవ్వరు? ఈవిచార మనంతమైన దే; దుర్భరమైన దే; గాని మనస్సును దిటవుపఱుచుకొనవలెను. గతించిన దానికి వగచినఁ బ్రయోజనములేదు. బ్రతికి యున్న వారికొరకు జాగ్రత్తపడవలెను. నేఁడు దుఃఖ మును దెచ్చిపెట్టిన యీసంసారచక్రము రేపే సంతోష మును దెచ్చిపెట్టును. ఇడుమలను, విచారమును, విస్మృతి జలావర్తనమున ముంచివేయవలయును. నీవంటి రమణీ మణికి ఇంతవిచారము తగునా?'' యని రాధను హెచ్చ రించెను.

“వదినే! నీవుచెప్పిన దంతయు యథార్థము. స్నేహ రసకూలంకషమై ప్రేమైకనిలయమై, యానందమందిరమై వెలయు మామగారి గంభీర ముఖమండల మింకను స్మృతిదర్పణమునఁ బ్రతిబింబితం బగుచునేయున్నది. “తల్లీ” “రాధా” యను వారి ప్రేమసంబోధనము లిం కను వినుచున్నట్లేయున్నది. ఆపూర్వస్మృతి యంతయు హృదయమును గలచివేయుచున్నది. నడుమనడుమ నా

హృదయమున ధైర్యప్రసార మగుచునేయున్నది; గాని వినీలనిబిడవిషాదజలదపంక్తి దానిఁ గప్పివేయుచున్నది. జానకీ రుక్మిణుల విచారస్థితిని దిలకించుటవలన నది మఱింత విజృంభించుచున్నది; గాని విడిపోవుటలేదు. అయినను నీవు చెప్పినట్లు మనస్సు రాయిచేసికొనక తీఱదు. అట్లే చేసికొనియెదను. అత్తగారి నెఱుఁగనే యెఱుఁగను. మామగారికైన సేవఁజేయుభాగ్యము రెండు సంవత్సరములయందే తీరిపోయినది. పాపము పసిబిడ్డ శచి మామగారి చాటు కాపురమైన నెఱుఁగదు. ఈదురదృష్ట మంతయు మాదియే యగును. అత్తమామలు సంసారమును జక్కఁబెట్టుచుండ సుఖించు భాగ్యము కొలఁదికాలమైనఁ దక్కనదిగాదుగదా!" అని రాధ కొంచెమూరడిలి పలికెను.

పిదప రాణి మఱికొంతతడ విట్లే రాధ నోదార్చెను. ఆమె పూర్తిగ నూరడిల్లిన పిదప జానకీ రుక్మిణులను శచీదేవినిఁ గూడ నింకొక మాఱూరడించెను; గాని రాణి శచివిషయమున నంత శ్రమ పడవలసిన యవసరము లేకపోయెను. తోడికోడలగు రాధయు నాఁడుబిడ్డలగు జానకీరుక్మిణులు నూరడిల్లుటఁ జూచి శచీదేవియు నూరడిల్లెను. కాని చుట్టాలు పరామర్శింప వచ్చినపుడెల్ల రాధయు, నంతకంటె జానకీ రుక్మిణులును వగవకుండ

నుండఁ జాలకపోయిరి. నడుమనడుమ రాధ జానకీ రుక్మిణులను, వారు రాధను సమాశ్వాసించుకొనుచుండిరి; గాని ముగ్గురి హృదయములును గూడ విచారపూరితములే.

# 10

అట్లొకటి రెండు దినములు గడచిపోయెను. భట్టాచార్యుని భౌతిక శరీరముతోఁబాటు చితిగూడ స్మరణీయమైపోయెను. అది యప్పుడే కాలప్రవాహమునఁబడి విస్మృతి సాగరమునఁ జేరికొనియెను. అది యడుగంట మునిగిపోవుట కింక నెన్నియోదినములు పట్టదు. ఇఁక భట్టాచార్యుని పేరుమాత్రమే నిలిచియుండునది. అది యాతఁడు కష్టించి సంపాదించుకొనినది. గావున నిలిచిపోవును. భగవంతుఁ డిచ్చినవి భగవంతునియందే కలిసిపోవునవి. ఈ ప్రపంచమున మానవుఁడు భగవంతుఁడిచ్చిన తెలివి తేటలను వృద్ధిచేసికొని సంపాదించుకొనుకీర్తి, యపకీర్తి, అను రెండు వస్తువులు మాత్రమే నిలిచిపోవునవి. తక్కిన వన్నియు నస్థిరములే. పౌరుషములేని వాఁడీ రెండిఁటి నేదియును గూడ సమార్జించుకొనఁజాలక అనామకుఁడై పోవును.

భట్టాచార్యుఁడు బాల్యమునఁ జాల శోచనీయమగు స్థితి ననుభవించెను. అతని తండ్రి చాలబీదవాఁడై సంసార

భారమువలనఁ గ్రుంగిపోయియుండెను. అతని యిరువురు సోదరులే సంసారమును నిర్వహించుచుండిరి. ఆతఁడు బాల్యమున గోవిందుఁ డని వ్యవహరింపఁబడుచుండెడి వాఁడు. పదునాల్గు పదునైదేండ్ల ప్రాయమున గ్రాలు మాత్రముచేయఁగల విద్వాంసుఁడు. ఆతఁడాకాలమున వ్యాయామమునఁ జాల శ్రద్ధచూపుచుండెను; గాని తండ్రికి నన్నలకు నది యెంతమాత్రమును రుచించునది గాదు ఎన్నివిధముల మందలించినను వారిమాటల నాతఁడులెక్కచేయుటలేదు. తుదకాతని పెద్దయన్న యొక నాఁడు చాలఁ దీక్ష్ణముగ నిందించెను. వెంటనే యాతఁ డెవ్వరికినిఁ జెప్పకుండఁ గాశీనగరమునకుఁ బాఱిపోయెను.

అదియే యాతని యభ్యుదయమునకుఁ బ్రారంభమని చెప్పవచ్చును. అప్పుడే యాతని దరిద్రదేవత గూడఁ బలాయనము గావించెను. ఆతని పలాయమును గుఱించి యన్నలును, దల్లిదండ్రులును జాల విచారించిరి; గాని యప్పటినుండి వారికి జీవయాత్ర యొకింత సుఖకర మయ్యెను.

భట్టాచార్య బిరుదముతోడను, విద్వచ్చక్రవర్తి వేష ముతోడను గోవిందుఁడు తిరిగి పులిబూరు వచ్చునంత దనుక నెనిమిది తొమ్మిదియేండ్లు ఎవ్వరు నాతని జాడయే యెఱుఁగరు. ఆతఁడు వచ్చునప్పటి కాతని యిల్లింకను

బూర్గిల్లుగానే యుండెను. ఆపండితసార్వభౌముఁడు కాశీ కావడితో నందే గృహప్రవేశము గావించెను. అతని రాకకెల్లరు నానందించిరి. ఒకటిరెండు సందర్భముల యందుఁ బులిబూరు నందును, తత్ప్రాంతములయందును గల పండితశిఖామణు లాతనింబరీక్షింపఁబూని వాదము ప్రారంభించి యుందోడిపోయిరి. వెంటనే యాతని యశస్సు దేశమునం దంతటను వ్యాపించెను. రామచంద్రపుర సంస్థానాధీశుఁడు తన సంస్థానమునందలి పండితుల కెల్లర కును బ్రతిసంవత్సరమునందును పెద్ద పెద్ద వార్షికము లిచ్చుట మర్యాదగా నుండెను. ఆ వార్షిక బహుమానము నిమిత్తము ప్రయత్నింపుమని భట్టాచార్యుని దండ్రి మున్నగువారు చాలమంది బలవంతముచేసిరి; గాని తన సంస్థానము నందలి పండితుల నాహ్వానించి రాజు గౌరవింపవలయునే గాని పండితులేపోయి యాతనిం బ్రార్థించు టేటిధర్మ మని యాతఁడందులకుఁ దిరస్క రించెను. ఇది చారులముఖమున రాజునకుఁ దెలియ వచ్చెను. తన సంస్థానమందలి పండితు లెల్లరు నిదివఱ కాతనితో వాదించి యోడిపోవుటగూడ నాతనికిఁ దెలియ వచ్చెను. ఆతఁడు రాజనీతియందుఁగూడఁ జాల నేర్పరి యనియు, దేహబలమున నసామాన్యుఁడనియుఁగూడఁ గొలఁది దినములలో దేశమునం దంతటను బ్రఖ్యాతి

గలిగెను. తరువాత రాజు ఆతని శక్తి సామర్థ్యములను బ్రత్యక్షముగఁ దెలిసికొని పులిబూరు ఠాణాకు ఠాణేదారుగాఁ జేసి గౌరవించెను. అప్పటివఱకు నాతనికి వివాహము కాలేదు. వెంటనే పులిబూరు నివాసియగు శివనాథశాస్త్రి యను నాతఁడు తన కొమార్తె నిచ్చి పెండ్లి చేసెను. ఇవన్నియు భట్టాచార్యుఁడు కాశీనుండి వచ్చిన నాలుగైదు మాసములలో జరిగిపోయెను. ఆతని నైహిక సౌఖ్య మప్పటినుండియే ప్రారంభమయెను. అతని బాల్యమున భయంకరరూపముతోఁ గాన్పించిన కాలము సుకుమార రూపముతోఁ బ్రత్యక్షమై సేవింపఁదొడఁగెను. ఆతఁడు బాల్యమున ననుభవించిన నికృష్టదశయు ననుపమానమే ఆతని భావములును, గార్యములునుగూడ నసమానములే. ఆతని జీవితమంతయు నసమాన మైనదే. తుదకాతని స్వర్గయాత్రగూడ నసమానమే యైనది.

ఆతని యెడలఁ గల గౌరవాతిశయమువలన రాజకుటుంబ మాతని యుత్తర క్రియలు ముగియునంతదనుక నచ్చటనే యుండుటకు నిశ్చయించుకొనియెను. రాజ్యపరిపాలనాభార మంతయు మంత్రిపై నుంచి రాజును యువరాజును గూడఁ బులిబూరునందేయుండి హంతకుల నన్వేషించుటలోఁ బ్రవృత్తులైరి. రాజు భుజంగరాయని యుత్తరము ననుసరించి రామవర గ్రామవాసుల కెట్టి

విపత్తును గలుగకుండుటకై రాజధానినుండి రెండువందల కాల్బంటులను, వారిపైఁ బరీక్షకులుగ నుండుటకు ముప్పది మంది రౌతులను దెచ్చి కాపుండ నియమించెను. వేఱొక నూర్గురు తాళ్వికులను రప్పించి పులిబూరుస నిలిపెను. తన గూఢచారులలో మిగుల మాయావులగు నిద్దఱు ముగ్గ అను భుజంగరాయని గుట్టుమట్టులను దెలిసికొనుటకు నియమించెను.

ఇదియంతయుఁ జూచి ప్రసాదరాయఁ డందుఁ దాను గూడఁ గొంచెము ప్రసక్తి గలిగించుకోఁ బ్రయత్నించెను. ఆతనివెంట మహేంద్రుండును గుమారస్వామియుఁగూడ సిద్ధపడిరి. మాధవశర్మ మాత్రము సాంసారిక వ్యవస్థాపకుఁడై యుండుటవలనఁ బ్రయత్నింపలేదు. ఆతఁడు వారిని భట్టాచార్యుని యుత్తరక్రియలు ముగియు సంతదనుక నిందుఁ బ్రవేశింపవలదని నిషేధించెను. వారా నిషేధమును లెక్కసేయకపోవుట వలన మాధవశర్మ యా సంగతి రాజునకు నివేదించెను.

వెంటనే రాజు వారి నా ప్రయత్నమునుండి మఱలించెను. వారిని నివారించుచు రాజిట్లు సమాధానము చెప్పెను: "ఇట్లు చేయుటవలనఁ బిఱికితన మనిపించుకొనునని యు లోకులు భావ్యపాయశంకచే మీరిందుఁ బ్రవేశింప మానినారని చెప్పుకొందురనియు భీరులని భావించి

భుజంగరాయఁడు మిమ్ము మఱింత లోఁకువ సేయుననియు భావింపవలెను. దీనిని గుఱించిన భుజంగరాయని నిషేధము నహేతుకముగ నే యున్నది! ఇప్పుడు మేము చెప్పి నవిగూడ నవియే కారణములు. కావున నీ పండ్రెండు దినములు నెట్లయిన గడచిపోనిండు. తరువాత మీ సామర్థ్యములను బ్రకాశము సేయవచ్చును. అంతవఱకును మేము బ్రయత్నించెదము. ఈమధ్య కాలమునందే భుజంగరాయఁడు పట్టుబడినచో నదృష్టవంతులమే. లేకున్నఁ బిదప నెల్లరకు నీప్రయత్నము తప్పనిదే యగును''

ప్రసాదరాయఁడు దీనికిఁ బరిహారోక్తులను జెప్పి తన ప్రయత్నము నెట్లో కొనసాగింపఁబ్రయత్నించె; గాని రాజందుల కంగీకరింపలేదు. ప్రసాదరాయఁ డిక మర్యాద గాదని యాప్రయత్నమును విరమించెను. అతని ననుసరించు మహేంద్రుఁడు నూరకుండెను. నాకేల యభ్యంతర మని కుమారస్వామి యానిషేధమునుండి తప్పించుకొనఁ జూచెను; గాని లాభము లేకపోయెను.

ఆ పండ్రెండు దినములును గడచిపోయెను. భట్టాచార్యుని యుత్తరక్రియలు ముగిసెను. భట్టాచార్యుని యాత్మకు శాంతి గలుగుటకై తత్సమయమునఁ బ్రసాద రాయఁడు సమస్తదానములను జాల గొప్పగఁ జేసెను.

రాజు గూడ భట్టాచార్యుని యాత్మశాంతికొఱ కనేక దానములను గావించెను.

ఈ పన్రెండు దినములును రాజనేక విధములఁ బ్రయత్నములు సేయించెను; గాని హంతకులు దొరకలేదు. వారిజాడయే యెవరికిని దెలియలేదు. అంత రాజును రాణియుఁ బ్రసాదరాయనాయకులకు మఱియొకమాఱు ధైర్యము చెప్పి, ప్రసాదరాయనికి సాయముగ యువరాజును బులిబూరునందే యుండ నియమించి రాజధానికిఁ జనిరి.

## 11

జాము న్నరరాత్రి యయ్యెను. దుర్దాంతయగు నంధకార పిశాచిని వెంటబెట్టుకొనివచ్చిన నిశాలలన జగత్తంతయు వడఁకునట్లు భయంకరరూపమును దాల్చియుండెను. దుర్భరమగు చలిగాలి నిరంకుశాధికారమును నెఱపుచుండెను.

భుజంగరాయనిబాఱినుండి గ్రామమును రక్షించుటకై రాజధానినుండి కొనిరాఁబడిన రెండువందల కాల్బంటుల బలమును జూచుకొని రామవరవాసు లెల్లరును గాఢనిద్రాముద్రితులై యుండిరి. కాల్బంటులు, ప్రధానస్థలములయందు, గ్రామదేవతచావడిచెంతను, గుంపులు గుంపులుగఁ జేరి నెగడుల సాహాయ్యంబునఁ జలినెదిరించుచు

నిష్టవినోదముల బ్రవృత్తులై రామవరమును రక్షించుచుండిరి. నడుమనడుమ వారిజాగ్రత్తను బరీక్షించుట కేర్పడిన గుఱ్ఱపురౌతులు, కాగడాలనుగొని చాకలవాండ్రు ముందు నడచుచుండ సదర్పముగ నూరంతయుఁ దిరుగుచుండిరి.

ఆసమయమున నీశాన్యదిక్కున గ్రామమునకంటె యెత్తయిన మట్టిగోడలుగల విశాలమగు నొక పాడు దొడ్డిలో నతిరహస్యముగ నిద్దరు పురుషులు ప్రవేశించిరి. తోడనే యందొకఁడు తలుపుబిగించెను. రెండవవాఁడు క్రొవ్వువత్తి వెలిగించెను. ఇరువురును ముందునకు బయలు దేరిరి.

ఆయిరువురు నట్లు నాలుగైదు గజములదూరము ముందున కరిగి యెదుటనున్న వస్తువును బరీక్షింపసాగిరి. అట రెండుమూఁడు గజములు వైశాల్యముగల ప్రదేశమున టపాకాయమందు పఱుపఁబడి యుండెను. దాని చుట్టును బెద్దపెద్ద కప్పలవలె భయంకరములగు మంగాపుఁగాయ లమర్పఁబడియుండెను. మంగాపుఁగాయలనునవి సగమీన దీసి వెడల్పుచేయఁబడిన తాటియాకులతోఁ గట్టఁబడిన పెద్ద టపాకాయలు. అవి యాకృతియందు వలెనే నిశ్రాంతలకుఁ జాలఁ గష్టము గలిగించుటయందును, దత్ఫలముగ ఫిరంగులవలెఁ బెద్ద ధ్వనిసేయుటయందును గూడ గొప్పవియే.

వారిరువురును దానినిఁజూచి ముందుసకరిగిరి. అచ్చట నానికిఁ జేరి జేనెడు వెడల్పున నాలుగైదు గజముల దూరమువఱకు నల్లని టపాకాయలనుండు పఱుపఁబడి దాని కిరుపార్శ్వములయందును టపాకాయ లమర్పఁబడి యుండెను. ఇంకనిట్టి శాఖ లనేకము లుండెను. అన్నియు జెక్కుజెదరక యమర్పఁబడినట్లే యుండెను. ఆమందును, మంగాపుఁగాయలును జెమ్మగిల్లిపోకుండునట్లు వాని మీఁద బలుచగ గడ్డి కప్పఁబడియెను. మొత్తము మీఁద నాపెద్దమూలమున కేడెనిమిది శాఖలును, అన్ని శాఖలయందునుగలిసి యేడెనిమిదివందల మంగాపుఁగాయ లును ఉండెను. ఆయిరువురును వాని నన్నిటిని గడు జాగ్రత్తగఁ బరిశీలించి ద్వారముచెంతకు వచ్చిరి. అచ్చట నుండి మందువఱకు నదులుగాఁజుట్టఁబడిన యొక గడ్డి చుట్టి యుండెను. దానికి నిప్పుముట్టించిని "యీయగ్ని హోత్రుఁడు విజృంభించు గాక. దీనివలన నీగ్రామమున, లంకాదహన సమయమున లంకలోఁబుట్టినంత కలవరము పుట్టుఁగాక. గ్రామరక్షణమున నియమితమైన క్షుద్రభట వర్గ మీమోసము నెఱుఁగక తన్నుకొనుఁగాక" యని యనుకొని వారిరువురును బైటకువచ్చి యథాప్రకారముగఁ దలుపులు బిగించివేసిరి.

ఆరహస్యపురుషులు పిదప నూరిలోనికిఁ బయలుదేఱి నిర్జనముగు నొకగుడిసెలోఁ జొచ్చి దీపము వెలిఁగించు

కొని పఱువఁబడియున్న శయ్యలపైఁ బరుండి యాపాద మస్తకమును దుప్పట్లు ముసుఁగువెట్టుకొనిరి.

రెండుజాము లయ్యెను. నిశాలలన మఱింత గాంభీర్యమును వహించెను. సాంద్రమగు నీహారప్రవర్షణమువలనఁ దారాగణవిరాజమానమగు వినీలాకాశము మేలిముసుఁగు వేసికొనినట్లుండెను. నిద్రాదేవి పూర్తిగఁ జెలరేగెను. కాల్బంటు లామె యంకతలమున సుఖింపఁగోరుచుండిరి. ఆశ్వికులు, గుఱ్ఱములను గాడాలు వేయు చాకలవాండ్ర కప్పగించి నాలుగైదుగడియ లైనతరువాత లేపుఁడని గూడ నాజ్ఞాపించి, రచ్చకొట్టములమీఁదను, విశాలము లగు సంపన్నుల వీధియరుఁగులమీఁదను హాయిగ నిద్రింపఁజొచ్చిరి. ప్రజారక్షణమున నియోగింపఁబడిన యాశ్వికవీరు లీతీరునఁ జాకలివాండ్ర రక్షణము గోరిరి.

జగమంతయు నత్యంతగంభీరముగనున్న యీ సమయమున హఠాత్తుగ నొక్కమాఱు నూఱుతుపాకులు ప్రేలిన ధ్వని యయ్యెను. అదివిని గ్రామరక్షకు లెల్లరు నులికిపడిరి. వెంటనే రహస్యపురుషు లిరువురును లేచి, వీధిలోఁబడి "హా! హా! బందిపోటు, బందిపోటు" అని గోల పెట్టసాగిరి. వీరి కోలాహలమువిని యాప్రాంతమున నున్న కాలిబంటులు పటాక్షేమముతో నచ్చటకు వచ్చిరి. తుపాకులు మఱలఁ బ్రేలినట్లయ్యెను. రహస్యపురు

షులు మఱల "బందిపోటు, బందిపోటు. కొంపమునిగి పోయిన" దని కాల్బంటులను విడిచి యూరిలోఁబడి మఱింతగోలపెట్టుచుఁ బరువులెత్తఁజొచ్చిరి. వీరి బొబ్బల వలనను, దుపాకుల ధ్వనులవలనను, గాల్బంటుల యడా వుడివలనను ఊరివారందఱు నదరిపడి లేచి గగ్గోలువడి తుదకు సంగతియిట్టిదని దెలిసికొని హాహాకారములు ప్రారంభించిరి. వారి మీఁదిప్రాణములు మీఁదికే యెగిరిపోయెను.

రహస్యపురుషులు గ్రామదేవత చావడివద్దకు వచ్చి నప్పటి కచ్చటఁ గావున్న భటులు గుడినిఁ గనిపెట్టుకొని యుంటుటా, బందిపోటు గాండ్రపై నుఱుకుటా యని వాదోపవాదములు పెంచుకొనుచుండిరి. ఇంతలో రహస్య పురుషులు గోలచేసి భటులకు మతిభ్రమ గలిగించి బంది పోటుగాండ్రపైకి సాగనంపిరి. ఇదిగో మా ప్రతాపము చూడుఁడని భటులు పోయినవెంటనే రహస్యపురుషులు చావడిలోని విగ్రహమును విరుగఁగొట్టి, నెగడులలోఁ వెలుఁగుచున్న కొఱకచ్చులను దీసి, గ్రామదేవత చావ డిని నిప్పుముట్టించి, హరహరా యని యఱచుచు నూరికిఁ బడమటిదిక్కుగా బయలుదేరి మాయమైపోయిరి.

రాజభటులు ధ్వనివచ్చినదిక్కుపట్టి పాడుదొడ్డివద్దకుఁ బోవునప్పటికి మరల రెండువందలతుపాకులు ప్రేలినట్లు

ధ్వనియయ్యెను. తొలుత వారిదివిని దిగ్భ్రమవహించిరి; గాని తుదకుఁ బరీక్ష వలనఁ నిజము తెలిసిపోయెను. అంతట వారందరు మోసపోతిమని సిగ్గుపడుచు నెవరిస్థానము లకు వారుపోయిరి. అప్పటికప్పుడే గ్రామ దేవతచావడి భస్మావశేషమయ్యెను. దానినిఁజూచి యెల్లరును డెల్ల వోయిరి. అచ్చటఁ గాపుండుటకు నియమింపఁబడిన రాజభటులకుఁ బ్రాణములమీఁది యాశ తొలఁగి పోయెను.

# 12

తెల తెలవాఱుచుండెను. అంధకారము తొలఁగిపో యెను; గాని సూర్యోదయము గాలేదు. ప్రభాతవాతము చక్కఁగ వీవఁదొడఁగెను. గుజ్జులేమావిగున్నలపైఁగూరు చుండి యుషఃకీర్తనము సేయు గండుగోయిలల జిలిబిలి పలుకులకుఁ దుల్యానది తరంగమర్మరధ్వనుల మూాల మునఁ బ్రాణము వోయుచుండెను.

అప్పుడు తుల్యానది పడమటియొడ్డున, ఠాణేదారు గారి యింటికిఁ గొంచెము దూరమున నున్న యొక సాంద్ర గుల్మమున యోధవేషమును దాల్చియున్న యొక యువకుఁడు మాటిమాటికి నటునిటు చూచుచు విచ్ఛిన్న మైన వింటినారిని ముడివేసికొనుచుండెను. మఱియొక

యువకుఁ డంతకంటెను జాగ్రత్తగ మఱియొక తుప్పలోఁ డాఁగి వానిచేష్టల నన్నిటినిఁ గనిపెట్టుచుండెను; గాని యీ సంగతి యోధునకుఁ దెలియదు. తుదకెట్లో యానారిని ముడివెట్టుకొని యోధుఁడు విల్లెక్కువెట్టి బయటకువచ్చి శరసంధానము గావించి యాకర్ణాంతముగ లాగి విడిచెను. శరము రివ్వుమని శబ్దించుచు దూసికొని పోయెను. దానికేదో యొక చీటి కట్టఁబడియుండెను.

ఇదియంతయుఁ జూచుచున్న యువకుఁడు తటాలున సింహకిశోరమువలె యోధునిమీఁద నుఱికి కదలకుండఁ బట్టుకొనియెను. యోధుఁడులికిపడిచూడఁగా నాయువకుఁడు కుమారస్వామియై యుండెను. తోడనే యోధుని ప్రాణములు కంఠగతము లయ్యెను. వాని దైన్యమును గ్రహించి కుమారస్వామి తన పిడికిలిని వాని వక్షమునకు గుఱిచేసి "ఇప్పుడేమిచేసితివి చెప్పు" మని యదలించెను. అంతలో యోధుఁడు ధైర్యము తెచ్చుకొని యెదిరించెను; గాని లాభములేకపోయెను. కుమారస్వామి వాని ప్రయత్నమంతయు గ్రహించి యుక్కిరిబిక్కిరి యగునట్లు వక్షమున రెండుపోట్లు పొడిచెను. దానితో యోధుని బలమంతయును నుడిగెను. ఇఁక వాఁడేమియుఁ జేయఁజాలక కన్నులు తేలవేయుచుఁ గ్రిందఁబడిపోయెను.

వెంటనే కుమారస్వామి వానిని మేఁకపిల్లవలె నెత్తు

కొని యూరిదెసకు బయలుదేఱెను. అప్పటికప్పుడే యాతాయాతజనులను దాఁటించుట కొక యఱువది యేండ్ల వృద్ధుఁడు చలికొకింత వడఁకుచు గడ చేతఁగొని దోనెను నడుపుటకు సిద్ధముగా నుండెను. అల్లంతదూర మునందే వానినిఁజూచి కుమారస్వామి "తాతా! పడవ నిద్దరికిఁ గొనిర"మ్మని కేక వేసెను. ఆ కేకవిని సాంసారిక చింతానిమగ్నుఁడై యున్న వృద్ధుఁ డదిరిపడి, పడవనుగొని వచ్చి చూచి "అదేమిబాబయ్యా" యని యడిగెను. "మాట్లాడవలదు. పడవను ద్రోయుము" అని చెప్పి కుమారస్వామి యోధుని దోనె మీఁదఁ బడవేసెను. ఆపాటున యోధుని అస్థిపంజరము గజగజవడఁకిపోయెను. ఇది యంతయుఁజూచి వృద్ధుఁడు కిక్కురుమనకుండ నిము సములోఁ బడవ నద్దరికి జేర్చివేసెను. అప్పుడు కుమార స్వామి వృద్ధునిచేతనున్న గడను గొని "నీవు ఠాణేదారు గారి యింటికిఁబోయి యిరువురు భటులను గొనిరమ్ము. అంతవఱకును బడవను నేను నిలిపెదను" అని చెప్పెను. వృద్ధుఁడు మాఱుపలుకకుండ నూరిలోనికిఁ బోయెను. ఈ సందర్భమున యోధుఁడు తప్పించుకొని పాఱిపోవుటకుఁ జూచెను; కుమారస్వామి అదిచూచి "కదలితివేని చచ్చె దవు. రాళ్లుకట్టి నిన్ను దుల్యానదిలో విడిచెదను." అని యదలించెను.

ఇంతలో నిరువురు భటులు వచ్చిరి. కుమారస్వామి యాజ్ఞప్రకారము వారు యోధుని మోసికొనిపోయిరి. వగర్చుకొనుచు వచ్చుచున్న వృద్ధనావికునిఁ ద్వారగరమ్మని పిలిచి గడ వాని కిచ్చివేసి కుమారస్వామియు వెడలిపోయెను. మార్గమధ్యమున భటులు "ఏమిచేసితివో చెప్పు" మని యడిగిరి; గాని యోధుఁడు పలుకలేదు. భటులు యోధుని మాధవశర్మ యింటిముంగిట నిలుపునప్పటికిఁ గుమారస్వామి వచ్చి కలిసికొనెను.

అప్పుడు ప్రసాదరాయుఁడు, మహేంద్రుఁడు, మాధవశర్మ యొకరిద్దరు బంధుగులు వీధితిన్నెపైఁ గూరుచుండి దంతధావనము చేసికొనుచుండిరి. వా రిదియంతయుఁ జూచి వింతపడిరి. కుమారస్వామి "మీరుపోయి మన తోటలో నూతిచెంతనున్న గొబ్బరిచెట్టునకు నాటుకొనిన బాణమును గొనిరండు. దానికొక చీటి కట్టఁబడి యున్నది. భద్రముగాఁ గొనిరం"డని భటులకాజ్ఞాపించి యోధునిఁజూచి "యేమి చేసితివో యిప్పుడైనఁ జెప్పెదవా లేదా!" యని గర్జించి పలికెను; గాని యప్పుడును వాఁడు మాటాడఁడయ్యెను. అందులకు మఱింత యాగ్రహపడి కుమారస్వామి వానిని మఱిరెండుపోట్లు పొడిచెను. అంతటితో వారించి ప్రసాదరాయఁడు సంగతి యేమని యడుగఁగాఁ గుమారస్వామి తాను జూచినదంతయుఁ

జెప్పెను. పిమ్మటఁ బ్రసాదరాయఁడు యోధునితో "నిజమంతయుఁ జెప్పదవేని రక్షించెద" నని చెప్పెను; గాని వాఁడు శాశ్వతమూకవ్రతమును వహించెను. మహేంద్రునకుఁ జాలఁ గోపమువచ్చెను. కుమారస్వామివలె నాతఁడును యోధునిఁ బొడువఁబోయెను. అతనింగూడఁ బ్రసాదరాయఁడు వారించెను. ఇంతలో భటులుచీటితోఁ గూడ బాణమును దెచ్చిరి. అది గైకొని యోధునిఁ గాచి యుండుఁడని భటులకునియమించి ప్రసాదరాయఁడు చీటి తమ్మునకిచ్చెను. మహేంద్రుఁడు దానినిట్లు చదివెను.

"ప్రసాదరాయఁడా,

నానవినయప్రార్థనమంతయు వ్యర్థమయ్యెను. నీవింత మంకుపట్టు వహించెదవనిగాని, అనాలోచితముగ నింత తెగింపు చేసెదవనిగాని నేను తలంచి యుండలేదు. నాకు జ్ఞానమువచ్చిన తరువాత నింతవఱకు నాతలంపు తప్పిపో యిన సందర్భ మిదియొక్కటియే. అయినను విచారము లేదు. నీవు పగఁబూనితివని భయము లేదు. ఇంకేమన? నీవు దూరమాలోచింపక రక్తపాతము నభిలషించు చున్నావు. ఇందులకే నేను వగచుచున్నాను"

"భట్టాచార్యులవారు శాంతిధామము నలంకరించినది మొదలు ఈక్షణమువఱకును బులిబూరునందును, రాజధానియందును మానిమిత్తము జరుగుచున్న యోచ

నలును, ప్రయత్నములును, ఎప్పటికప్పుడు వాయుకుమారుఁడు నాకుఁ దెలుపుచున్నాఁడు. మమ్ముఁ బట్టుకొనుటకు రాజభటులు చేతనైనంతవఱకు ప్రయత్నించినారు. ఇంకను బ్రయత్నించుచున్నారు. రాజుగారు చేయు బహుమతులకొఱకాసించి ప్రజలుగూడఁ గొందఱు మాకొఱకుఁ దీవ్రప్రయత్నములు గావించుచున్నారు. సంగతులన్నియు నాకుఁ దెలియును; గాని మమ్మెవ్వరును బట్టుకొనఁజాలకున్నారు. అది యెవ్వరికిని సాధ్యముగాదు''

"నా జాబును నీవు నిర్లక్ష్యముచేసితివి. కాకున్న నెఱిఁగి యెఱిఁగి నీవి యుద్ధమునకు సన్నద్ధుఁడవై యుండవు. నేను చేయఁదలఁచికొనిన దే యందు వ్రాసితిని. అందతిశయోక్తులులేవు. అందుల కుదాహరణముగ రామవరము నందలి గ్రామదేవతచావడి గతరాత్రి భస్మపటలమై పోయినదని తెల్లవారకముందే నీవు వినియుందువు. లేకున్న నిప్పుడు తెలిసికొనుము. నేను మాటలప్రోగను గాను. ఇప్పుడైనను మించిపోయినది లేదు. నాకసి చాల వఱకుఁదీఱిపోయినది. నీవు నాయొక్కని ప్రాణములను దీయఁ దలఁచెదవేని అంతకుముం దెన్నిప్రాణములు పోవునో యూహించుకొనుము. అసంఖ్యదుర్మరణముల కేల హేతుభూతుఁడ వయ్యెదవు?''

"నేను లేఖలోఁ దెలిపినట్లు నీతండ్రిగారి యుత్తర

క్రియలు పరిసమాప్తి యగువఱకును వేచియుంటిని. నాకంటె ముందుగ నీవే యీయుద్ధరంగమున నవతరించి తివి; గాన నీఁక నామీఁద దోషములేదు. ముందు నీవే కత్తివిసరితివి. నేనపాయమును దప్పించుకొనవలసియున్న దిగదా? ఈసందర్భమున నీకుఁ గష్టముగలిగినను న్యాయ్యముగ నేను బాధ్యుఁడనుగాను. ఈవీరవిహారము నాకొక విధమున సంతోషకారణమే. అయినను దీనికిఁ బ్రబల కారణము లేదుకదా? ఇప్పటికైనను నాప్రార్థనమును బాలింపుము. లేదేని ఇదియే కడపటి సందేశము. కత్తియుఁ గత్తియుఁ గలిసినతరువాత నీఁక సంధి కవకాశము లభింపఁజాలదు"

ఇట్లు,

భుజంగరాయఁడు.

జాబంతయు విని బందుగులును, మాధవశర్మయు విస్మితులైరి. కుమారస్వామియు, మహేంద్రుఁడు నీయాట లింకెన్నిదినము లనిరి. భటు లబ్బురపడిరి. యోధుఁడు బద్ధుఁడయ్యును విజయగర్వమును బ్రకటపఱిచెను. "ఇందులకు భీతిల్లవలసిన పనిలేదు. ఈపక్కి వినయములకు భీతిల్లువా రెవరు? రాజనీతియను పేరున నీయవినీతుఁడు పిఱికితనమును బోధించుచున్నాఁడు. బళా! ఎంత గుండెలు దీసిన బంటు!" అని పలికి, యోధునిఁ గైదుచేయుటకు

రాజధానికిఁ గొనిపొండని భటులకు నియమించి, ప్రసాద రాయఁడు "ఇఁక మనము స్వయముగఁ బనిచేయవలయు" నని తమ్మునిఁ గుమారస్వామిని హెచ్చరించెను.

# 13

ప్రసాదరాయఁడు సంగతి సందర్భము లన్నియు వివరముగఁ దెలుపుచు జాబుతోఁగూడ యోధుని రాజధానికిఁ బంపివేసెను. అంతకుముందే రామవరమున గ్రామదేవత చావడి భస్మపటలమగుటయు దురంతకులు చేసిన వంచనమును రాజునకుఁ దెలిసిపోయెను. హంతకులు దొరకకుండుటయు, వాండ్ర జాడలైనఁ దెలియకుండుటయు, వాండ్రవలనఁ దమవారు సులభముగ వంచితులై పోవుచుండుటయుఁ జూచి రాజు మిగుల నాశ్చర్యపడెను. యోధుని నిర్బంధపఱిచినచో వాండ్ర గుట్టంతయు బయల్పడునని తలఁచి యువరాజు వానికనేక విధముల నాశ చూపెను. అనేకవిధముల దండించెను. ఎంత నిర్బంధించినను వాని నోటినుండి మాటయే వెలువడదయ్యెను తుదకు రాజు వానికిఁ గఠినశిక్ష విధించెను.

పిదప రామవరములో జరిగిన దౌర్జన్యమును గుఱించి విచారణ సేయుటకును, గొన్ని యవశ్యవిషయములను గుఱించి ప్రసాదరాయనితో మాట్లాడుటకును దండ్రి

సెలవు బడసి యువరాజు బయలు దేఱెను. విచారణచేయు టకు రామవరము వెళ్లుచున్నానని ప్రసాదరాయఁడు వార్త నంపియుండుటచేఁ గుమారమహీపతి రామవరము నందే నిలిచిపోయెను. యుక్తసమయమున నఁ బ్రసాదరా యఁడును, యువరాజును విచారణఁ బ్రారంభించిరి. తొలు దొల్త వారిరువురును మందు పేర్పఁబడిన పాడు దొడ్డినిఁ బరీక్షించిరి. అదియంతయుఁ జూచునప్పటికి వారికిఁ గొందఱు హంతకులింకను రామవరమునందే యున్నా రని సందేహము గలిగెను. తోడనే వారు మున్నుబుతో నాలోచించి సందిగ్ధస్థలములను శోధించిరి. జనావాసము లగు గృహములలో వారికేమియు నాచూకీ తెలియ లేదు; గాని గతరాత్రి మందు పేర్చిన రహస్య పురుషులు శయనించిన గుడిశెలోమాత్ర మొకటిరెండు జాబులు దొరకెను. అందొక జాబులో మీరిఁక రామవరమును గన్నిళ్ళతోఁగూడ విడిచి మాలోఁ జేరుకొనుఁడు. అక్కడి రహస్యములను గ్రహించుచు, నెప్పటివార్తలప్పుడు మన మెచ్చటనున్నను బేగీరావుటపామీఁద నంపించునట్లు సుగ్రీవునకును, అంగదునకును నా యాజ్ఞగాఁ దెలు పుఁడు" అని యుండెను. ఆ జాబెవరి పేర వ్రాయఁబడి నదో తెలిసికొందమన్న దానిమీఁద విలాసముకాన్పింప దయ్యెను. రెండవ జాబున నిట్లుండెను. "సంగతులు బోధ

మైనవి. మీజాగ్రత్తకు సంతోషము. కనుగలిగియుం డుఁడు. జాంబవంతుఁడు నేటి రాత్రి మీతోఁ జేరికొనును. వాఁడువచ్చిన మీకు సర్వసాహాయ్యము. నిర్దేశములు వాఁడు చెప్పఁగలఁడు. లంకాదహనవార్తకె యెదురు చూచుచున్నాము'' దీనిమీఁదఁగూడ విలాసము లేదు. లోపలి పేరులు సాంకేతికములై యుండెను. ఏమియు బోధపడలేదు.

జాబుల వరుసనుబట్టి తుదకు వారిరువురును బద్ధుఁడై యున్న యోధుఁడే జాంబవంతుఁడై యుండునని యూహించుకొనిరి. వాఁడు రామవర గ్రామవాసియే యనిగూడ నిశ్చయించుకొనిరి. ఈయూహతో వాఁడె వఁడో చూచిరమ్మని ప్రసాదరాయఁడు మున్నుబున కాజ్ఞాపించెను. తోడనే యాతఁడు గుఱ్ఱముమీఁదఁ బోయివచ్చి "వాఁడీ యూర నివసించు నొక యీఁడిగ వాఁడు. వానికిహలోకమున నా యనువా రొకరును లేరు. వాఁడు భుజంగరాయనికిఁ గుడిభుజము. వెనుక వీని సాయముననే భుజంగరాయఁడు చెంగయ్యశెట్టి యింటికి మేళమునకువచ్చిన రంగసానికి నిశీథమున మానభంగము చేసె'' నని చెప్పెను. వాఁ డిట్టివాఁడని తెలిసిన పిమ్మట వాని ప్రాణస్నేహితుల యిండ్లనుగూడ వారు పరిశోధిం చిరి గాని యేమియు నాచూకీ తెలియలేదు.

తరువాతఁ బ్రసాదరాయఁడును, యువరాజును సకల విషయములను గుఱించి చాలఁదడ వేమేమో ముచ్చటించుకొనిరి. గ్రామదేవత చావడినిఁ గాపాడుటలో నజాగ్రత్తను జూపిన భటులను విచారణ సేయుటకై యువరాజు అంగరక్షకులతోడను గ్రామాధికారితోడను గూడ రాజధానిమార్గమును బట్టెను. ఆతనిని సాగనంపుటకై ప్రసాదరాయఁడుకూడ బయలుదేఱెను. ఆమాటయు నీమాటయుఁ జెప్పుకొనుచు వారు అఱకోసు దూరము పోవునప్పటి కొక చిన్ని రాయివచ్చి గుఱ్ఱములముందుఁ బడెను. తీసిచూడఁగా దానికొకచీటి కట్టఁబడియుండెను. అందు "నీవలన నేమియుఁ గాదు. తిరిగిపొమ్ము" అని వ్రాయఁబడి యుండెను. ఇదిచూచి విస్మితులై "ఏఁబది మంది రౌతులను, భీమారెడ్డిని, గుమారస్వామినిఁ గొనిరమ్ము" ని యొక యంగరక్షకునిఁ బురిబూరుపంపి ప్రసాదరాయఁడును, యువరాజును రాయివచ్చిన దిక్కున కుఱికిరి; గాని యెంతదూరము వెదకినను వారి కెవరును గాన్పింపలేదు.

## 14

ఈసమాచారమును విని కుమారస్వామి దురంతకులింకను నిర్భయులై మనచుట్టును సంచరించుచున్నారా?"

యని యాశ్చర్యపడి, భీమారెడ్డిని, ఏఁబదిమంది రౌతులను వెంటఁబెట్టుకొని యువరాజునకు సాహాయ్యముఁ జేయుటకును, సుకంతకులను బంధించుటకును మిగుల వేగముగఁ బోయెను. మరంతకు లిటుదిరిగి పులిబూరు మీఁదికి గా నచ్చునని తలంచి మహేంద్రుని, మాధవశర్మను, రౌతులను హెచ్చరించిపోయెను. కుమారస్వామి ప్రసాదరాయనితోఁ గలిసికొనునప్పటి కింకను నాలుగు గడియల ప్రొద్దుండెను. రామవర గ్రామమధ్యమునుండి పోవుచుఁ గుమారస్వామి యచ్చటి సేనాధిపతినిఁ బిలిపించి "నేఁటిరాత్రి మిగులజాగరూకతతో నుండవలెను. లేకున్న మీప్రాణములు నిలువ" వని చెప్పిపోయెను.

సాయంకాల మైనపిదపఁ గూడ నాచిట్టడవిలోఁ దిరుగ వలసివచ్చునేమోయని యేడెనమండుగురు రౌతులు కాగడాలుగొనిపోయిరి. క్రొత్తగా సైనికశిక్షణము బడయుచున్న యొకబ్రాహ్మణ యువకుఁడు "నేఁడు భుజంగరాయుఁడు దొరకిపోవును. వానిని నాచేతులతోఁ బెడరెక్కలు విఱిచికట్టెదను." అని జనపనారపగ్గమును గొనిపోయెను. అదిచూచి కుమారస్వామి నవ్వెను. భీమారెడ్డి "జాగ్రత్త మంచిదని" మెచ్చుకొనియెను. భీమారెడ్డి క్రింది సైనికోద్యోగి యొకఁడు "నేఁటితో భుజంగరాయుఁడు దొరకిపోవుననియే నిశ్చయమా?"

యనియెను. "ఔను మహాశయా, ఎందులకుఁ గాఁగూడదు? నాయదృష్టము మంచిదేని వాఁడు ముందుగ నాకే కాన్పింపవచ్చును" అని బ్రాహ్మణుఁ డనెను. అది విని రౌతు లెల్లరును నవ్విరి.

ప్రసాదరాయఁడును, యువరాజును సంకేతము లేర్పఱచిరి. తోడనే అంగరక్షకులను వెంటనిడుకొని యువరాజు ఒక దిక్కునకుఁ బోయెను. నలుగురైదుగురు రౌతులను వెంటనిడుకొని ప్రసాదరాయఁ డొక దెసకుఁబోయెను. ఆశ్వికసంఘమును విరళముగావించి కుమారస్వామియు, భీమారెడ్డియు ముందునకు బయలుదేఱిరి. కాగడాల రౌతులు విడిపోయి అందఱితోఁ దలయొకరు వెళ్లిరి. పగ్గముదెచ్చిన యోధుఁడు ఆశ్వికులకు ముందుఁ దన గుఱ్ఱమును దుముకింపసాగెను. అది చూచి భీమారెడ్డి "నీవు తెచ్చిన పగ్గమువలన నీవే బద్ధుఁడవు కావచ్చును. భద్ర"మని హెచ్చరించెను. ఆయోధుఁడు "అట్టిది యీ జన్మమున సంభవింపఁబోదు" అని సగర్వముగఁ బలికి గుఱ్ఱమును మఱింత చకచక నడిపింపఁ జొచ్చెను.

అనుచరులతోఁ బ్రసాదరాయఁడు పోయిపోయి యొక చిన్న చెఱువు జేరికొనియెను. ఇటునటుచూచుచుఁ బ్రసాదరాయఁ డచ్చట నిలిచియుండఁగా రౌతులు చెఱువు గట్టంతయుఁ దిరుగసాగిరి. అందొకఁడువచ్చి యొకమూల

తుప్పలు దట్టముగఁ బెరిగియున్నచోట "అన్నముతిని పాఱవేసిన యాకులు చూచితి"నని పలికెను. పోయిచూడఁగా నచ్చట నిరువదిముప్పది యాకులు గాన్పించెను వాని పరిమాణమునుబట్టి కొన్ని యాకులలో నిరువురేసి భుజించియుందు రని వారు తలంచుకొనిరి. ఇది దురంతకుల పనియే యనిగూడ వారు నిశ్చయించుకొనిరి.

అంతలో నిటునటు చూడఁగా వారికి గుఱ్ఱములు నీరుత్రాపుటకుఁ జెఱువులో దిగిన జాడలుగూడఁ గాన్పించెను. అప్పుడు ప్రసాదరాయఁడు "హంతకుల ప్రధాన స్థలము మన కెంతోదూరమున లేదు. వాండ్రు పట్టపగలుఁగూడ నింత నిర్భయముగ సంచరించుటఁజూడఁగా వింత యగుచున్నది. సహజధీరు డగు భుజంగుఁ డీసంకట సమయమున నుఱింత ధైర్యము చూపుట వింతగాదు" అనియెను. పిదప వారక్కడనుండి ముందు బయలుదేఱిరి.

కొంతతడవునకు వారొక చిన్న గ్రామమును సమీపించిరి. అక్కడ నొక దరిద్రస్త్రీ వంటకట్టియల నేరుకొనుచుండెను. అదివీరినిఁ జూచి తనజీర్ణవస్త్రమునఁ గొంగుముడి విప్పుచు "మీరు దండులోనివారా" యని యడిగెను. అవునని ప్రసాదరాయఁడు చెప్పగా నది యొక చీటినిఁదీసి "ఒకగడియకు ముందీవారిని రమారమీ నలువదిమంది రౌతులు మిగుల వేగముగఁ బోయిరి. నన్ను

జూచి వారందఱు నాగిరి. వారినిఁజూచి నేను భయపడి తొలగిపోవుచుండఁగా వారిలోని పెద్ద నన్ను భయపడ వలదని చెప్పి, ఈచీటి వ్రాసియిచ్చి, నాకొక వరహా బహుమానముచేసి "వెనుకనుండి మారాతులు కొందఱు వచ్చుచున్నారు. నీవిక్కడనే యుండుము. వారికి నీవీ చీటి నిచ్చితివేని వారుగూడ నీకు బహుమానము చేయఁ గలరు" అని చెప్పి పడమటగా వెడలిపోయిరి. మీనిమిత్త మెదురుచూచుచు నేనిక్కడఁ గట్టెలేరుకొనుచున్నా" నని చెప్పి చీటి నిచ్చివేసెను. ప్రసాదరాయఁ డంతయు విని "వాండ్రే దురంతకులు. నేఁటి కింతటితోఁ బని చాలించుకొని విడుదులకుఁ బోవుచున్నారు." అని తలంచి యాస్త్రీకి ముందుగ బహుమానమిచ్చివేసి చీటిఁ జదువుకొనసాగెను. ఇంతలో యువరాజువచ్చి కలిసి కొనియెను. యువరాజును గొంచెముదూరముగఁ దీసికొని పోయి ప్రసాదరాయఁ డాచీటి నిట్లు చదివెను.

"యువరాజా! మాకు నీమీఁదగాని, మహారాజా వారిమీఁదఁగాని, ప్రభుత్వముమీఁదఁగాని, ప్రకృతమింక ఠాణేదారుగారి కుటుంబముమీఁదఁగాని యెట్టియక్కసును లేదు. రామవరముమీఁదిపగ చాలవరకుఁ దీఱి పోయినది. ఇఁక స్వల్పముగ మాత్రమున్నది. అట్టిచో మీకీ శ్రమయేల? ఏల వృథారక్తనదులను బ్రవహింపఁ

జేసెదరు! దంభములు చెప్పుట గాదు. మీరు నాగుం పును కనుఁగొనఁజాలరు. నమ్మేమియుఁ జేయఁజాలరు. ఇంతటితో నూరకుండి నిశ్చింతులగుదురో, లేక యింకను ద్వేషము పెంచుదురో యాలోచించుకొనుఁడు. నేటి కింతటితో సెలవు మాగూండ్లకుఁ బోవుచున్నాము.

ఇట్లు

భుజంగరాయఁడు.

యువరాజు చాల నాశ్చర్యపడెను. ఇంక నిప్పుడు వెదకిన లాభము లేదనియు, వీనిని వదలిపెట్టిన నింకను బ్రబలకష్టములు సంభవించు ననియు నూహించుకొని వారు స్వస్థలములకు బోవుటకుఁ బయలుదేఱిరి. ఇంతలో కాతులతోఁ గుమారస్వామియు, భీమారెడ్డియు వచ్చి కలిసి కొనిరి. అందఱును వెనుదిరిగిరి. యువరాజు రాజధానికిఁ బోయెను.

# 15

బందిపోటుగాండ్రు తమపైఁ గసిదీర్చుకొన దొడఁగినది మొదలు నేఁటివఱకు రామవరమున ననేకులు తమస్త్రీలను బిడ్డలను, బరగ్రామముల యందలి బంధువులయిండ్లకుఁ బంపివేసిరి. పెద్దమగదిక్కులేని స్త్రీలు స్వయముగనే వెడలిపోయిరి. కొందఱు మాత్రము ధైర్యవతులగు రమ

ణులు భర్తలు నిర్బంధించినను "ఇప్పుడు మేము మిమ్ము వదలి పో"మని ఖండితముగఁ బ్రత్యుత్తరము లిచ్చిరి. ఒకరిద్దఱుస్త్రీలు "మఱల బందిపోటువచ్చినచో మీతో గలిసిపోరెద" మని శౌర్యమును వెల్లడించిరి; గాని మొత్తముమీఁద గ్రామమునందలి స్త్రీలలో సగము మంది వెడలిపోయిరి. ప్రయత్నించి చూచినఁగాని కిల్లలు కాన్పింపకరైరి. ఆడిపంతులుగారికి బాధతగ్గెను. దానితోఁ బాటు వచ్చుబడిగూడఁ దఱిగిపోయెను. బందిపోటు గాండ్రవలన భయముమాత్ర మంతకంతకుఁ బెరిగి పోవుచుండెను. అయినను ఆయూరున జ్యోతిషము చదువు కొని కొంచెము మంచిచెడ్డలు చెప్పఁగలవాఁ డాతఁ డొక్కఁడే యగుటచే గ్రామములో నుండితీరవలసిన నిర్బంధము గలిగెను. తన యాలోచనముల కీకల్లోలపర్యవసాన మందని వారెల్లరు ననుక్షణమును వచ్చి "దీని పర్యవసానము వివరింపు" డని యాతని నడుగసాగిరి. ఇది యంతకంత కాతనికి సహింపరానిదై పోయెను.

గ్రామదేవత యుత్సవసందర్భమునననుసరించి ప్రవర్తిల్లిన బందిపోటువలన రామపురమువారు చాల బెదరిపోయిరి; గాని బందిపోటుగాండ్రు ముఖ్యముగా దేనిని నాశనము చేయుటకు దీక్షవహించిరో యాగ్రామదేవత చావడి నిరపాయముగ నుండుటచే వారు అమ్మవారు తమ్ము

రక్షించుననియు, ఆచల్లనితల్లి బందిపోటుగాండ్రను నాశ నముచేయుననియు నమ్మి దినదినము నామెకు మహో త్సవములు చేయసాగిరి. తొలినాఁడు రాజభటులవలన సంహరింపఁబడిన బందిపోటుగాండ్రందఱు నమ్మవారికి బలియైపోయిరనియే భావించి వారానందించిరి. అమ్మవారే బందిపోటు ప్రారంభమైన వెంటనే రాజభటులను దోడు కొనివచ్చెనని నమ్మిరి. ఈనమ్మకమువలన వారి కామెపై భక్తి హెచ్చిపోయెను.

కాని యేక్షణమున బందిపోటుగాండ్రవలననే అమ్మ వారి చావడి భస్మీభూతమై పోయినదో యాక్షణము నుండి వారి కంతయుఁ దల్లక్రిందులయిపోయెను.

ఒకనాఁటి సాయంతనమున రామవరమున సంతోష వార్త లతిజటిలముగఁ బ్రాకిపోవసాగెను. ఒక యువ కుఁడువచ్చి యోకవీధిలో "దురంతకుల రహస్యములను దెలిసికొనుటకు రాజుగారు క్రొత్తగా మిక్కిలి తెలివి తేటలుగల యొక సరదారుని నియమించిరి. అతఁడు రాజ ధానినుండి వెడలిన నాలుగు గడియలకే వాండ్ర రహ స్యమును దెలిసికొని రాజుగారికి విన్నవించెనఁట. నేఁటి నిశీథమున గొప్పరాణువను గూర్చుకొని దురంతకులను గైదుచేయుటకు రాజావారు స్వయముగ బయలుదేఱెద రఁట" అని చెప్పెను. అదివిని యచ్చటివారు మిగుల

నానందించి యూహాప్రపంచమునఁ బడిపోయిరి.

ఇది యిట్లుండగా మఱియొక యువకుఁడువచ్చి వేఱొక వీధిలో "నేఁటితో దురంతకులపని వైపోయినది. వాండ్ర యదృష్టదినములు తీఁగిపోయినవి. వాండ్ర నిశ్వాసపథము రుద్ధమైపోయినది. విజయలక్ష్మి వాండ్రను వంచించివేసినది. ఠాణేదారుగారికి వాండ్ర యునికియంతయుఁ దెలిసిపోయినది. నేఁటిరాత్రి వాండ్రు మనకైదీ లయ్యెదరఁట" యని చెప్పెను. ఇదివిని యచ్చటివారు భావిస్థితి నిరూపణము సంపలి తమ తమ శక్తి నొకరిని మించి యొకరు చూపసాగిరి.

ఇదియు నిట్లుండగా నొక వృద్ధుఁడు మఱియొక వీధిలో "గోదావరి కవ్వాల నిన్న రాత్రి దురంతకు లేదో యొక యూరు కొల్లగొట్టసాగిరి. గ్రామవాసులు తిరుగఁ బడఁగా నిరువాగుల వారికిని సంకులసమరము పొసంగినది. తుదకు హతులును, ఒలాయితులును గాక యిరువది ముగ్గు రనుచరులతో భుజంగరాయఁడు దొరకిపోయెనఁట. ఈసంగతిఁ దెలిసికొని తెల్లవారునప్పటికి రాజభటులు పోయి వాండ్ర నుప్పుపాఁతఱ వేయుటకు వాండ్రచేతనే యుప్పు మోయించుకొని వచ్చుచున్నారఁట" యని చెప్పెను. అదివినిన వారెల్లరును "తాతా, చల్లనికబురు చెప్పితి" వని యానందించిరి. ఇది వినుచున్న యొక

వృద్ధాంగన "నాయనలారా! ఆపాపాత్ముల నుప్పుపాఁతఁబెట్ట వేయుదురేని నా మెడలోని యొక పిల్లకాసు నమ్మి యొక బస్తా ఉప్పు కొనియిచ్చెద" ననియెను. అంతనెల్లరును "అవ్వా! నీయౌదార్యమునకుఁ దగినట్లు పలికితి" వని యామెను బ్రశంసించిరి.

ఈకల్పనా ప్రపంచమిట్లు పెరిగిపోవుచుండఁగనే సూర్యాస్తమయమై యంధకార మావరింపసాగెను. కాఁగడాల వెలుఁగున గుఱ్ఱపురౌతులు కాల్బంటుల జాగ్రత్తను బరిశీలింపఁజొచ్చిరి. వారినిఁజూచి భావి కల్పనలలో మునిగియున్న గ్రామస్థులు "నేటితో మీశ్రమతీఱిపోయిన" దని చెప్పఁ జొచ్చిరి. గ్రామదేవత చావడి భస్మమైపోయిన నాఁటనుండియు నూరియందలి పెద్దకాపులు నలుగురైదుగురు "మొన్నటివలెఁ జేయకుఁడు కనుగలిగి యుండుఁ" డని రౌతులను హెచ్చరింపసాగిరి.

జామున్నర రాత్రి యయ్యెను. గ్రామవాసులెల్లరు నఱగంట నిద్రించి తెఱపిమఱపులనడుమ నూఁగులాడు చుండిరి. కాల్బంటులకావలింతలు మెండయ్యెను. రౌతులు మనస్సులలోఁ పెద్దకాపులపై విసిగి కొనుచుండిరి. కాఁగడాలువేయు చాకలవాండ్రు తూల్లింటెవలెఁగాక రౌతులు తమతోఁబాటు మేలుకొనియుండుట జూచి మనస్సుల యందు "మనకంటె పిరియెక్కువ యేమి" యనుకొను

చుండిరి. ఇట్టి సమయమున నున్నట్లుండగా, దురంతకు లసంఖ్యులై మఱల నూరు కొల్లగొట్టుటకు క్షణములోనో గడియలోనో వచ్చి మీఁదఁబడనున్నారను భయంకర వార్త క్షణములో నూరంతయు వ్యాపించెను. వెంటనే మునసబు ఠాణేదారుగారి కీవార్తను దెలియఁబంపి స్వయముగ నూరంతయుఁ దిరుగుచు హెచ్చరికలు సేయసాగెను. అదివిని కొందఱు వృద్ధస్త్రీలు "ఆపాపాత్ము నీమున్న యంతగా నవమాన పఱుపకున్న మనపుట్టి యింత మునిఁగి యుండకపోవు" నని వగవసాగిరి.

ఒకగడియలో నీసంగతిఁ దెలిసికొని ప్రసాదరాయఁడు కుమారస్వామిని, మహేంద్రుని, భీమారెడ్డిని, రాతులలో ననేకులను వెంట నిడుకొని రాయపురము వచ్చి చేరుకొని యెను. ఠాణేదారునిఁ జూచి యచ్చటిరాతులును గాల్బం టులును జాలఁ జాకచక్యము చూపసాగిరి. రెండుజాము లైనను బందిపోటుజాడలు కాన్పింపవయ్యెను. మూఁడు జాములయ్యెను. అప్పటికిని యథాప్రకారమునకు లోపము కలుగదయ్యెను. తెల్లవాఱునంతదనుకనుండి నేఁటి కిఁక రారని నిశ్చయించుకొని ప్రసాదరాయఁ డింటికి మఱలెను. కొంతదూరము వచ్చునప్పటి కొక రాతెదురుగవచ్చి "రాధాదేవిగారు కాన్పించుటలేదు. పండు

కొన్న శయ్యతోఁగూడ మాయమైపోయి'' రని చెప్పెను. ఈవార్త వినుటతోడనే ప్రసాదరాయని శిరముపై నశని పాత మయ్యెను. కుమారస్వామికి మహేంద్రునకు భీమారెడ్డికిని శిరములపై వజ్రాఘాతమైన ట్లయ్యెను. రాతు లందఱును గొల్లున గోలపెట్టిరి. క్షణములో నీవార్త రామవరమున వ్యాపించెను. ఉత్తరక్షణములో రామచంద్ర పురమునఁ గోటలోఁ దెలిసి పోయెను.

## 16

తూర్పుదిక్కున నరుణకాంతులు విజృంభించునపుడు పంజరమునునున్న చిలుక 'అక్కా' తెల్లవాఱుచున్నది. ఇఁక మేలుకొనుమమ్మా' యని రుక్మిణీదేవిని నాల్గుసారులు పిలిచెను. అదివిని ప్రబోధితయై రుక్మిణి లేచికూరుచుండి కన్నులునులుముకొనుచు "వదినే! ఇంకను మెలఁకువ రాలేదా!'' యని పలికెను; గాని యెవరును బ్రత్యుత్తర మీయలేదు. వెంటనే రుక్మిణి ప్రక్కకుజూచి రాధయు నామె శయనించిన మంచమునుగూడ నచ్చట లేకపోవుటచేఁ దెల్లవోయి "చెల్లాయీ! వదినె యెక్కడకుఁ బోయినదే'' యని యడిగెను. "నేనేమియు నెఱుఁగను. నాకిప్పుడే మెలకువవచ్చినది'' యని చెప్పి చిలుక వదినే, వదినే యని బిగ్గఱగాఁ బిలువసాగెను. వదినె ప్రత్యుత్త

రము రాలేదు; గాని గదిలో శయనించిన జానకియు శచియు "రాధ నీవద్దనే శయనించెంగాదంటే" యని పలుకుచు వెలుపలికివచ్చిరి. పిదప మంచముగూడ నక్కడ లేకపోవుటంజూచి వారు చాలవింతపడిరి. అందఱును గాబరపడంజొచ్చిరి. ఈసమయమున శచీదేవి లోపలికింబోయి మాధవశర్మగృహిణినిలేపి పిన్నీ అక్కడకాన్పించుటలేదని కన్నులనీరునించుచు గద్గదస్వరముతోం బలికెను. తోడనే యదరిపడిలేచివచ్చి యేమమ్మా! రాధయెక్కడనున్నదమ్మా? యని యడుగసాగెను. ఆమెను జూచి రుక్మిణి కన్నులనీరు జాలువాఱ అత్తా! వదినె మాయమైనదని యేడువసాగెను. రుక్మిణిని జూచి శచియు నామెనుజూచి జానకియు నేడువసాగిరి. మాధవశర్మ గృహిణి మాత్ర మేడ్చుటలేదు; గాని కన్నుల నీరు గిఱ్ఱునం దిరిగిపోయెను. ఆమెహృదయము భయప్రకంపితమై పోవుచుండెను.

ఇట్లొకక్షణము గడచిపోవునప్పటికి బాగుగం దెల్లవాఱెను. గ్రామమంతయు మేలుకొనెను. వీరి రోదనములు విని తొలుత వీధిలోనున్న యిరువురు భటులును, బిమ్మట నిరుగుపొరుగు స్త్రీలిరువురును, వృద్ధపురుషుం డొకండును వచ్చిరి. అందఱును దెల్లంబోయిరి. ఆవిన్నదనము పోవకపూర్వమే యేడ్చుచున్నజానకి యొకభటునిం జూచి "నీవు పో. రామవరమున నీవార్త చెప్పి రాణే

దారుగారిని దీసికొనిరా” యనిచెప్పెను. భటుఁ డూర్ధ్వ శ్వాసముతోఁ జెంగున వీధిలోనికి దాఁటి యింటిలోని గోల వినుచు నక్కడ నిలిచియున్న యాశ్వికునితో సంగతి యంతయుఁ జెప్పెను. తోడనే యాతఁడు రామవరము దెసకు గుఱ్ఱము నుఱాయించి మేఘాలమీఁద నెగిరి పోయెను క్షణములో నీసంగతి యూరంతయు దెలిసి పోయెను. మఱుక్షణమున జన ప్రవాహము మాధవ శర్మయింటిని ముంచివేసెను.

ఇద్దఱు ముగ్గురుపురుషులు నేడెనమండుగురు స్త్రీలు మాత్రమే లోనికిఁ బోయిరి. తక్కినవా రందఱును వీధి లో నిలిచిపోయిరి. చూచుచుండఁగా వీధిలోని వారికి గుఱ్ఱపుడెక్కల టకటకధ్వనులు చెవులు గింగురువోఁ గొట్టెను. నుఱులఁ జూడగాఁ బ్రసాదరాయఁడు కుమార స్వామి మహేంద్రుఁడు భీమారెడ్డియు నశ్వావరోహణము కావించిరి. ఒక రౌతువచ్చి జనసంఘమును దొలఁగించి మార్గముచేసెను. ప్రసాదరాయాదులు లోనికిఁబోయిరి. భీమారెడ్డివీధిలో నిలిచి, “అయ్యలారా! ధ్వనిచేయు వలదు. శాంతముగ నుండుఁడు” అని హెచ్చరించెను. ఎవరును మాట్లాడలేదు.

ప్రసాదరాయునిఁ జూచుటతోడనే రుక్మిణి కెవ్వునఁ గేక వేసి “అన్నా! కొంప మునిఁగిపోయిన” దని మీఁదఁ

బడి యేడువఁజొచ్చెను. మహేంద్రుఁడును గుమారస్వామియు మాటలేక కూలఁబడిపోయిరి. శచి, జానకి రొండిలోఁబడి యేడ్చుచుండెను. మాధవశర్మ గృహిణి ప్రసాదరాయునిఁజూచి "నాయనా! సర్వనాశన మైపోయినది. ఇంట నందర ముండియు నామహాలక్ష్మినిఁ దక్కించుకొనఁ జాలకపోయితిమి" అనియెను. ప్రసాదరాయఁడు ధైర్యము తెచ్చుకొని రుక్మిణినిఁ బొదివి పట్టి "తల్లీ! ఊరడిల్లుము. వదినెను క్షణములోఁ దీసికొని వచ్చెదము. చిట్టితల్లీ! ఇంత విచారించిన నెట్లమ్మా" యని యూరడించెను. రుక్మిణి కొంచెమూరడిల్లి "అన్నా! వదినె యీ జన్మమున మఱలఁ గాన్పించునా" యనిమఱల నేడ్వసాగెను. మఱలఁ ప్రసాదరాయఁడామె నూరడించి జానకికిఁ గూడ ధైర్యము గొలిపెను. అప్పు డామె "అన్నా! ధైర్యమువహించి యెట్లుండఁగలము! దేవీస్వరూపిణి అంతర్ధాన మైపోయినది. ఇఁక నూఱట యెట్లు గలుగును." అనియెను. ఒకవృద్ధుఁడు ఇట్టి యాపత్సమయములయందే మనము ధైర్యము తెచ్చుకొనవలెను. తక్కిన సమయములయందు దానికదియే ప్రత్యక్షమగు" నని చెప్పియూరకుండెను. అందఱు నేడ్పుమానిరి. రుక్మిణి జరిగిన దంతయుఁ జెప్పెను. అంతయు నైనతరువాతఁ బంజరములోని చిలుక ప్రసాదరాయనిఁ బిలిచి "ఇదంతయు

నా ప్రాలుమాలికవలనఁ దటస్థించినది. నేను మత్తిలి యుండకున్న రాధాదేవి కిట్టిపాటుగూర్చుట కెవఁడు సాహసింపఁగలఁడు!'' అన్నట్లు ఏమో గొణిగెను. ప్రసాదరాయనికిఁ జిలుకపై నెంతో కరుణ కలిగెను. తోడనే యాతఁడు పంజరములోనుండి దానిని బైటకు దీసి దువ్వి "పక్షులకుఁగూడ నామీఁద నింతకనికర మున్నది; గాని యీశ్వరుఁడు మాత్రము పగ సాధించుచున్నాఁ'' డని చిన్నబోయి యూరకుండెను.

ఇంతలోఁ దెల్లవాఱక పూర్వమే కాల్యములను దీర్చికొనుటకుఁ దుల్యానదికిఁ బోయిన వృద్ధుఁడగు రాధతండ్రి వచ్చెను. ఆతని హృదయము తోడనే బ్రద్దలై పోయెను. ఆతనిం జూచుటతోడనే ప్రసాదరాయని హృదయమున సంకోచము, సంభ్రమము వగవు మిళితములై యల్లకల్లోలము చేయసాగెను. అంతటి ధైర్యశాలి కన్నులనుండిగూడ నప్పుడు బాష్పధార వెడలెను. మఱిల నందఱును గొల్లుమనిరి. కుమారస్వామి రాధతండ్రి నూరడింపఁజొచ్చెను.

పిదపఁ బ్రసాదరాయఁ డందఱ నూఱడించి ముంగణమునకు వచ్చెను. అప్పటికప్పుడే మాధవశర్మ స్నానము చేసి లోనికి వచ్చుచుండెను. అతఁడు ప్రసాదరాయనిఁ జూచి తెల్లవోయెను. ప్రసాదరాయని కన్నులనుండి

మఱల నశ్రులవాఱి పొంగిపోయెను. మాధవశర్మగూడ వగచెను. లోపల రోదనధ్వనులు మిన్ను ముట్టుచుండుట వలన మాధవశర్మ లోనికిఁబోయెను. ప్రసాదరాయఁ డంగణమునను్న బల్లమీఁదఁ గూలఁబడెను. అంత నొక వృద్ధబ్రాహ్మణుఁడు వచ్చి నేఁడు సంభవించిన విపత్తును గుఱించి పరామర్శ చేసి లోనికిఁబోయెను.

ఇట్లుండఁగా సకుటుంబముగ మహారాజావారు విచ్చేసి రని కోలాహలము చెలరేఁగెను. తోడనే కుమార స్వామియు మహేంద్రుఁడును వీథిలోని కరిగిరి. అప్పటి కప్పుడే రాజు గుఱ్ఱము దిగెను. యువరాజుగూడ దిగి తల్లికిఁ జేయూఁత నిచ్చుచుండెను. మంత్రి రాజు ప్రక్క నుండెను. "ఇదియేమి ఘోరము కుమారస్వామీ" యని రాజు లోనికి బయలుదేఱెను. అందఱును వెంటనంటిరి.

రాజును జూచి ప్రసాదరాయఁడు లేచి నిలిచి శిరము వంచుకొనియెను. తోడనే రాజాతనినిఁ బొదివిపట్టి "ఏమిది! విపత్తుమీఁద విపత్తు! ఎంత ఘోరకలి" యని వగచెను. మంత్రియు, యువరాజును జుట్టుకొని "అన్నా! ఇంతలో నిదియేమి? మనయెడల నిజముగా దైవము ప్రతి కూలించియున్నాఁడు. లేకున్న నీ దుండగములు సాగుట యేమి?" యని యూరడించిరి. అప్పుడు రాణివచ్చి "తమ్ముఁడా! ఇఁక ధర్మమునకు విజయము లేదాయేమి?

అగ్నిహోత్రమును జదలంటుటా!" యని యూరడించెను. అప్పుడు చూడఁగాఁ బ్రసాదరాయని కన్నులనుండి బాష్పలహరి దొరలుచుండెను. రాజాతని కన్నీరుతుడిచి "బాబూ! నగవకుము. ఆపనులు కాపురమున సేయుదువు" అని సమాశ్వాసించెను. పదప నందఱును లోనికిఁ బోయిరి.

హఠాత్తుగ రాణినిఁ జూచిన వెంటనే రుక్మిణివచ్చి యామెపైఁ బడి యేడువనాగెను. జానకి గొల్లుమనియెను. శచి బావురుమనియెను. మాధవశర్మ గృహిణియుఁ గుమారస్వామి జనయిత్రియు, "నిక్షేపము చోరాపహృతమైపోయినది. మహాలక్ష్మి శ్రీమన్నారాయణుని విడిచిపోయినది. పులిబూరు దౌర్భాగ్యోపహతమై పోయిన" దని వగచిరి. రాధ తండ్రి దుఃఖమును వర్ణించుట కేయలవిగాదు.

రాణి కందఱ నొక్కుమ్మడిగ నూరడింపవలసిన కష్టము సంభవించెను. స్వయముగ నామెగూడఁ దీవ్ర విచారమువలననే బాధితయగుచుండెను. అయినను బ్రకృతి ధర్మమేమనఁగా? ఏవ్యక్తి కుటుంబభారమునంతను భరించుచుండునో, లేక యేవ్యక్తియునిన నొక కుటుంబము నందలివారెల్లరును బ్రాణము లిడుదురో యావ్యక్తి యాకుటుంబమునకుఁ దీఱని దుఃఖము తటస్థించినను, దక్కినవారివలె దీనాతిదీనముగ వగచుటఁ జూడము.

కారణ మేమన? తక్కినవారినందఱ నావ్యక్తియే యూరడింపవలయును. ఈభావ్యతవలన విచారము హృదయమును బ్రద్దలుచేయుచున్నను బాధ్యతాభావకముగు ధైర్యము దానిని బైటకురానీయదు. రాజకుటుంబమునకును, ప్రసాదరాయని కుటుంబమునకును, వ్రేళ్లమీఁద లెక్కింపవలసిన ప్రబలసంబంధము లేమియు లేకపోయినను, సకలమునకును మూలకారణమైన ప్రేమసంబంధమధికముగనుండెను. అక్కతిన నుభయులునుగూడ నన్యోన్యము మాకిట్టివారింక లేరనునంతటి సన్నిహితబంధుభావమును పాటించుకొనుచుండిరి. ఈరూపమున రాధాపహరణమైన యిప్పుడా కుటుంబమువారి కందఱకును ధైర్యము గొలుపవలసిన భారము రాజదంపతులమీఁద నున్నది. ఈహేతువువలననే రాణి విషాదము మీఁదికుబుకదయ్యెను. అయినను, చుట్టునున్న వారందఱు నేడ్చుచుండుటవలనఁగలిగిన దిగ్భ్రాంతివలననో, గురుతరదుఃఖభారమువలన హృదయము క్రుంగిపోవుటవలననో రాణి నిశ్చేష్టితయైయుండెను. ఇది గ్రహించి మాధవశర్మయిల్లాలును, రుక్మిణియత్తగారును, శచీజానకుల నోదార్చిరి. ఈ సందర్భమువలన రాణికొకింత తెలివిగలిగెను. ఈ తెలివితో నామె చాలఁ గష్టముమీఁద రుక్మిణి నోదార్చెను; గాని యెవ్వరికన్నులనుండియు బాష్పవాహిని ప్రవహింప

కుండలేదు. "మాకన్నతల్లిని మేము బాగుగ నెఱుం గము. మావదినె కాంపురమునకు వచ్చినతరువాత నామెయే మాతల్లి యనుకొంటిమి. ఆమెయు మమ్ము గన్నబిడ్డలనుగంటె నెక్కుడుగాం బ్రేమించినది. మా దౌర్భాగ్యవశమున నామెగూడ మమ్ము విడిచిపోయినది. ప్రేమైకనిలయయగుమాతల్లి యెట్టియమయాతన ననుభ వించుచున్నదో, ఆదేవీస్వరూపిణి నెత్తికొనిపోవుట కాదురంతకులకుం జేతులెట్లువచ్చినవో, ఆపతివ్రతాశిరో మణి శయ్యను దాఁకి యాపాపాత్ము లెట్లు భస్మము కాకుండనుండిరో, మాయమ్మ మమ్ముం దలంచుకొని యెంత యడలుచున్నదో" యని రుక్మిణి మఱల నేడువం దొడంగెను. జానకిగూడం దలంచికొని తలంచికొని మఱల రోదనము ప్రారంభించెను. శచియంతకుముందే విలపింప సాగెను. అప్పుడుమాత్రము రాణి యెట్లో ధైర్యమును జిక్కఁబట్టుకొని యెల్లరను దగ్గఱకుం దీసి విచార ముడి పెను. రాజు రాధతండ్రి ననేకవిధముల నోదార్చెను.

ఊరిలోని స్త్రీపురుషు లందఱును వచ్చిరి. కొందఱు ఱారడింపుమాట లాడిరి. కొందఱు వగచిరి. తొలుత నూఱడించినవారు పిదపవగచిరి. తొలుత వగచినవారు పిదపనూఱడించిరి. ఇట్లూరడింపులైనతరువాత రాజు మున్నగువారు కర్తవ్యనిర్ధారణమునం బ్రవృత్తులైరి.

# 17

ఇంకను సూర్యోదయము కాలేదు. ప్రాగ్దిశాముఖము మాత్ర మరుణతేజస్సంపన్నమై యుండెను. నైష్ఠికులగు బ్రాహ్మణుల యర్ఘ్యప్రదానములవలన సూర్యమార్గము నిష్కంటకమగుచుండెను. జనపదములయందలి కొలఁకు లన్నియు సద్యోవినిర్భిన్నములగు కమలసహస్రములతో విరాజిల్లుచుండెను. గృహిణు లందఱును గృహసమ్మార్జనమునఁ బ్రవృత్తులై యుండిరి. అందఱు ననినందులకు మమ్మాక్షేపింపవలదు. సంపన్నుల యజమానురాండ్ర కిదియే సుఖనిద్రాసమయము. ఎప్పటికైన ననుగ్రహము గలిగినచో వారికి ముఖ్యముగాఁ జేయవలసిన ద్వారముఖసమ్మార్జనము మాత్రమే. అదిగూడ దాసీలచేఁ జేయించుకొను భాగవతులు కొందఱున్నారఁట; గాని వారి దర్శనభాగ్యము మాకెప్పుడును సమకూఱలేదు. ఇట్టి సమయములయందే కొందఱు రమణీమణులను వర్ణించి కాళిదాసాదులు ధన్యత బడసినారు.

ఈసమయమున సదురుబాదాయను గ్రామమునఁ బూర్వ మెప్పుడో సంపన్నులై యుండిన వారిచే నిర్మింపఁ బడుటచే జమీందారుల దివాణమువలె నెంతో విశాలమైయున్న యొక భవనమున, నొకగదిలో శయ్యపై నొకరమణీమణి మొగము దిగాలువేసికొని కూరుచుండి

యుండెను. ఎదుట విశాలమగునంగణ ముండుటవలనను, ప్రక్క విశాలమగు దొడ్డిలోనికి గిటికీ యుండుట వలనను, ఆగదిలోఁ బ్రకాశమునకు మాత్రము లోపము లేదు; గాని యామె హృదయమున దుఃఖాంధకారము అగాధముగ నావరించి యుండెను. ఆమె రాధాదేవి.

ఆమె యిట్లన్యమనస్కయై యున్నసమయమున నొక పురుషుఁడు మెల్లఁగవచ్చి యామెకు సాష్టాంగదండ ప్రణామము గావించెను. అతనిరాక యామె యెఱుంగదు; గాని యాతఁడు దండమునవలెఁ బదసికటమున భూపతితుఁడై యుండుట హఠాత్తుగఁజూచి తటాలున లేచి యొక ప్రక్కకు దొలఁగినిలిచి సదర్పముగ "నీవెవఁడ" వని యడిగెను. అందుల కాతఁడు మిగుల వినీతభావమున "భుజంగరాయఁడ" నని చెప్పెను. తోడనే యామె ధైర్య మొకింత సడలెను. ముఖమున భయ మొకింత ప్రతిఫలించెను. అదిగ్రహించి భుజంగరాయఁడు చేతులు జోడించుకొని "నీవు నాకు మాతృదేవతవు. నన్ను నీ బిడ్డనిగా భావింపుము. నీయెడల నాకు దుశ్చింత లేదు. నీకు నావలననపాయశంకవలదు" అని చెప్పెను.

"అట్లయిన నన్నేల తెచ్చితివి!"

"మాతా! క్షమింపుము. లోకమంతయు నీసౌజన్యమును, నీపాతివ్రత్యమును గీర్తించి ధన్యమగుచున్నది.

తుల్యానది నీసాన్నిధ్యము వలనఁ బూర్వాధిక ప్రభావ సంపన్నమైనది. పతివ్రతల ప్రసంగము వచ్చినపు డీప్రాంత ప్రజ లెల్లరును నీకుఁ జేతులెత్తివందనసహస్రము లర్పించుచున్నారు. అట్టి నీకీ కష్టమును గలిగించి నేను క్రూర కర్ముఁడనై పోయితిని. పరలోకమున నాకు గతులు లేకుండబోయినవి. అయినను నేనేమి చేయఁగలను? ఇంత వఱకు నేనొరులకు లొంగియుండలేదు. నాకు విపత్తులు గలిగించినవారి కింతవఱకు సమాధానము చెప్పకుండ నుండలేదు. నీభర్తయనిన నాకెంతో గౌరవము. ఇప్పటికి నెప్పటికిగూడ దానికి లోపములేదు; గాని యామహాత్ముఁడు నాయెడల శత్రుత్వము సహించినాఁడు. వలదని నేననేకవిధములఁ బ్రార్థించితిని; గాని యాతఁడు మాన లేదు. నాప్రార్థన మంతయు వ్యర్థమైనది. నేననుకొనిన దంతయుఁ దలక్రిందులైనది. అయినను నాకు విచారము లేదు. నీభర్తతో నాకుఁ బ్రతిస్పర్ధ గలిగినందులకు వగచుచున్నాను. ఆతని నీప్రయత్నమునుండి మఱలించుటయే నాసంకల్పము. తల్లీ! అక్కారణమువలన నే నిన్నుహరించి తెచ్చితిని. ఈపోరాటమున నీకుఁ గూడ బాధ గలిగింప వలసివచ్చినందులకు సిగ్గుపడుచున్నాను."

"నానాథునియెడల నీవంత భక్తుఁడవేని వారిని లోఁబఱచుకొనుటకు మఱియొక మార్గము కాన్పింపలేదా?

తల్లీ ! యని నన్నుబిలిచితివి. నన్నిక్కడకుఁ దెచ్చుటలోఁ నీకు దుశ్చింత లేకపోవచ్చును; గాని లోకులేమందురు? నేనిఁక లోకమునకు మొగమెట్లు చూపఁగలను?"

"తల్లీ! నీపాతివ్రత్యము నెఱుంగనివారు లేరు. అగ్నికిఁ జెదలంటవని యెవరికి దెలియదు ! కేసరికిమానభంగము చేయుట కేమృగమును జాలదని యేరికిఁ దెలియదు ? అంతకు నీపై నపనింద మోపువారున్నచో వారి నాలుకలినుపయూఁచలతో వాఁతలు వేయఁబడుఁ గాక. వారి శిరములపై నశనిపాత మగుఁగాక. వారి కంఠములు ప్రచండచంద్రహాసములచే నఱుకఁబడుఁగాక"

రాధాదేవి రామవరమును గొల్లకొట్టదొడఁగిన తన దౌర్జన్యమును నిందింపఁబోవనుండగా నదిగ్రహించెనో యనునట్లు భుజంగరాయఁడు చూచుచుండఁగనే మాయ మైపోయెను. అందులకు రాధాదేవి యబ్బురపడుచుండఁగా నలువదియేండ్ల వితంతుస్త్రీయొకతె వచ్చి "లెమ్మతల్లీ, లెమ్మ; దంతధావనము చేసికొనుటకివ్వలకురమ్మ" అని చెప్పెను. రాధ యందులకుఁ బ్రత్యుత్తరముచెప్పకయే "అమ్మా! నేనిక్కడ కెట్లువచ్చితి" నని యడిగెను. "జామురాత్రివేళ భుజంగరాయఁడు మంచముతో నిన్ను మోయించుకొని వచ్చి వీధిలోదింపెను. అప్పుడు నేను నిన్నెత్తుకొని లోపలకుఁ దీసికొనివచ్చితిని. మత్తుమందు

వలన నీవప్పు డేమియుఁ దెలిసికొనఁజాలక పోయితివి'' అని పితంతువు ప్రత్యుత్తర మిచ్చెను. మాట పల్కకయే రాధ బైటకువచ్చి దంతధావనము చేసికొనియెను. జాము ప్రొద్దెక్కిన తరువాత మరల నావితంతువు వచ్చి భోజనమునకు లెమ్మనియెను; గాని రాధ యందులకుఁ దిరస్కరించెను.

# 18

నాఁటి మధ్యాహ్నమే రాధాదేవిని వెదకి తెచ్చుటకు రాజాజ్ఞచే దొంగలను బట్టుకొనుటలో నతిచతురుఁడగు నుద్యోగియొకఁడొక దిక్కునకును, కుమారస్వామి యొక దిక్కునకును వెడలిపోయిరి. రాధ రక్షితయై పులిబూరు చేరుకొనునంతదనుక రాజధానికిఁ బోఁగూడదని రాజదంపతులు నిశ్చయించుకొనిరి. రాజకార్యములను జక్కఁబెట్టుటకై మంత్రి రాజధానికిఁ బోయెను. రాధాన్వేషణము నిమిత్తము ప్రసాదరాయఁడు గూడఁ బయనమయ్యెను; గాని "నా హృదయ మిపుడెంత సుస్థిరముగ నున్నను, నీవిపు డిల్లు గదలుట మంగళకరము గాదు. ఇందుల కావులించినఁ బ్రేవులు లెక్కపెట్టు కుమారస్వామియే చాలు'' నని రాజు చెప్పి యాతనిని నిలిపి

వేసెను. రాణియు నిట్లే చెప్పుట వలన బ్రసాదరాయఁ డా ప్రయత్నమును మానుకొనెను.

మార్గమధ్యమునఁ గుమారస్వామితో నొకింత పరిచయముగల రెడ్డి యొకఁడు కలిసికొనియెను. ప్రసంగవశమున నాతఁడు "జాముర్రాత్రివేళఁ గాకినాడ వెళ్లఁదలఁచి పడవనిమిత్తము నేను పులిబూరు వెళ్లుచుంటిని. మార్గమధ్యమున ఫలాని చెఱువుగట్టుమీఁద నొకఁడింకొకనితో "పొడుగునను మేమే మోసికొని పోయితిమి. మేము నలుగరమే పోయితిమి. సాయముచేయుట కెవ్వరును లేకపోయిరి. ఆకారణమువలన నాభుజములు చాల నొప్పిగానున్నవి. బందిపోటు వ్యవహారము ప్రారంభమైన తరువాత నావాటా కేఁబదిమూఁడు రూపాయలువచ్చినవి మంచిదో చెడ్డదో యేదోయొక పనిచెప్పి యామహారాజే మాకుటుంబమును బోషించుచున్నాఁ" డని చెప్పుచుండెను. ఇంతలో నేను వారిని సమీపించితిని. నన్నుఁజూచి వారు ప్రసంగాంతరము ప్రారంభించి" రని చెప్పి యా పెద్దమనుష్యుఁడు ఫలానా యని గూడఁ జెప్పెను. పిదపఁ గుమారస్వామి యాధారము దొరకెనని యాపరిచితునితో నొకటిరెండు మాటలాడి పంపివేసెను. ఫలానా యని చెప్పిన మనుష్యుఁడు కుమారస్వామి కొకింత పరిచితుఁడు. అతఁడు పెద్దలలోఁ జేరినవాఁడనిగూడఁ గుమారస్వామికిఁ దెలియును.

# 19

రెండుగడియల ప్రొద్దుండెను. ప్రియసాన్నిధ్యమువలనఁ బళ్ళిమదిగంగవ నవీనశోభ వహించెను. సూర్యకిరణముల వస సడలుటచే శీతము విజృంభించుచుండెను. పశుపాలకులు తమ ముతుకగుడ్డలతో నొడలంతయుఁ గప్పుకొని చలివలనఁ బాటలు పాడఁజాలక యెట్లో పసులం దోలుకొని పోవుచుండిరి. పక్షులు కులాయములు చేరుకొనుచుండెను. సకలశకుంతములకు విశ్రాంతిసమయ మగు సాయంకాలమున గుడ్లగూబకు స్వేచ్ఛ గలిగించుటలో సర్వేశ్వరుని భావమేమో యెవరు చెప్పఁగలరు! ఎల్లరు నిండ్లకుఁ బోవు కాలమున బైటకుఁబోవు గుడ్లగూబ జీవితము భాగ్యబంధురమో, దైవోపహతమో యెవరు నిర్ణయింపఁ గలరు?

ఈసమయమున సోమేశ్వరమున కుత్తరమున నఱకోసు దూరమున నున్న చెఱువుగట్టుమీఁది రావిచెట్టుక్రింద యోగదండము నానుకొని యోగి యొకఁడు కూర్చుండి యుండెను. అంతలేఁబ్రాయమున నాతని కింత వైరాగ్యమేల కలిగెనో తెలియదు. పరీక్షించి చూచిన నాతని యోగీశ్వరత్వ మచిరప్రాప్తమని తోఁపకపోదు. నాఁటి నాఁటికిని ముందునకుఁ జూచుట తక్క నాతఁడు మఱి యొకటి చేయుచున్నట్లు తోఁపదు. ఇట్లుండఁగా నొక

కర్షకుఁడు కుమారునితోఁడ నొక యావును వెంటఁబెట్టు కొని యూరిదెసకుఁ బోవుచుండెను. అతఁడు చెట్టుక్రింది యోగినిఁజూచి కుమారునితో "నిక్కడనెవరో పెద్దలు సమాధినిష్ఠాగరిష్ఠులై యున్నారు. నేను వారిని సేవించు కొని వచ్చెదను. నాకొఱకు మీరు వేచియుండ నక్కఱ లేదు. నేను వచ్చునప్పటికిఁ గొంచెము రాత్రియగు" నని చెప్పి పంపివేసెను. "సాగుచున్న నందఱును బెద్దలే" యని విసుగుకొనుచు నాతని కుమారుఁడు వెడలిపోయెను. కర్షకునిఁ జూచినవెంటనే యోగి నిమీలితనేత్రుఁ డయ్యెను.

కర్షకుడు యోగిచెంతకువచ్చి వినయముతో నొక ప్రక్క నిలిచియుండెను. పశ్చిమదిక్కాంత తన ప్రియుని శుద్ధాంతమునకుఁ దోడ్కొనిపోయెను. పిమ్మటఁ గొన్ని నిముసములకు యోగి కన్నులు తెఱచెను. తోడనే కర్షకుఁడు సాష్టాంగ మాచరించెను. యోగి ప్రేమతో "మీరెవరు" అని ప్రశ్నించెను. "నేను సోమేశ్వరమున వసించియున్నాను. కర్షకుఁడను. పేరు వీరయ్య" అని యాతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అంవుల కానందమును బ్రకటించుచు యోగి "ఈపేరు విన్నాము. సోమేశ్వర మున నీయొక్క పేరే పెద్దజాబితాలోఁ జేరినది. ఈ భక్తుని ప్రత్యక్షముగాఁ జూచిన నేఁటిదినము మాకానంద

సంధాయకము" అని చెప్పెను. వీరయ్యకు ధైర్యముగలిగెను. ఆతని హృదయ మానందసాగరమున నీదులాడ సాగెను. వెంటనే యాతఁడు కూరుచుండి యిట్లనియెను.

"ఈమూఢునిఁ దామే పెద్దలలోఁ జేర్చితిరా? ఇఁక నేనుముక్తుఁడనే. పెద్దలకుఁ బెద్దలగోష్ఠియే వ్రతము. తమ పేరు సెలవీయవలెను"

"పేరులో నేమున్నది! ఊరులును బేరులు నైహిక జీవితవిడంబనములు. పెద్దలూరు పేరులను లెక్కసేయరు. లోకమందలి యూళ్ళన్నియు వారివే. పేరు లన్నియు వారివే. అయిన నీపాదుకట్టి యున్నంతకాలము నీసంజ్ఞలు తప్పవు. మేము జగన్నాథయోగుల ప్రధాన శిష్యులము. అంతమాత్రముతోఁ దృప్తిఁబొందుఁడు"

"జగన్నాథయోగులు లోకగురువులు. వారివలన నుపదేశము పొందవలయునని కోరిక గలదు. ఈభక్తునకు వారిదర్శనమే యింతవఱకుఁ గాలేదు."

"లోక మంతయు గాఢాంధకారపూరిత మైపోయినది. పెద్దలందఱును దిక్కులేనివారై పోయినారు."

"ఏమి? వారిప్పు డెచ్చటనున్నారు?"

"అద్వైతబ్రహ్మమున"

"హా! రెండుమాసములక్రిందట వారు కాశీనగరమునకు విజయముచేసిరనివిన్నాను. మఱల వారిసంగతి నేఁటి

వలెనేను దెలియలేదు. తుదకు నేను నిరాశ్రయుఁడనై పోయితిని.

"విచారము వలదు"

"అవును. ఆ సచ్చిదానందమూర్తికొలఁకు విచారమేల? పెద్దలకు విచారమెక్కడిది? తను ప్రయాణమిప్పు డెక్కడకు?"

"సాంఘానికి. అచ్చట నొక బ్రాహ్మణుఁడు రెండు సంవత్సరములనుండి యుపదేశము చేయవలసినదని జగన్నాథయోగుల నాశ్రయించుచున్నాఁడు. తుదకాతఁడు లబ్ధవిజయుఁడు కాలేదు. యోగులు సిద్ధిపొందునమయమున నీవిషయమే ప్రస్తావించినారు. నేను చెంతనున్నందులకా భారమును నాపై మోపినారు"

"అయిన నీభక్తుని భారముగూడ వహింపవలెను"

"యోగులు నేనెన్ని పర్యాయములు గోరినను మంత్రసిద్ధి దయచేయరైరి. అవసానసమయమున మఱలఁ బ్రార్థింపఁగా లోకము నుద్ధరింపుమని యాజ్ఞాపించినారు. శరణాగతులను ద్రోసివేసినచో నేను కుంభీపాకనరకమునఁ గూలఁబడిపోదును"

"జగన్నాథ యోగులకు మీయెడలఁగల ప్రేమ మనంతము. వారు మిమ్ము విడిచి యుండఁజాలరు. వారికిఁ బరకాయప్రవేశశక్తి కలదని విందుము. మీయందు వా

రావేశించియే యున్నారు. కావున దేవరవారే నాకుఁ గూడ నుపదేశము చేయవలెను.''

"సంవత్సరమునకు ముప్పదియొక్కరికి మాత్రమే యుపదేశముచేయు మని గుర్వాజ్ఞ. వారు సిద్ధిపొందిన వారము దినములకు వారణాసీ నగరమున, దశాశ్వమేధ ఘట్టమునందే యిరువది రెండ్రు రుపదేశము బొందిరి. నాలుగుదినముల క్రిందట రాజమహేంద్రవరమునఁ గోటి లింగ పుణ్యక్షేత్రమున నిరువుర కుపదేశమైనది. ఇంకను బదుగురు ప్రార్థించిరి; గాని రాజధానియందలి బ్రాహ్మణుని నిమిత్త మేరికినిఁ గాన్పింపకుండ నక్కడనుండి బయలుదేఱివచ్చితిమి. ఈయుపదేశముల కారణమున దొంగతనమునకుఁగూడఁ బాల్పడవలసివచ్చినది.''

"అయినచో నాయిద్దఱిలో నన్నొకనిగాఁ జేర్చి కొనుఁడు. నాకుపదేశముచేయకుండ మీరిక్కడనుండి కదలినచో గురువు నానగలదు.''

అదివిని యోగి మందహాసము గావించి "భక్తుఁడు ముందటి కాళ్లకు బంధము వేయుటలోఁ జాలఁజతురుఁడు'' అనియెను.

"చేఁజిక్కిన పెన్నిధి నెవరు వదలుకొందురు? నేఁడే, యిప్పుడే యిక్కడనే నాకు మంత్రోపదేశము చేయవలెను''

"బ్రహ్మానందము; గాని మామార్గము మిగులఁగఠిన మైనది. అందఱును దాని ననుసరింపలేరు."

"నేనన్నిటికిని సంసిద్ధుఁడను. అదియేమో సెలవీయ వలెను"

"యోగు లంగలవలె మేము పాదపూజ స్వీకరించుట లేదు. ఉపదేశము కోరువారికిఁ దొలుత గురుదేవుని యెడల సచ్చిదానందభావము కలుగవలెను. ఆబాల్యముగఁ జేసిన మంచిచెడ్డ లన్నియు గురుదేవునకు నివేదింప వలెను. గురుపాదతీర్థము సేవించినచో వెనుకటిపాపము లన్నియు శమించును. మావలన నుపదేశముపొందువారు సంసారమును విడువనక్కఱలేదు. మామూలు మార్గములయందే సంసారమును నిర్వహించుకొనవచ్చును"

"నేనన్నియుఁ జేసెదను" అని వీరయ్య చిన్ననాఁట నుండియుఁ జేసిన పుణ్యపాపముల నన్నిటినిఁ జెప్పివేసెను. "పరులకుఁ దెలిపినచో నాతల యెగిరిపోవును. మీకుఁ జెప్పక తీరదు" అని యుపోద్ఘాతము బ్రారంభించి యాతఁడు "రెండుమాసముల క్రిందట మాయూర నొక కర్షకుఁ డొక స్త్రీని బలవంతము చేసెను. దాని మీఁదఁ జాలనల్లరి యయ్యెను. అల్లరిచేయుటచే దానినిఁ జంపివేయవలయునని యాతఁడు తలంచెను. నూటయేఁబది రూపాయ లిచ్చి యాతఁడు నాసాయము గోరెను. ఇరు

పురమును గలిసి దానిని నిశీథమున నడవికిఁ గొనిపోయి తిమి. అంత పగఁబూనె నేనేగాని తుదకాతఁడు దానినిఁ జంపలేక పోయెను. జాలముచేసిన నపాయము వచ్చునని నేనే యాపనినిఁ జేసితిని. కొండు దినముల క్రిందట రామ వరమును గొల్లగొట్టిన భుజంగరాయఁడుగారి యాజ్ఞ వలనఁ బులిబూరుతాణేదారుగారిభార్యను హరించుకొని పోయిన నలుగరలో నేనొకఁడను. నేను పంటిపోటుగాం డ్రలోఁ జేరియున్నాను. ఆమెను గొనిపోయి ఆతఁడు నదుకుబాదాగ్రామములో నుంచెను. మఱునాఁడు స్థానము మార్చెదనని చెప్పెను; గాని మార్చెనో లేదో నాకుఁ దెలియలేదు. ఇంతకంటె నే నెఱిఁగిచేసిన పాపములు లేవు" అని చెప్పి యూరకుండెను.

పిదప యథాచారముగ యోగి యాతని కుపదేశము చేసెను. మఱల నాఱుమాసములకువచ్చి చూచెదననియు నీయుపదేశముల కారణమునఁ దఱిగిపోయిన తపస్సును గోటిలింగపుణ్యక్షేత్రమున సమాధినిష్ఠుఁడనై పూర్తిచేసి కొందుననియుఁ జెప్పి యోగి వెడలిపోయెను.

## 20

జాముసన్నర రాత్రియయ్యెను. పులిబూరు గ్రామవాసు లెల్లరును నిద్రాముద్రితులైరి. ఊరంతయుఁ జాల గంభీర

ముగ నుండెను. బాలచంద్రుం డప్పుడే యస్తమించుట వలన జగమంతయు గాఢాంధకార బంధురమయ్యెను. ఇంతరాత్రియైనను తానాకచ్చేరిలో రాజును, ప్రసాదరాయుడును, యువరాజును సుమంతకులను గుఱించియు, రాధనుగురించియు, నామెను వెదకితెచ్చుటకై పోయిన వారిని గుఱించియు నేదో చర్చించుకొనుచుండిరి. వీధి యరుఁగుమీఁద భీమారెడ్డి మండపాద విన్యాసము గావించుచుండెను. కచేరీచుట్టును పదుగురు భటులు సాయుధులై నిలిచియుండిరి. ఇట్లే యూరంతయుఁ గొండఱు భటులు గస్తు దిరుగుచుండిరి.

రెండుజాములరాత్రి యగునప్పటికి మఱియొక జట్టు వచ్చి తమకు విశ్రాంతి కలిగించునుగదాయని గ్రామరక్షకులుచాల జాగ్రత్తగా గ్రామరక్షణము గావించుచుండిరి. వీధులన్నియు దీపములవలనఁ జాలఁ బ్రకాశమానములై యుండెను. ఈసమయమున నొక కర్షకుఁ డూరిలోఁ బ్రవేశించి యతివేగముగా నడువసాగెను. అంత నొక భటుఁ డాతని నచ్చట నాపి యాలవేసెను. తోడనే మఱి నలుగురైదుగురు భటులువచ్చి చుట్టుకొని "ఇంత రాత్రివేళ మీరీయూరెందులకు వచ్చితిరి? మిమ్ముఁ బోనిచ్చుటకు మాకు సెలవులేదు. మీరు తానాకచ్చేరికి దయచేయవలె" నని చెప్పిరి. కర్షకుఁడు మందహాసము

గావించి "నేను పడవమీఁదఁ గాకినాడ పోవలెనని వచ్చుచున్నాను. నాప్రయాణమున కేల యాటంకము గలిగించెదరు" అనియెను. భటు లంగీకరింపరైరి. చేయునదిలేక కర్షకుఁడు రాణాకు బయలుదేఱెను.

భీమారెడ్డి కర్షకునిఁ జూచి మీరెవరని యడిగెను. కర్షకుఁడు "నేను నిలిచియున్నట్లుగా రాజావారినిఁ జూడవలెను. అంత యావసరమైన పని యున్న" దనియెను. భీమారెడ్డి తన ప్రశ్నకు జవాబు రాకపోవుటచేఁ గొంచె మసంతృప్తుఁడయ్యెను. ఇది యంతయు వినుచున్న రాజు ఆగంతుకునిలోనికిఁ గొనిరమ్మని భీమారెడ్డి కాజ్ఞాపించెను. ఈయాజ్ఞ నెఱవేర్పఁబడెను. భీమారెడ్డి సఖుల స్వస్థలమునకు నడచెను. కర్షకుని రాజు గుర్తించెను. ఆతఁడు రాధను వెదకుటకై పోయిన యుద్యోగి.

ఆతఁడిట్లు చెప్పెను "ప్రభువులు చిత్తగింపవలయును. నేను పోయినదొక పని. చేకొనివచ్చినది మఱియొక పని. అందులకు దమ రాగ్రహపడవలదు. నా పనిమీఁద నేనుండఁగా నొకచో శత్రువులగుంపు కనఁబడెను. వారు ముప్పదిమందికి లోపుగ నుందురు. అంచెలకును సరిపడిన మంచి గుఱ్ఱములున్నవి. వాని నన్నిటి నొకపాకయందుఁ గట్టివేసి, వారందఱు నొక పాకయందు గాఢనిద్రం దవిలియున్నారు. జామురాత్రి వేళవఱకు

వారక్కడనుందురు. పిదప బ్రహ్మకైనఁ దెలియకుండఁ బోయెదరు. వెంటనే బయలుదేఱినచో వారు మనకుఁ గైదీలు కాఁగలరు. ఇదిగూడ నాకు నవసరమైన పనియేగావున నాపనిచేసికొనకయే తిరిగి వచ్చితిని. వారున్నస్థలము రాయవరము, కొల్ల, నదురుబాదా, వెదురుపాకలకు నడుమనున్న విశాలారణ్యము''.

ఇదియంతయు విని వారు మిగుల నానందించిరి. తోడనే రాజు భీమారెడ్డినిఁ బిలిచి నూర్గుఱు రౌతులను, పంబంద్రు కాగడామనుష్యులను నిముసములోఁ దయారు చేయవలయు'' నని చెప్పెను. క్షణములో భీమారెడ్డి వారినిఁ దీసికొనివచ్చెను. రాజు వారి కందఱకును యువరాజును సేనాధిపతిఁ గావించి, భీమారెడ్డినిఁ దోడుగా నిచ్చి పంపివేసెను. రాజపురుషుఁడు పురోగామియై వారినిఁ దీసికొనిపోయెను.

రెండుజాములు రాత్రి యగునప్పటికి యువరాజు దురంతకులను ముట్టడించెను. తోడనే కాగడా లేఁబదియు నొకమాఱు వెలిఁగింపఁబడెను. ఆ ప్రకాశమువలన వనమంతయుఁ బట్టపగలై పోయెను. వాతావరణము వైలక్షణ్యము వహించెను. తీవ్రములగు నత్తేజఃకిరణములు గాఢసుషుప్తిం దవిలియున్న దురంతకుల కన్నులు కుట్టెను. ఉలికిపడి వారందఱును లేచి కూర్చుండి

చూడఁగా నీటెలు, బల్లెములు, కత్తులు, తుపాకులు దాల్చియున్న యసంఖ్య యోధులు తమ్ము ముట్టడించి యుండుట వారికిఁ దెలియవచ్చెను. రాజభటు లంద అను గూఢచారులే యైయుండిరి. తోడనే దురంతకుల గుండెలు బేజారై పోయెను; గాని యంతలో ధైర్యము తెచ్చుకొని వారి నాయకుఁడు "చూడవలదు కత్తులుతీయుఁ" డని యాజ్ఞాపించెను. గాని వారాపనిఁ జేయకపూర్వమే రాజభటులు వాండ్రను బట్టుకొనిరి. రక్త పాతము లేకయే యప్పటికి దురంతకులు బద్ధులైపోయిరి.

యువరాజు వారి నందఱ నొక్క జనపనారపగ్గము నకు వరుసగాఁ గట్టించెను. భీమారెడ్డి కొందఱుభటులను దీసికొనిపోయి దురంతకుల గుఱ్ఱములను బట్టితెచ్చెను. యుక్తసమయమున వారు పులిబూరు చేరికొనిరి. రాజు నయమున, భయమున, శిక్షణమున ననేకవిధముల నడి గించెను. గాని దురంతకులలో నొక్కఁడును దమ మూలబలవృత్తాంతమును చెప్పఁడయ్యెను. రాజు తెల్ల వాఱినపిదప దురంతకులను గొనిపోయి రాజధానిలోఁ గైదుచేయున ట్లాజ్ఞాపించి గుఱ్ఱములను బులిబూరు రాతులకు జవాబునామముచేసెను.

## 21

రెండుగడియలు ప్రొద్దెక్కెను. సదురుబాదాయందలి కర్ష కులలో ననేకులు నాలుగువీధులకు నడుమనున్న రచ్చ

సావడిపైఁ గూరుచుండి చుట్టలు గాల్చుకొనుచు సావకా శముగ లోకాభిరామాయణము ప్రారంభించిరి. కొందఱా సమీపమున నేయరుఁగుమీఁదనో కూర్చుండి దంత ధావనము చేసికొనుచుండిరి. రచ్చసావడిలో నందఱకు నగ్రభాగమున నూరిపెద్దకాఁపు కూర్చుండి వారిదెసకును వీరిదెసకును గన్నులు తేలవేయుచుఁ దన గౌరవము నతి జాగ్రత్తతో రక్షించుకొనుచుండెను. ఆతని పెద్దకాఁపుఁ దనము నెత్తిమీఁది పెద్దపాగావలనను ఒంటిచేతి తోడుగు మురుగువలనను, జిప్పలమొలత్రాడు వలనను దండకడియ ముల వలనను దూరమునకుఁగూడ బ్రకాశ మగుచుం డెను. అందఱునుగూడఁ బొలములలో సంచరించునప్పటి యలవాటుచొప్పునఁ గట్టుపంచెలను దొడలమీఁదికి దీసి కొనియే కూర్చుండియుండిరి. పెద్దకాఁపు పంచె మాత్రము మోకాళ్లు దిగియుండెను. అందలి సంవన్నుల యెల్లర యెదుటను గాల్యములను దీర్చికొనుటకుఁ దెచ్చికొనిన యిత్తడిచెంబు లుండెను. పెద్దకాఁపుకటాక్షము నాసించు కొని యొక చాకలియు, మంగలియు, నెదుటఁ గూరు చుండి నోళ్లు తెఱచుకొని తలలూఁపుచు లోకాభిరామా యణము వినుచుండిరి. దూరమున నొక మాదిగవాఁడు మోఁకాటికట్టునానుకొని పెద్దకాఁపుచూపులు తనదెసకుఁ బ్రసరింపనపుడు చుట్టకాల్చుకొనుచు నిలిచియుండెను.

నడుమనడుమ వాఁడుగూడ నొకటిరెండు మాటలాడు
చుండెను.

ఇట్లుండఁగా నొక భిక్షుకుఁడు చనుదెంచి పెద్దకాఁపు
నకు మ్రొక్కి "నేను కొమ్మదాసరిని. సెలవీయవలయు"
నని ప్రార్థించెను. అదివిని పెద్దకాఁపు నమ్మినబంటు నని
గర్వపడు మంగలి మాధవుఁడు వానినిఁ జురచురఁజూచుచు
"పెద్దకాఁపుగారేదియో మాట్లాడుచున్నారు ఇప్పుడు.
గోలచేయుటకు వీలులే" దని గద్దించి పలికెను; గాని
వానిపుణ్యము బాగుగనుండుటవలనఁ బెద్దకాఁపు నోటి
లోని చుట్టఁదీసి గుప్పుగుప్పునఁ బొగవిడిచి తలయూఁపుచు
"వద్దనకు, వద్దనకు. కొమ్మదాసరి విచిత్రములుచూచి
చాలదినములైన" దని దాసరికి సెలవిచ్చెను. అప్పుడు
చాకలి యల్లాయి మంగలి మాధవునిఁ బురపురఁజూచుచు
"బ్రతిదానికి నడ్డువచ్చెదవు. కాఁపుగారి సరదా నీకేమి
తెలియును? కానిమ్ము కొమ్మదాసరీ కానిమ్ము; నీశక్తి
యేమో బాగుగాఁ జూపు" మని తాను గూడ సెల
విచ్చెను. ఆమాటలు విని యూరకుండుటకు మాధవుఁ
డంత చేతఁగానివాఁడు గాఁడు. వెంటనే వాఁడు రూక్షేక్ష
ణుఁడై "యెల్లపుడు వారిపాదములాశ్రయించికొనియుండు
వాఁడను. కాఁపుగారి సరదా నాకెఱుకా నీకెఱుకా? ఇఁక
నోరెత్తకు" మని చివాలున మొగము త్రిప్పుకొనియెను.

యల్లాయగూడ మాధవునంత పౌరుషశాలియే. వాఁడు మఱింత కోపదృష్టిఁ బఱపుచు "కాఁపుగారి సొదా నా కెఱుకయో నీ కెఱుకయో తెలియుచునే యున్నది చెల్లని మాటలేల చెప్పెద వూరకుండు" మని గొప్ప కార్యము చేసినవానివలె సగర్వముగఁ బెద్దకాఁపు దెసకుఁ జూచెను.

అంతవఱకును మఱల మాట్లాడుటకుఁ గాఁపున కవకాశము చిక్కలేదు. తోడనే యాతఁడు వాండ్ర కలహమును నివారించి నిచ్చెన తీసికొనివచ్చి దాసరి కిమ్మని చాకలి కాజ్ఞాపించెను. విజయగర్వముతోఁ జాకలి నిచ్చెన కొఱకు వెడలెను. ఈసందర్భమున నెట్లో వీలుచేసికొని పెద్దమాదిగ "పెద్దకాఁపుగారు బిచ్చగాండ్ర నెప్పుడును బొమ్మన" రని పెద్దకాఁపు గౌరవము నిలిపెను. అప్పుడు పెద్దకాపందఱ దెసకుఁ జూచి "ఔనయ్యా! బిచ్చగాండ్ర నేల పొమ్మనవలెను? తమ్ముఁ బోషింపుఁడని వాండ్రు ఒక్కనినే బాధింపరు గుప్పెడు గింజలకుఁ గొంగుచాపు వాండ్రవలన మనకేమి బాధ కలుగును?" అని తన యౌదార్యము నంతను బ్రకటపఱిచెను. "చిత్తము మహాప్రభూ! ఆశ్రితలోకదేవేంద్రా! ఏలినవారి సంస్థానము వేయేండ్లు వర్ధిల్లవలయు" నని భిక్షుకుఁ డాశీర్వదించెను.

ఇంతలోఁ జాకలి యల్లాయ నిచ్చెన తెచ్చి దాని

చెట్టునకు వేసెను. తోడనే దాసరి, మీఁదియుత్తరీయ
మును జెట్టుక్రిందఁ బఱచి యెగిరిపోకుండునట్లు నాలుగు
చెఱఁగులమీఁదను జిన్నిచిన్ని రాళ్ళుంచెను. అప్పుడు
పెద్దకాఁపు, ప్రక్కనున్న కర్షకునిచెంత నొకకాని బదులు
తీసికొని చాకలిచేత దాసరి యుత్తరీయమున వేయిం
చెను. అందుల కెంతో వినయముతో దాసరి పెద్దకాఁపు
నకు మ్రొక్కి "చాకలాయన చేయి చల్లనిది. మంగ
లాయన చేయి చలిమిడిముద్దగాఁచించు"నని పలుకుచుఁ
జెట్టెక్కఁబోయెను. అదివిని మిగుల రోషముతో మం
గలి యటనుండి తొలఁగిపోయెను. "కోపమెందులకు
రారా" యని కాఁపు పిలిచెను; గాని వాఁడు "మీరు
దగ్గఱనుండియే పరాభవము చేయించుచున్నా" రని రుస
రుసలాడుచు వెడలిపోయెను. కొమ్మదాసరి మంగలి కోప
మునకు నవ్వుకొనుచుఁ జెట్టెక్కఁబోయెను.

ఆ రావిచెట్టు మహోన్నతమగుటచేఁ జివరకొమ్మకుఁ
బోవువారికి గ్రామమంతయుఁ జక్కఁగ గాన్పించును.
అగుటచే స్త్రీలకు మానభంగము ప్రసంగ మేమైనఁ
దటస్థింప వచ్చునని యెన్నో దినములకుఁ బూర్వము
దానిమీఁదికి నెవరు నెక్కఁగూడదని పెద్దకాఁపు ముదల
చేసెను; గాని కొమ్మదాసరులకుమాత్ర మాముదల
యభ్యంతరము లేదు. నాఁడు స్త్రీలందఱును జాగ్రత్తగ

నుండవలసినదియే గాని పెద్దకాఁపు బాధ్యత యేమియు లేదు. అతని యిల్లు ఆసమీపమున లేకపోవుటచే నిట్టి తీర్మానము చేసెనని కొందఱ అనుకొందురు. అయిన నాతనియెదుట నెవరును మాట్లాడలేరు.

కొమ్మదాసరి చిట్టచివఱకుఁ బోయి యొకమాఱు నలుదెసలు చూచి కంఠము సవరించుకొనియెను. ఆధ్వని సవ్వడినిఁబట్టి రచ్చసావడి మీఁదివా రెల్లరును వాని వర్ణనమును వినుటకాతురపడసాగిరి. ఈసందర్భమునఁజాకలి యల్లాయ పాగా క్రిందఁబడిపోకుండున ట్లొకచేతఁ బట్టుకొని కండ్లు చికిలించి "పాట బాగా పాడవలెను. కాఁపుగారి కానందము గలుగవలె"నని చెప్పెను. కొమ్మదాసరి యిది వినుపించుకొనకయే వర్ణనము ప్రారంభించెను.

ఒక కాఁపువనిత, క్రొత్తగాఁ గాఁపురమునకు వచ్చిన ముద్దరాలు, అత్తగా రూరిలో లేకపోవుటచే మందస్మితాంచితవదనుఁడగు భర్తను లజ్జామిళితమగు దరహాసముతో దొడ్డిమురఁగుమీఁద భోజనముపెట్టి కొంచెము చాటున నిలిచి ముసిముసినవ్వులు నవ్వుకొనుచుండెను. కొమ్మదాసరి యామెస్థితి యంతయు వర్ణించి "అక్కా! బిచ్చము వేయు" మని యఱచెను. మఱియొకయింట నొకపడుచు, భర్తకు మంగలి తలయంటుచుండఁగా వేఁడినీళ్లు బిందెలోనికిఁ దోడుచుండెను. దాసరి

యూమెనుగూడ వర్ణించెను. మఱియొక యింట నిరువురు తరుణులొకరిదెస నొకరు కూరుచుండి వింతపడుచు ముచ్చటలాడుకొనుచుండిరి. ఇంకనొకచో నొకస్త్రీ తాను క్రొత్తగఁ జేయించుకొనిన కడియముల నింకొకతెకుఁ జూపుచుండెను. మఱియొక రమణి బిడ్డనికి పాలిచ్చుచు భర్తతో సల్లాపము లాడుచుండెను. ఒకవారకాంత వెడలి పోవుచున్న విటునిఁ జాల మర్యాదచేసి సాగనంపుచుండెను. ఒక జవరాలు భర్తపై రుసరుసలాడుచుండెను. ఇంకొక మకవతి ముసలిమగని జూచి మెటికలు విఱుచుచుండెను. ఒకయంగన మగని తొడపైఁ గూరుచుండి యాతని ముంగురులు సవరించుచుండెను. ఒకశూద్రస్త్రీ చేటలో నెగిరిపడుచున్న చేపలు తరుగుచుండెను. ఒక బ్రాహ్మణస్త్రీ రాయి పగిలిపోవునట్లు బట్ట లుతుకుచుండెను. ఒక కుసుమకోమలి భర్తయొడిలోఁ గూరుచుండి వికవిక నవ్వుచుండెను. ఒకవృద్ధస్త్రీ కొడుకుతోఁ జెప్పి కోడలినిఁ గొట్టించుచుండెను. ఒక కోడ లత్తగారినిఁ గసరికొట్టుచుండెను. కొమ్మదాసరి వారి నందఱను సంబోధించి బిచ్చము పెట్టుఁడని కేకలువేసెను.

నడుమ వాఁడు నలుగెలఁకులఁ జూచి "కడియాల కామమ్మా, పడిపోవుచున్నాను. మురుగుల ముత్తమ్మా, జారిపోవుచున్నాను. బాజిబందుల పార్వతమ్మా, దొర్లి

పోవుచున్నాను. జంటరవికల సావిత్రమ్మా, ఊటుకు చున్నాను. మేలిముసుఁగుల సీలమ్మా, దుముకు చున్నాను. చంద్రవంకల సరమ్మా, మొగురుచున్నాను. అడ్డబాసల దొడ్డమ్మా, ముక్కు చితికినది. చిటుగజ్జెల చంద్రమ్మా, కాలువిఱిగినది. ఉంగరాల బంగారమ్మా, చేతులువిరిగినవి. కొప్పుగొలుసుల అప్పలమ్మా, తల చితికినది" యని యీ తీఱునఁ బెద్దదండకము జదివెను.

కొమ్మదాసరి తొలుత స్త్రీలనువర్ణింపఁదొడఁగినప్పుడు రచ్చసావడిమీఁదివారు "వీడంతఱ గుట్టును బైటఁబెట్టు చున్నాఁడు. ఎంత వింత" యని యబ్బురపడి దండకము ప్రారంభించిన వెంటనే కడుపులుబ్బ నవ్వలేకపోయిరి. వాని కండ్లఁబడినయిల్లాండ్రలో ననేకలును, వాని గొడవ వినినవారును, జేటలలో యథాశక్తిగ బియ్యము పోసికొని బయలుదేఱి రాఁదొడఁగిరి; గాని సావడిమీఁదఁ బెద్దపెద్ద లందఱు నుండుటచే సిగ్గుపడి పిల్లవాండ్రచేఁ బంపఁజొచ్చిరి. కొందఱింటికిఁబోయి తెచ్చియు, దగ్గఱ వారివద్ద బదులుపుచ్చుకొనియు సావడిమీఁదివా రందఱు గూడ నొక్కొక్క కానిచొప్పున యిల్లాయచే దాసరి కండువాలో వేయించిరి. నడుమనడుమ వారు "దాసరి పుణ్యము పుచ్చినది. పదిదినములవఱకును వాఁడింకఁ గష్టపడ నక్కఱలేదు" అని యనుకొనిరి.

కొమ్మదాసరి వర్ణన మఱలఁ బ్రారంభించెను. ఒక కాంత మగని నెడమచేతఁ గౌఁగిలించుకొని కుడిచేత నాతని మీసాలు దువ్విదువ్వి తటాలున నొక చెంప కాయ యిచ్చి దూరముగఁ దొలఁగిపోయెను. ఒక యువకుఁడు వింతచేయుదము రమ్మని ముద్దరాలగు తన భార్యను గౌఁగిటఁ జిక్కఁబట్టి దాసరినిఁ జూడు మని నిర్బంధింపసాగెను; దాసరిసంగతి యంతయుఁ గనిపెట్టుచున్న యామోహనాంగి వాఁడు తన స్థితిని వర్ణించునని సిగ్గుచేఁ బతి యాలింగనమునుండి తప్పించు కొనఁ బ్రయత్నించు చుండెను. ఇది చూచి దాసరి తటాలున నామెను వర్ణించివేసెను. తోడనే భర్త కిలకిల నవ్వసాగెను. ఈకొంటెతనమునకు భర్త కొక లఘుచపేటిక బహుమతిచేసి యామె తొలఁగిపోయెను. రెండుమూఁడు గడియలనుండి యొక్కతీరున నూరివారి నందఱను వర్ణించుచుండుటచే రాధ ముచ్చటపడి కిటికీ లోనుండి దాసరినిఁ జూచెను. దాసరి యామెను గూడ బిచ్చము పెట్టుమనియెను. నూతనముగా ముండితశీర్షయైన యొక వితంతువు నెత్తిమీఁదిముసుఁగు సవరించు కొని సవరించుకొని దొడ్డితలుపుచాటున నిలిచి తొంగి చూచెను. దాసరి యామెనుగూడ విడిచి పెట్టఁడయ్యెను. ఇరువురు తోడికోడండ్రు గుసగుసలాడుకొనుచు ధాన్యము

దంపుకొనుచుండిరి. "తొలుత నాకు విఘ్నేశ్వరపూజ చేయనిచో మీకలహము పెరిగిపోవు" నని దాసరి యా ముద్దుగుమ్మలకుఁ బ్రశ్న చెప్పెను. ఇంకను కొంతతడ విట్లు పాటలు పాడిపాడి దాసరి చెట్టుదిగివచ్చి, బియ్యము డబ్బులు మూటగట్టుకొని, పెద్దకాఁపుచెంత సెలవుగై కొని వెడలిపోయెను. సావడిమీఁదివారు "నేఁడు మంచి వినోదము జరిగిన" దని యానందించుచు నిండ్లకు వెడలి పోయిరి.

## 22

జాముప్రొద్దెక్కెను. బ్రాహ్మణుల యిండ్లయందు వంటలు ప్రారంభమయ్యెను. శూద్రులయిండ్ల భోజనములకుఁ బ్రారంభమయ్యెను. వైశ్యస్త్రీ లింకను వంటలమీఁదికి మనస్సును ద్రిప్పనేలేదు. ఊరిలోని పశువు లన్నియు మందలు మందలుగా మేఁతకొఱకుఁ బొలములకుఁ బోవ సాగెను. ఒకటిరెం డిండ్లయం దింకను బాలు పితుకు టయే గాలేదు. ఈసమయమున నదురుబాదాగ్రామమున నొకభిక్షుకుఁడు తన పాటకు శ్రుతిగాఁ దంబుర మీటు కొనుచు నింటింటికిఁ దిరుగుచుండెను.

కొంద ఱిది వేళగాదు పొమ్మనిరి. కొందఱు కసరు కొనిరి. కొందఱు విసుగుకొనిరి. కొందఱు జవాబు చెప్ప

్రైరి. కొందఱు ధాన్యమైపోయినవనిరి. బియ్యమువేయుఁడనిన దంపింపవలయుననిరి. కొందఱు "మేము గుట్టుగాఁబడియున్నాము, బిచ్చమువేయుటకు శక్తియున్న వారముకామునాయనా" యనిరి. గడుసుఁదనముగల యమ్మలక్కలు కొందఱు చేతితో లేదనిరి. కొందఱు సోమర్షులు "కష్టపడి కూలిచేసికోరాదా" యని కసరుకొనిరి. కొందఱు వీధితలుపులు బిగించుకొనిరి. "ఈబిచ్చగాండ్రతో వేఁగిపోవుచున్నామమ్మా" యని కొందఱు సణుగుకొనిరి. కొందఱు "తెల్లవారెనతరువాతఁ గుంచెడు ధాన్యమైపోయినవి. మాయింటి యజమానుని పాటు కుంచెఁడులో సగమే" యనిగొణుగుకొనిరి. దిక్కులేని యొకముసలమ్మ "నాయనా! నాలుగిండ్లకును బోయిరా. నేను వండి నీకింత పెట్టి నేనింత తినెద" ననియెను. అత్యవసరముగాఁ బొరుగూరు పోవఁదలఁచి కావడిమోయుటకుఁ గూలివాఁడు దొరకక చిక్కుపడుచున్న యొక బాటసారి "కావడి మోసెదవేని మామూలుకంటె రెట్టింపుకూలి యిచ్చెద" ననియెను. దుకాణముమీఁదఁ గూర్చున్న కోమటి నాలుగు సెలఁగ బద్దలిచ్చి పొమ్మనియెను. ఒకబ్రాహ్మణి "నేను మడిగట్టుకొన్నాను. నీకు ముష్టివేయుట కెవరును లే" రనియెను. మఱియొక బ్రాహ్మణి భోజనాలైపోయినవి, పొమ్మనియెను. వేఱొక

బ్రాహ్మణి తన రెండేండ్ల గారాబుకొమార్తె చిన్నదోసిటితో బిచ్చము వేయించి "నాతల్లీ, నాకూనా, నేఁడెంత పనిచేసితివమ్మా" యని యదేపనిగ బిడ్డను ముద్దుపెట్టుకొనసాగెను. బిచ్చగాఁడు తుదకు పాటపాడుకొనుచు రాధనిర్బంధింపబడియున్న పెద్దయింటికి వచ్చెను.

ఆయింట నిప్పుడు సోమమ్మయను వితంతు స్త్రీ యొక్కతె మాత్రమే యుండెను. ఆమెబంధువు లందఱనుగతించిరి. ఆమె యేకపుత్త్రుఁడు భట్టాచార్యునంతటివాఁడుకావలెనని యెరికినిఁ జెప్పకుండఁ గాశీనగరమునకుఁ బాఱిపోయెను. ఈయేకాంతవాసమునకుఁ దోడుగ నామె దరిద్రురాలు. భర్త జూదగాఁడై భూవసతి యంతయు నమ్మివేసెను. మిగిలినది యొక్క దిక్కులేని దివాణమువంటి యిల్లు మాత్రమే. భుజంగరాయని కామె కొంచెము బందుగురాలు అగుటవలనను; విశేషించి యెట్లయిన భుజంగరాయని నొక యింటివానిఁ జేయవలయునని విశ్వప్రయత్నములు చేయుచున్నదగుటను; ఆతఁడే యామె కన్నము పెట్టుచుండెను. అగుటవలననే యామె భుజంగరాయని యాజ్ఞ చొప్పున రవంతయైన భీతిలేకుండ రాధాదేవినిఁ దనయింట దాఁచెను.

బిచ్చగాఁ డక్కడకువచ్చి యథాప్రకారముగఁ బాటలు పాడసాగెను; గాని సోమమ్మ చాలదూరమున నున్న

వంటయింట, వంట తొందరలో నుండుటవలన బిచ్చగాని పాట లామెకు వినఁబడుటకును, బిచ్చముపెట్టియో, పెట్టకయో వానిని బొమ్మనుటకును, ఆమె కవకాశము చిక్కదయ్యెను. లోకములో బిచ్చగాండ్రవద్ద నొక గుణము కాన్పించుచున్నది. ఏయింటివారు జవాబు చెప్పకుందురో వారికి విసుగుపుట్టించి, ఉన్నదనియో లేదనియో యనిపించుకొనకుండ వాండ్రు కదలిపోరు. ఈ బిచ్చగాఁడుగూడ నట్లే చేయ నిశ్చయించుకొనియె. వానిపాట యీరీతిగ నుండెను.

గీ త ము

ఒక్కదూఁకున నీ శతయోజనాబ్ధి
దాఁటివచ్చి నినుంగంటిఁ దల్లి నేను;
వనధి నసురుల తలపూవు బంతులెల్ల
మీఁటి నిన్నేలు రామభూమీవిభుండు. ౪
అరసితి వియోగఖేదోపహతిఁ గమలియు
మెఱయు నీమోము నీచెట్టుమీఁద నుండి;
కాంతు వింక జేపె భస్త్రరక్తప్రవాహ
మగ్న రిపుకామినీముఖమండలములు. ౫
ధ్యానగమ్యుని మదినిఁ గ్రోధాగ్ని గాఁగఁ
బ్రజ్వలింపుము సంతాపవహ్ని నీవు;

అమలకీలోచ్చలత్ప్రళయాగ్నిఁ జేసి
తల్లి! ముట్టింతు నైరికాంతారసీమ. ౧౮

అనుజమాత్రసహాయుఁడై యడవులందుఁ
గ్రుమ్మరు విభుం డటం చనుకొనకుమమ్మ;
చేరి మారాజు సకుటుంబసేవఁ జేయ
వెదకఁజుచ్చాఁడు నిన్ను దిగ్విభుతు తెల్ల. ౧౯

ఎఱుగఁ జెప్పితి వేకాంతవృత్త మెల్ల
ఆనవా లిచ్చితివి తలమానికంబు
దీవనలు చేసినావు వర్ధిల్లు మనుచు
నింక సెలవిమ్ము రామభూమీశుఁ జేర ౨౦

అప్పటికిసోమమ్మ రుసరుసలాడుకొనుచువచ్చి తలుపు తెఱచి రూక్షేక్షణయై "నీకింత పొగరా? ఎంతసేపటికినిఁ బలుకకుండుటఁ జూచియైన లోపల నేమిపనిలోనున్నారో యనుకొనవలదా? పో. ఈసమయమున నీకే బ్రాహ్మణుల యింట బిచ్చము దొరకు" నని కసరుకొని తటాలునఁ దలుపుమూసికొని పోయెను. "మంచితల్లివి. ప్రొద్దున లేచి నీ మొగముచూచిన రాఁదలచినదిగూడ నెనుదిరిగి పోవును" అని పలుకుచుఁబిచ్చగాఁడు గుమ్మముదిగెను.

బిచ్చగాఁ డీయింటికి వచ్చునప్పటి కొక కర్షకుఁడు భోజనముచేసివచ్చి యెదుటి యింటియరఁగు మీఁదఁ

గూర్చుండి, పాట పూర్తిగా వినఁదలఁచి "రాత్రివచ్చి పాడెదవేని ఒక రూపాయి యిచ్చెద" ననియెను. బిచ్చగాఁ డానందముతో నంగీకరించెను. తోడనే క్ష కుఁడు వానికొక బేడడబ్బులు బజానాగా నిచ్చి నీపేరే మనియెను. తన పేరు సామిగాఁడని చెప్పి బిచ్చగాఁడు వెడలిపోయెను.

## 23

నాఁడు జామున్నర ప్రొద్దెక్కినతరువాతఁ బ్రసాద రాయఁడు ఠాణాకచ్చేరీనుండి భోజనమునకై యింటికిఁ బోయెను. రాజపురుషునకు భోజనమైన పిమ్మట మఱల రాధాన్వేషణమున కరుగుటకై రాజాజ్ఞ యయ్యెను; గాని యతని వలనఁ బ్రయోజనము కలుగునని రాజున కెంత మాత్రమును నమ్మకము లేదు.

పిదపఁ గొంతసేపటికి నదురుబాదాలో బిచ్చమెత్తు కొను భిక్షుకుఁడు యథాపూర్వముగఁ బాటలుబాడు కొనుచుఁ బులిబూచుఠాణా చేరిసి సమీపించెను. రాజ పురుషులు వానిని వారించిరి; గాని వాండ్రను లెక్క సేయక బిచ్చగాఁడు అరఁగెక్కెను. వాని మోటుతనము నకు మిగులఁ గోపించి భీమారెడ్డి క్రిందికి గెంటివేయఁ జూచెను; గాని వానిత్రోఁపునకుఁ దానే వెనుకకుఁ దూలి

పోయెను. తోడనే బిచ్చగాఁడు లోనికిఁ బోయి రాజు నెదుట నిలువఁబడి పాట మొదలుపెట్టెను.

గీ త ము

అరసివచ్చితి వైదేహి నబ్ధిదాఁటి
లంక నల్వంకలందు నిశ్శంకఁ జొచ్చి;
బ్రతుకు ఘటియింతువనుచు నోరాము, నిన్ను
నమ్మికొనియున్న దగ్గిగుండమ్ము నడుమ. ౪
ఘనసతీత్వతటిత్తరంగములవలన
సీత నడయాడుఁ ద్వగ్ధతజీవయయ్యు;
తీసికొనిరమ్ము ప్రాణప్రతిష్ఠ సేసి
యమునిలెంకకు రిపువీరు నప్పగించి. ౮
అహితరక్తార్ద్ర నిజచరణాంకణముల
లీలబథమెల్ల రంగవల్లికలు దీర;
నరిగి, రాజర్షి బిడ్డ మాయనుఁగుఁదల్లి.
వైరియిల్లాలి నోదార్ప వాంఛ సేయు. ౧౨

తొలుత రాజు బిచ్చగాని సాహసమునకుఁ గోప పడియెను. పిదప నాశ్చర్యపడెను. పాటవిని సంశయ ముతో లేచినిలచి “కుమారస్వామీ” యనియెను. తోడనే బిచ్చగాఁడు చేతులుజోడించుకొని “చిత్తము మహా

ప్రభూ'' యని పలికి మఱలఁ బాడఁదొడఁగెను. ఇంతలో యువరాజు వచ్చెను. బిచ్చగాఁడు కుమారమహీపతి దెసఁ జూచుచుఁ బాడసాగెను. యువరాజుగూడ నన్ని భావములకు లోనై తుదకు "కుమారస్వామీ" యని పిలిచెను. బిచ్చగాఁడు మఱల "చిత్తము మహాప్రభూ" యని పలికి పాట సాగింపఁజొచ్చెను. ఇదియంతయు విని యంతలో నచ్చటకు రాణి వచ్చెను. వెంటనే భిక్షుకుఁడు పాటముగించి "తల్లీ! బిచ్చము వేయు" మని జోలి సాచెను. ఇదిచూచి రాణి తెల్లబోయెను. అదిగ్రహించి రాజు రాణి నారసి "దేవీ! గుర్తు తెలియలేదా? మన కుమారస్వామి" యనియెను. రాణి పరమాశ్చర్యచకితయై "కుమారస్వామీ! ఈవేష మేల?" యని ముక్కు మీఁద వ్రే లిడుకొనియెను. అప్పుడు రాజు తడయఁ జాలక కుమారస్వామినిఁ గౌఁగిలించుకొని సంగతి యంతయుఁ జెప్పుమని యడిగెను. ఇదంతయుఁ జూచు చున్న భీమారెడ్డి తటాలున వచ్చి భిక్షుకుని—కుమార స్వామి చేతులు పట్టుకొని "నాసాహసము మన్నింప వలయు" నని వేడుకొనియెను. ఇట్లుపచారములన్నియు ముగిసినపిదపఁ గుమారస్వామి తాను బయలుదేఱినది మొదలుకొని యాక్షణము వఱకును జరిగిన సమస్త విష యములును—అనఁగా వేదాంతివేషము, వాహకుని

వంచించుట, కొమ్మగానసరి వేషము, రాధా దేవినిఁజూచుట, బిచ్చగాని వేషము, రాధకు సంకేతము దెలుపుట మున్నగునవి అన్నియుఁ జెప్పెను. తోడనే రాజు, ఇంత మాయ పన్నినందులకును, ముఖ్యముగా రాధా దేవినిఁ జూచివచ్చినందులకును మహానందముతో మఱలఁ గుమారస్వామినిఁ గౌఁగిలించుకొని "బాబూ! మాప్రాణములు నిల్పితి" వని యభినందించెను. యువరాజుగూడ నట్లే చేసెను. రాణి మిగుల నానందించెను. అప్పుడు రాజు కుమారస్వామినిఁజూచి "యిఁక నీవేషమేల? మంగళవేషము ధరింపరాదా?" యనియెను, యువరాజుగూడ నట్లే చెప్పెను; గాని కుమారస్వామి యంజలిబద్ధుఁడై "ప్రభువులు చిత్తగింపవలెను. తాణేదారుగారి యింటఁ గొంచెము వినోదము చేయుటకు సెలవీయవలెను" అని ప్రార్థించెను. తోడనే రాణి "ఔను కుమారస్వామి కభ్యంతరము చెప్పవలదు. అతఁడు సీతను జూచివచ్చిన మారుతి. మధువనమున నాతని యిచ్చవచ్చినట్లు సంచరింపనిండు" అని చెప్పెను. అందులకుఁ గుమారస్వామి నవ్వుకొనియెను. రాజు బాగుగనున్నదనియెను. యువరాజు "ఈవార్త మనవారికి జెప్పివచ్చెద" నని బయలు దేఱెను. నేనునువచ్చెదనని రాజు బయలుదేఱెను. "ఇఁక నేనేనా యీయానంద మనుభవింపనిదాన" నని రాణి

గూడ బయలు దేఱెను. అందఱును జూచి కుమారస్వామి వినయముతో "నాప్రార్థనముఁ బాలింపవలెను. నన్ను ముందుగఁ బోనిండు. తరువాతనైన మీరువచ్చి నారహస్యమును బట్టబయలు సేయవల" దని బతిమాలుకొనియెను. అందఱును వల్లెయనిరి. చూచుచుండఁగనే కుమారస్వామి గుమ్మముదిగి మాయమయ్యెను. పిదపఁ గొందఱు పరిచారికలును, భీమారెడ్డియు ముందు నడువ రాజకుటుంబము బయలు దేఱెను.

కుమారస్వామి మాధవశర్మయింటికిఁ బోవునప్పటికి వీధిలో నెవరునులేరు; గాని వీధితలుపులు మాత్రము తెఱువఁబడియుండెను. అప్పుడేదో పనిమీఁద రుక్మిణి యంగణమునకు వచ్చెను. తోడనే కుమారస్వామి తటాలున నంగణము ప్రవేశించి పాటఁ బ్రారంభించెను. వాని సాహసము జూచి రుక్మిణి తొలుత భీతయై, వివర్ణయై, తుదకు ధైర్యము తెచ్చుకొని లోపలకు వచ్చెదవా యని గదుమసాగెను. రుక్మిణి గదిమినకొలఁది కుమారస్వామి పాట మఱింత బిగ్గరగా బాడఁదొడఁగెను. రుక్మిణి యదలింపులు విని జానకివచ్చెను. ఆమె యదలింపులుగూడ విని మాధవశర్మ గృహిణి వచ్చెను. ఆముగ్గర యదలింపులును విని యప్పుడే భుజించిన ప్రసాదరాయఁడు వచ్చెను. ఆతఁ డంగణమునఁ గాలుపెట్టు నప్పటికి రాజ కుటుంబము

వచ్చెను. అంగణమున వీధిలోనుండి రాజకుటుంబము ప్రవేశించుచుండఁగా లోపలనుండి మహేంద్రాదులు ప్రవేశించిరి. అందఱును రాజకుటుంబము రాకఁజూచి యాశ్చర్యచకితులైరి. ఇదంతయునిట్లు జరుగుచుండఁగాఁ గుమారస్వామి తనపాటను సాగించుచునే యుండెను. అందులకుఁ గోపపడి ప్రసాదరాయఁడు బిచ్చగాని నవ్వాలకు గెంటి వేయఁ బ్రయత్నించెను; గాని రాజు చేయిపట్టుకొని యాపి "యింకను గుర్తు తెలియలేదా?" యనియెను. అందఱు నాశ్చర్యపడిరి. "ఆహా కుమారస్వామి" యని వెంటనే ప్రసాదరాయఁడు ఆతనినిఁగాఁగిలించుకొనియెను. అంతలో రాణి "కుమారస్వామి రాధాదేవినిఁ జూచి వచ్చినాఁ" డని పలికెను. అందఱకు నిది యశరీరవాణి పలుకుగాఁ దోఁచెను. అందఱ భావగతియు క్షణకాలము రుద్ధంబై పోయెను. అందఱు నేడువసాగిరి. ప్రసాదరాయఁడును, గుమారస్వామియు నంతకుముందే యేడువసాగిరి. వారికనులనుండి యశ్రులహరి జలజలప్రవహించుచుండెను.

రాధాదేవి కాన్పించెనను సంతోషవార్త వినవచ్చినపుడీవిచారమేల? ఇందేమియు నాశ్చర్యము లేదు. కాన్పించెనను మాటచెవులఁబడిన వెంటనే రాధ అయిపు లేకుండఁ బోయెనను మాట హృదయమున మఱల నాఁటెను. ఇఁక విచారమున కేమికొదవ? సముద్ర

మంతయు నీదికొనివచ్చి తీరముచేరి మఱల సముద్రము జూచునప్పుడు విపన్నుని హృదయమున నుప్పొంగువిచార సాగరమునెదుట నెదుటఁగాన్పించుసాగర మెంతటిది?

అందఱును గొంతతడ విట్లు వగచిరి. తుదకు రాజు "ఇట్లు విచారించుచుండుటవలనఁ బ్రయోజనమేమి? ఉన్న పని యంతయు ముందేయున్నది. జాలము చేసిన నపాయము రావచ్చును. కుమారస్వామికి ముందు భోజనము పెట్టుఁ" డని చెప్పెను? గాని "భుజించునంతదనుక నుండుటకు వీలులేదు. నిలిచియుండఁగా నదురుబాదా వెళ్లి రాధాదేవి నుద్ధరింపవలె" నని కుమారస్వామి చెప్పెను. "ఇంకను భటులను సిద్ధము చేయవలసియున్నది. నీభోజన మగునప్పటి కంతయు సిద్ధమగు" నని రాజందులకుఁ బ్రతిషేధము చెప్పెను. ఈసందర్భమున నందఱును ముచ్చటపడుటచేఁ గుమారస్వామికిఁ దన ప్రయాణ వృత్తాంతమంతయు సూక్ష్మముగఁ జెప్పక తప్పినదిగాదు.

ఇదియైపోయినతరువాతఁ గుమారస్వామి లోనికి బయలుదేఱెను. అతనిని స్నానముచేయించి భుజింపఁ జేయుటకు జానకీరుక్మిణులు ముందునడచుచు "ఇదేమి వింతమ్మా? బిచ్చగాఁడు లోనికి వచ్చుచున్నాఁడు" అని వింత నభినయించిరి. "నూదియైవచ్చి దబ్బనమై తేలుట యెఱుఁగరా" యని కుమారస్వామి ప్రత్యుత్తరమిచ్చెను.

రాజాజ్ఞవలన భీమారెడ్డి నూర్గురు రౌతులను, బదార్గుఱు బోయీల పల్లకీని సిద్ధముచేయించుటకుఁ బోయెను. మాధవశర్మగృహిణి రాణిని లోనికిఁ గొనిపోయెను.

వెంకమ్మ వడ్డించుచుండఁగాఁ గుమారస్వామియు జానకీరుక్మిణులు నొక మాఱుగ భోజనము ప్రారంభించిరి. ఇట్లుండఁగా శచీదేవి వచ్చి "అన్నయ్యా! అక్క కాన్పించెనా" యని యడిగి యావురుమని యేడువసాగెను. జానకీరుక్మిణులకుఁగూడ మఱలఁ గన్నులనీరు తిరిగెను. "తల్లీ, చూచివచ్చితి"నని చెప్పి కుమారస్వామి గూడ మాట్లాడఁజాలక పోయెను.

## 24

క్షణములో భోజనముచేసి కుమారస్వామి యివ్వాలకు వచ్చెను. అంతవేగముగ నాతఁ డెప్పుడును భుజించి యెఱుఁగఁడు. జానకీరుక్మిణులకుఁగూడ సరిగ భోజనము రుచింపలేదు. యోధవేష మలవఱిచికొని తాంబూలసేవఁ జేయుచువచ్చిన కుమారస్వామినిజూచి వింతపడి రాజు "కడుపార భోజనమైనదా?" యని యడిగెను. "ఏక్షణమున రాధాదేవి యపహృతయైనదని తెలిసినదో యాక్షణము మొదలు మాకెవ్వరికిని భోజనము రుచింపలేదు. కంటికినిద్ర రాలేదు. అట్టిస్థితిలోనున్న నాకు

కిటికీయూచల వెనుకనున్న రాధ మొగము రావి చెట్టు మీఁదినుండి చూచి నప్పుడే కడుపునిండిపోయినది. ఇఁక నీపదార్థములు భుజించుట కవకాశమేది" యని కుమార స్వామి ప్రత్యుత్తరము చెప్పెను.

ఇంతలో భీమారెడ్డి సూర్గురు రాతులను, బదార్గురు బోయీలతో డిపల్లకిని గొనివచ్చెను. తోడనే రాజు బోయీలను జూచి "మీకును, రాతులకును సాహ చర్యము తటస్థింపదు. మీరు చేతనైనంత నేగముగఁ బోయి నదురుబాడా చెఱువుగట్టుమీఁద నిలు వుఁడు" అని యాజ్ఞాపించిచెప్పెను. రాజట్లు చెప్పుచుం డఁగా రుక్మిణి రాణితో నేమో మాట్లాడెను. తోడనే రాణి "పట్టివల్లకీ పంపుటగాదు. రాధాదేవినిఁ దీసికొని వచ్చుటకు రుక్మిణి వెళ్ళెదననుచున్నది." యని చెప్పెను. అందుల కెల్లరు నామోదించి బాగుగనున్నదనిరి. రాజు "భర్త కనిపెట్టివచ్చెను భార్య తీసికొనివచ్చును. ఇందు వింతయేమున్న" దని నవ్వుచుఁ బలికెను. రుక్మిణి రాణి భుజముపైఁ దన శిరము నానుకొని "అక్కా! నే నెట్టి వేషమును వేయకయే మావదినెను దీసికొనిరాఁగల" నని చెప్పి యూరకుండెను. అందుల కందఱును "మంచి గడుసుదనమే" యని నవ్విరి. భట్టాచార్యుఁడు స్వర్గా రోహణము గావించినది మొదలుకొని—విశేషించి

రాధాపహరణమైనదిమొదలు నవ్వన నెట్టిదోయెఱుఁగని ప్రసాదరాయని ముఖముగూడ నీషత్ప్రఫుల్లమయ్యెను. అప్పుడు కుమారస్వామి రాణినిఁ జూచి "అమ్మా! విధాత తాను పురుషుఁడయ్యు స్త్రీలకంత చాతుర్యము నేల ఘటించెనో తెలియదు. కార్యసాధనమునఁ బురుషు లనుభవించు శ్రమ యంతయు స్త్రీలనోట వెడలు నొక్క చిన్ని మాటవలన నైపులేకుండఁబోవు" ననియెను. "ఔను బాబూ నీవు నిజమే చెప్పితివోయి" యని రాణి పలుకమఱల నందఱును నవ్విరి. అప్పుడు జానకి కన్నులు త్రిప్పుకొనుచు రాణిఁజూచి "అక్కా! బిచ్చగానికిగూడఁ జాతుర్యమును గూర్చినచో విధాత నాఁడే పేరులేకుండఁ బోయియుండు" నని కుమారస్వామి దెసఁజూచి మందహాసము గావించెను. మఱల నందఱును నవ్విరి. కుమారస్వామి పూర్తిగఁ బరాజితుఁడై యేమియు మాట్లాడఁజాలక పోయెను.

అది గ్రహించి రాణి తటాలున "అవును. ఈప్రస్తావనతోఁ గూర్చుండిన నెట్లు? తల్లీ! నీవుపోయి పల్లకిలోఁ గూరుచుండు" మని వెనుకనున్న రుక్మిణిని ముందునకుఁ దీసెను. తోడనే రుక్మిణి పైటసవరించుకొని గజగమనయై బయలుదేఱెను. కుమారస్వామి ముందుగ వీధిలోనికిఁబోయి రుక్మిణి పల్లకిలోఁగూర్చుండుటకుఁ దగిన

యేర్పాట్లు గావించెను. భీమారెడ్డి పల్లకితో వచ్చిన శ్లేంబండ్రాశ్వికులను నియమించెను. రాజాజ్ఞవలన యువరాజును, మహేంద్రుఁడును క్షణములోఁ బ్రయాణమై వచ్చిరి. ప్రసాదరాయఁడు కోరకపూర్వమే రాజాతనిం జూచి "బాబూ! నీవు పోవలసిన పనిలేదు. మన మిక్కడనే యుందము. రాధాదేవిని నీవచ్చుటజూచుట మంచిదిగా" దని వారించెను. తోడనే పల్లకీ బయలుదేఱెను. వెంటబయలుదేఱిన యాశ్వికులకు మహేంద్రుఁడును, భీమారెడ్డియు నాయకులై ముందు వెనుకల నడువసాగిరి. కుమారస్వామియుఁ గుమార మహీపతియుఁ దక్కిన యాశ్వికులనుగొని ముందుపోయిరి. జానకి, రాణి, శచి మున్నగు స్త్రీలు లోనికిఁబోయిరి. ప్రసాదరాయఁడు సంక్షుభితహృదయుఁడై రాజాజ్ఞనుబడసి శయ్యనాశ్రయించెను. రాజు మాధవశర్మ వెంటరా, తానాకుఁబోయెను. రాధతండ్రి కుమారస్వామి వెంట సశ్వారూఢుఁడై వెడలెను.

ధావనవేగమునఁ గుమారస్వామి యాధిపత్యముక్రింద నడచిన రౌతులు ముందు సదురుబాదా చేరుకొనిరి. ఉన్నట్లుండఁగా మిట్టమధ్యాహ్నము కుమారస్వామియు, యువరాజును గుఱ్ఱపురౌతులను వెంటఁబెట్టుకొనివచ్చుటఁ జూచి రచ్చనావిడిమీఁది కర్షకు లందఱును మిగులవింత

పడిరి. ఆశ్వికులు తమ కెదుటనున్న పెద్దయింటిని ముట్టడించుట చూచి వారు తెల్లవోయిరి. వారిలో నొకఁడు పోయి గుఱ్ఱుపట్టి నిద్రించుచున్న పెద్దకాఁపునులేపి యీ సంగతి యంతయుఁ దెలిపెను. తోడనే యాతఁడు "యేమి కొంపమునిగెనో" యని భయపడుచు నొంటి చేతి కోడుగుముడుగు తగిలించుకొని, శిరమునకుఁ బెద్ద పాగా యలంకరించుకొని, అంగరఖాబొత్తాములు తగిలించుకొనుచు గుండెలవియఁ బరుగు పరుగునవచ్చి వీధిలో నిలిచియున్న యువరాజునకును, కుమారస్వామికిని మ్రొక్కెను. అప్పుడు కుమారస్వామి రూక్షేక్షణుఁడై "నీవు దురంతకుల కాశ్రయమిచ్చి రాజద్రోహము చేయుచున్నావు. కొలఁదిదినములలో నీవు రాజసభలో విచారింపఁబడెద"వని పలికెను. అదివిని గజగజ వడఁకుచుఁ బెద్దకాఁపు "నాతలకాయతీసివేయుఁడు మహాప్రభూ నా తాత తండ్రులనాఁడనుండియు భయభక్తులతో నేను దివాణమును గొలుచుచున్నాను. ఎప్పుడును రాజతిరస్కారముగాని, రాజద్రోహముఁగాని చేసియెఱుఁగను. దురంతకులను బట్టుకొని యప్పగించి దివాణము వలన మర్యాద వడయవలయునని విశ్వప్రయత్నములు చేయుచున్నాను ప్రభూ, ఈటంటువిషయమై మీరన్యథా తలంపవలదు" అని మనవి చేసికొని కుమారస్వామియొక్కయు, యువరాజు

యొక్కయుఁ బదములఁ నంటెను. కుమారస్వామి తల యూఁచి యూరకుండెను.

అంతకుముందే రౌతులఁ గొందఱు గుఱ్ఱములుదిగి కుమారస్వామి యాజ్ఞచొప్పున నాదివాణపుఁదలుపులు తన్ని బ్రద్దలుకొట్టసాగిరి. అది చూచి పెద్దకాఁపు "ఇదం తయు నేమిప్రభూ, ఈనౌకరున కాజ్ఞాపింపుఁడు. ఏమి చేయుమనినను క్షణములో సాధించెద" నని వేఁడుకొనెను. అందులకుఁ గుమారస్వామి మఱలఁదలయూఁచి "మీ నమురుబాదావారియొక్కయు, నీయొక్కయు రాజభక్తిని గన్నులారఁ జూచెద వుండు" మని చెప్పి "తన్నుఁడు. ఇంక నెంతసే" పని రౌతులకు మఱల నాజ్ఞాపించెను. పెద్దకాఁపుగుండెలు తటతటఁ గొట్టుకొనసాగెను. ఆతఁడు నేఁటితోఁ దనమర్యాద నాశనమైపోయెననియు, నెవరో యేదో ద్రోహముచేసి తనమీఁదఁ దోర్లించి రనియు నిఁక దన తల యెగిరిపోవు ననియుఁ దలంచి గడగడ వడఁకిపోసాగెను.

నాలుగైదుసారులు తలుపులు తట్టునప్పటికి లోపల నుండి "యెవరా మోటుపశువులు? వచ్చుచుండఁగనే తలుపుల్నిట్లు బ్రద్దలుకొట్టెద రేల?" యను నొక ధ్వని వినవచ్చెను. ఆధ్వనివెంటనే తలుపులు తెఱువఁబడెను. గుమ్మమున కెదురుగా సోమమ్మ నిలిచియుండెను.

తోడనే కుమారస్వామి "పట్టుకొనుఁడు. ఆలంకిణిని బంధింపుఁ" డని యఱచి కోటాలున గుఱ్ఱము దిగెను. కుమారస్వామిని భటులను జూచిన వెంటనే తెల్లవోయిన సోమమ్మ భటులు పట్టుకొనిన వెంటనే యవశమైపోయెను. తోడనే కుమారస్వామి లోనికి బయలు దేఱెను. యువరాజుగూడ గుఱ్ఱముదిగి వెంట బయలుదేఱెను. రాధ తండ్రియు లోనికరిగెను. చెంతనున్న యొక రౌతువలన సంగతి కొంతవఱకుఁ దెలిసికొని యడిలిపోవుచు వెను వెంటఁ బెద్దరాంపుగూడ బయలుదేఱెను.

అప్పటికప్పుడే మహేంద్రుని రక్షణముక్రింద బయలు దేఱినపల్లకీ వచ్చిచేరుకొనియెను. పల్లకి క్రిందదింపఁబడిన వెంటనే మహేంద్రుని చేతి నవలంబము చేసికొని రుక్మిణి క్రిందికిదిగి లోపలకు బయలుదేఱెను. కుమారస్వామి రాధయున్న గదివద్దకుఁ బోవునప్పటికిఁ దలుపులు మూయఁబడియుండెను; గాని తాఁకినవెంటనే వీడి పోయెను. అప్పటికివిచారభరమ్మునఁ గనుపు చుమ్మలు చుట్టుకొని పోవుచుండుటచే రాధాదేవి ప్రపంచమెఱుఁగక మంచముమీఁద గూర్చుండియుండెను; గాని కుమార స్వామినిఁ జూచినవెంటనే దిగ్గనలేచి గొల్లున నేడ్వఁ జొచ్చెను. కుమారస్వామి యామె నోదార్చి "తల్లీ, నీ కొఱకనేక ప్రయత్నములు చేసితిమి. కొమ్మదాసరినై

యొక్కయుఁ బదములు నంటెను. కుమారస్వామి తల యూఁచి యూరకుండెను.

అంతకుముందే రాతుఁగొందఱు గుఱ్ఱములుదిగి కుమారస్వామి యాజ్ఞచొప్పున నాదివారణపుఁదలుపులు తన్ని బ్రద్దలుకొట్టసాగిరి. అది చూచి పెద్దకాఁపు "ఇదం తయు నేమి ప్రభూ, ఈనౌకరున కాజ్ఞాపింపుఁడు. ఏమి చేయుమనినను క్షణములో సాధించెద" నని వేఁడుకొనెను. అందులకుఁ గుమారస్వామి మఱలఁదలయూఁచి "మీ నదురుబాటా వారియొక్కయు, నీయొక్కయు రాజభక్తిని గన్నులారఁ జూచెద వుండు" మని చెప్పి "తన్నుఁడు. ఇంక నెంతసే" పని రాతులకు మఱల నాజ్ఞాపించెను. పెద్దకాఁపుగుండెలు తటతటఁ గొట్టుకొనసాగెను. ఆతఁడు నేఁటితోఁ దనమర్యాద నాశనమైపోయెననియు, నెవరో యేదో ద్రోహముచేసి తనమీఁదఁ దోర్లించి రనియు నిఁక దన తల యెగిరిపోవు ననియుఁ దలంచి గడగడ వడఁకిపోసాగెను.

నాలుగైదుసారులు తలుపులు తట్టునప్పటికి లోపల నుండి "యెవరామోటుపశువులు ! వచ్చుచుండఁగనే తలుపులన్ని బ్రద్దలుకొట్టెద రేల !" యను నొక ధ్వని వినవచ్చెను. ఆధ్వనివెంటనే తలుపులు తెఱువఁబడెను. గుమ్మమున కెదురుగా సోమమ్మ నిలిచియుండెను.

తోడనే కుమారస్వామి "పట్టుకొనుఁడు. ఆలంకిణిని బంధింపుఁ" డని యఱచి కోటాలున గుఱ్ఱము దిగెను. కుమారస్వామిని భటులను జూచిన వెంటనే తెల్లవోయిన సోమమ్మ భటులు పట్టుకొనిన వెంటనే యవశయైపోయెను. తోడనే కుమారస్వామి లోనికి బయలుదేఱెను. యువరాజుగూడ గుఱ్ఱముదిగి వెంట బయలుదేఱెను. రాధ తండ్రియు లోనికరిగెను. చెంతనున్న యొక కాతువలన సంగతి కొంతవఱకుఁ దెలిసికొని యడిలిపోవుచు వెను వెంటఁ బెద్దకాఁపుగూడ బయలుదేఱెను.

అప్పటికప్పుడే మహేంద్రుని రక్షణముక్రింద బయలుదేఱినపల్లకీ వచ్చిచేరుకొనియెను. పల్లకి క్రిందదింపఁబడిన వెంటనే మహేంద్రుని చేతి నవలంబము చేసికొని రుక్మిణి క్రిందికిదిగి లోపలకు బయలుదేఱెను. కుమారస్వామి రాధయున్న గదివద్దకుఁ బోవునప్పటికిఁ దలుపులు మూయఁబడియుండెను; గాని తాఁకినవెంటనే వీడిపోయెను. అప్పటికివిచారభరమ్మునఁ గనుపు చుమ్మలు చుట్టుకొని పోవుచుండుటచే రాధాదేవి ప్రపంచమెఱుఁగక మంచముమీఁద గూర్చుచుండియుండెను; గాని కుమారస్వామినిఁ జూచినవెంటనే దిగ్గనలేచి గొల్లున నేడ్వఁ జొచ్చెను. కుమారస్వామి యామె నోదార్చి "తల్లీ, నీ కొఱకనేక ప్రయత్నములు చేసితిమి. కొమ్మదాసరినై

నిన్ను జెట్టుమీఁద నుండి చూచితిని. భిక్షుకుఁడనై నీవు లక్షితవైతివని సూచించితిని. ఇప్పుడు నిన్ను స్వస్థలము చేర్చుటకు వచ్చితిని'' అనియెను. అప్పుడు రాధ కొంచెము విచారము మాని పైటచెఱఁగుతోఁ గన్నులుతుడుచుకొనుచు "అన్నా! నీవు నాకొఱకు కొమ్మదాసరివై చెట్టెక్కుటయు నెఱుఁగుదును. భిక్షుకుఁడవై పాటలుపాడుటయు నెఱుఁగుదును'' అని చెప్పుచుండఁగాఁ బ్రక్కన నిలిచియున్న యువరా జెదుటకు వచ్చి "తల్లీ! ఇఁక విచారింపవలదు. దైవానుగ్రహము వలన నంతయు శుభముగ బరిణమించిన'' దని పలికెను. ఇంతలో రాధతండ్రి లోనికివచ్చెను. తోడనే యామె తండ్రిపైఁబడి రోదనము సేయఁ బ్రారంభించెను. పదినిముసములు తండ్రియుఁగూఁతురు వగచుటలోఁ గడచిపోయెను. అప్పు డశ్రువులు తడబడుచుండ మహేంద్రుని చేయూత కొనివచ్చిన రుక్మిణి తటాలున రాధను గౌఁగిలించుకొని "తల్లీ బ్రతికియుంటివా?'' యని దుఃఖింపఁజొచ్చెను. రాధకు నోట మాట రాలేదు. ఆమె గూడ నేడ్చుట ప్రారంభించెను.

ఇట్లొక పదినిముసములు గడచిపోయెను. అప్పుడు కుమారస్వామి "తల్లీ, ఇఁక నేడ్చుట యెందులకు? మా యదృష్టమువలన నీవు రక్షితవైతివి. వీధిలోఁ బల్లకి సిద్ధ

ముగానున్నది. నీమీఁదనే ప్రాణములు పెట్టుకొనియున్న మాబావ ప్రసాదరాయఁడు నీవుదొరికితివను సుఖాంత వలన నిన్నుఁజూచునంతదనుకఁ దాళఁజాలక క్షణమొక మహాయుగముగా గడుపుచున్నాఁడు. తల్లీ! పులిబూరు వెళ్లెదము ర"మ్మని రాధను బిలిచెను. రుక్మిణిగూడ నట్లే చెప్పెను. మఱియు నామె "నిన్నుజూచునంతదనుక మాప్రాణములు నిలువవని గాని చెప్పుచున్న" దనియుఁ జెప్పెను. అప్పటికిని రాధ మాట్లాడలేదు. అప్పు డామె తండ్రి ప్రేమతోఁ జేయిపట్టుకొని "అమ్మా! ఇంకెందులకుఁ జూచెదవు. పులిబూరులో క్షణమొక మహాయుగమువలెనున్న"దని పలికెను. రాధకుఁ బట్టరాని దుఃఖము వచ్చెను. వెంటనే యామె వెక్కివెక్కి యేడ్చుచు "తండ్రీ! నేను దురంతకులచే నపహృతనై పోయితిని. రెండుదినము లన్యగ్రామమునఁ బరులయింట నసహాయనై యుంటిని. నాయనా, నిజము చెప్పుము. నాసతీత్వము నీటఁగలుపఁబడినదనియు, నే నుభయకులములకును గాళరాత్రినై తిననియు, నధఃపతితనై పోయితిననియు లోకము చెప్పుకొనుటలేదా? నేనికఁ బులిబూరు వచ్చి దేవీస్వరూపిణులగు జానకికి, రాణికి మాపిన్నికి నింకను దక్కిన పులిబూరురమణీమణులకును నా మొగమెట్లు చూపఁగలను? అంతకంటె నిప్పుడే నేను ప్రాణ

హాలను కోరంగుట లగ్గు గాదా?" యని పలికెను. ఈ మాటలెల్ల రకును శూలములవలె నాటెను. వారందఱును గూడ నేకకంఠముగ "అమ్మా, అట్లు పలుకవలదు. నీకా విచార మక్కఱలేదు. నీసతీత్వ మెప్పటికిని నిందితము కాఁజాలదు. లోకమంతయు నిన్ను బూజించుచున్నది. నీకుఁ బట్టించిన దురవస్థ కందఱును వగచుచున్నారు. హరిహర బ్రహ్మాదులుగూడ నీసతీత్వమునకు భంగము కలిగింపఁజాలరని యెల్లరును నీప్రభావమును నుతించు చున్నారు. శత్రువులుగూడ నిట్లు చెప్పుచున్నారు" అని యామె నూరడించిరి. "వదినే, నీ వట్లనవలదు. నీమాటలు విన్న నాహృదయము బ్రద్దలై పోవుచున్నది. నీవు కటాక్షింపవేని మాగృహ మంతయు నాశనమైపోవు" నని చెప్పుచు రుక్మిణి యామె నెంతో బతిమాలెను. అనంతమగు విచారార్ణవమును దరింపలేక రాధ యెట్లో రుక్మిణిభుజము నానుకొని పల్లకీలోనికి వచ్చి కూర్చుండెను.

పిదప రుక్మిణి యెక్కెను. రుక్మిణి పల్లకీతలుపులు మూయుచుండఁగా రాధ కుమారస్వామినిఁ బిలిచి "అన్నా, ఈయింటనున్న సోమమ్మగారిని బంధించుట మీకని నాగ్యమని [illegible]చున్నది. అయిన నామె నగౌరవము చేయవలదని ప్రార్థించుచున్నాను. ఆమె నాకుఁ దల్లివలె సంరక్షణము చేసినది. ఆమెనుగూడఁ

పల్లకీలోఁ గూర్చుండఁ బెట్టి తీసికొనిరం" డని చెప్పెను. కుమారస్వామి పల్లకి నేర్పాటు చేయింపుమని పెద్దకాఁపునకు నియమించెను. మఱిపదినిముసములలో రెండవ పల్లకి వచ్చెను. సోమమ్మ నందు గూర్చుండ నియమించి కుమారస్వామి ప్రయాణము సాగించెను.

## 25

ఆశ్వికులువచ్చి దిక్కులేని దివాణమును ముట్టడించినప్పటే యా కల్లోలమంతయు నదురుబాదా నలుమూలల నాబాలగోపాలముగఁ దెలిసిపోయెను; గాని దానిగుఱించి యెవ్వరును బహిరంగముగఁ జెప్పుకొనుటకు సాహసింపఁ జాలరైరి. ఆశ్వికులు మఱలఁ జెరువుదాటిన వెంటనే యెల్లరకును వాక్స్వాతంత్ర్యము కలిగెను. పిదప, జరిగిన సంగతిని గుఱించి కొందఱు వింతపడిరి. కొందఱు తహతహపడిరి. మఱికొందఱు గజగజలాడిరి. వేఱొకకొందఱులికిపడిరి. ఇంకొకకొందఱు వడవడవడఁకిరి. కొన్ని వీథులలోఁ బురుషులు, కొన్నివీథులలో స్త్రీలు, నడుమ నడుమ యువకులు మొత్తముమీఁద నూహాశక్తిగల వారెల్లరును జరిగిపోయిన దానిని గుఱించి ప్రస్తావనలు ప్రారంభించిరి. స్త్రీలలో దీర్ఘములును బురుషులలో నూఁతపదములును అంతకంతకుఁ బెరిగిపోసాగెను. కొంద

అనేక వేలభటులుగల రాజుగారినే యిట్లు గికురించు చున్న భుజంగరాయనిఁ బ్రశంసింపఁజొచ్చిరి. కొందఱంత యూరిలో మూఁడవకంటి వానికిఁ దెలియకుండ నామహా పతివ్రతను దాఁచిన సోమమ్మ చాతుర్యమును గొని యాడఁగడఁగిరి. వెంటనే మఱికొందఱు "మొదటినుం డియు సోమమ్మ కిట్టి దరిద్రపుగుణములే యున్నవి. కావు ననే కాపురమునకు వచ్చినపుడు రాణి యనిపించుకొనిన యామె నేఁడు పెద్దమ్మ మైపోయిన" దని ప్రత్యుత్తర మిచ్చిరి. మఱికొందఱు ముందునకువచ్చి "అవునుగాని; తాణేదారుగారి రాణి యువతిగదా? ఇంట మూఁడవ వారెవరును లేరుగదా? ఆమె సోమమ్మ నేల జయింపలేక పోయినది? అథవా; వీథిలోని నలువురకును వినఁబడు నట్లుల కేకలు పెట్టకపోయినది?" అనిరి. ఈప్రశ్న పూర్తి కాకపూర్వమే దత్తోత్తర మైపోయెను. "ఆమె మానవతి. ఆమె యేకారణమువలన నట్లు చేయలేదో మనకుఁ దెలి యదు; గాని యీమాత్రపు టాలోచన మాయామెకుఁ దోఁచియుండకపో" దని కొందఱు జవాబు చెప్పిరి. తుదకుఁ గొందఱు "సోమమ్మకుఁ గఠినశిక్ష తప్ప" దనిరి. "అట్లయిన నామెను తాణాకుఁ బల్లకీలో నేలకొనిపోయి" రని కొందఱు దానిసిఁ బూర్వపక్షము చేసిరి. ఈవివా దము చాలఁ దీవ్రముగఁ బెఱిగిపోయెను.

పిదప వారందఱయోచనలు నవమాంతముగఁ బెద్ద కాఁపు మీఁదికిఁ బోయెను. ఎల్లరు నాతని కంగారుకలం చుకొని మొట్టమొదటఁ బకపకనవ్వి యంతటితో సుహో ద్ఘాతము ముగించిరి. ఒక వృద్ధుఁడు చేతిలోని కఱ్ఱ గాను కొని నిలిచి " ఈపర్యాయము పెద్దకాఁపునకు శిక్షతప్ప " దనియెను. అందులకు సహింపఁజాలక మఱియొకవృద్ధుఁడు ముందునకువచ్చి "అది యెప్పటికిని సంభవింపదు ఇందుఁ బెద్దకాఁపుదోస మేమియులేదు. నిజముగా నిప్పుడు పెద్ద కాఁపును శిక్షించుటకంటె నన్యాయము వేఱొకటియుండ" దనియెను. వేఱొక వృద్ధుఁడు తటాలున నందుకొని " మీరు పెద్దకాఁపును గుఱించిమాత్రమే గోలవేసెదరేల? నేఁటితో నదురుబాదా నేలమట్టమగును. తనపక్షమున కింతటి పోరాటము సంభవించుటవలనను, బెద్దకాపు అనిన మాటలవలనను, భుజంగరాయఁడు మనయూరుగూడఁ గొల్లకొట్టక మానఁడు. మనము దురంతములలోఁ గలిసితి మని సందేహించియు, నంతకులుచేయు దుష్కృత్య ముల కడ్డుపడుటకును, మనయూరుగూడ రెండుమూఁడు వందల రాజభటులువచ్చి బగ్గంపాడు చేయకమానరు. మొత్తముమీఁద నిప్పు డేకర్మము నెఱుఁగనిమనపాపము పండిన " దని యంగలార్చెను. దీనిమీఁద వాదోపవాద ములు పెరిగిపోయెను. ఎవరికిఁ దోఁచినట్లు వారుచెప్పిరి.

ఒకరిమాట యొకరికి నచ్చలేదు. అంతయు బహునాయక ముగా నుండెను. అందఱు నేకముఖమునకుఁ గొనిరాఁగల పెద్దకాఁపు గుండెబెదరుతోఁ బులిబూరునకుఁ బోయి యుండెను. ఇఁక వారిలో నెవరి ఘనత నెవ రంగీక రింతురు ?

# 26

ఆశ్వికులు నదుగుబాదావిడిచిన రెండుగడియలకు మహో త్సాహపూరితములగు బోయీల యోంకారధ్వనులతోఁ బులిబూరు ప్రతిధ్వనించెను. గ్రామమునందలి కన్నులు గలవారెల్లరును వీధులలోనిండిపోయిరి. రక్షితయైవచ్చిన రాధాదేవినిఁ జూడవలెనని యెల్లరును ముచ్చటపడిరి; గాని పల్లకీతలుపులు మూయఁబడియుండుటవలన నంద ఱకు నాశాభంగము గలిగెను. తుదకుఁ బల్లకినిఁజూచినే బ్రాహ్మణులు మొదలుకొని సమస్తవర్ణములవారును ఆబాలగోపాలముగ "మాకన్నతల్లి మఱల మాయింటికి వచ్చినది. మాపాలిటి శ్రీనసాగరకన్యక మఱల మాకు దర్శనమొసంగినది" యని యానందబాష్పములువిడిచిరి. అందఱును గూడ వెనుకనున్న రెండవపల్లకీలోనివా రెవరా? యని యనుకొనిరి; గాని యెవరికిని సందేహ నివృత్తి గాలేదు.

పల్లకి గుమ్మములో దిగినవెంటనే రుక్మిణి తలుపులు తెఱచి పసిబిడ్డవలెఁ దన యొడిలోఁ దలవంచుకొని పరుండియున్న రాధాదేవిని లేవఁదీసి కూర్చుండఁబెట్టెను. అప్పటికప్పుడే రాణి, జానకి, శచి మున్నగుస్త్రీలు పల్లకి చెంతకువచ్చి నిలిచిరి. రాధ కాలు క్రిందఁబెట్టిన వెంటనే జానకి యామెను గాఁగిలించుకొనియెను. రాణిగూడఁ గాఁగిలించుకొనియెను. తక్కినవారు చుట్టును మూఁగి "మాతల్లీ, వచ్చితివా!" యనియును "మాయమ్మ, బ్రతికియుంటివా" యనియుఁ బ్రశ్నించుచు విచారముతో నామెను లోనికిఁ గొనిపోయిరి. అప్పుడు రాధ దీనాననయై "వదినే! ఈదురదృష్టవతికి జీవితేశ్వరుల పదసందర్శన మగునా" యని రాణిని వేఁడుకొనియెను. వెంటనే రాణి "రాతల్లీ, రా, తమ్ముడు నీనిమిత్తము తపస్సు చేయుచున్నాఁడు. వచ్చియాతని ననుగ్రహింపు" మని చేయిపట్టుకొని లోపలకుఁ దీసికొనిపోయెను. జానకి రుక్మిణి మున్నగువా రొకటి రెండడుగులు వెంటనంటిరి; గాని మఱల నంతలో నేకారణమువలననో తటాలున వెనుకకు మఱలిరి.

విచారభరమ్మున వివశుఁడై ప్రసాదరాయఁ డన్యమెఱుఁగక శయ్యమీఁద బోరగిలబరుండియుండెను. అక్కారణమున నాతనికి రాధాగమనము తెలియలేదు.

అట్టిస్థితిలోనున్న యాతనిం గాంచి రాధ మిగుల దైన్యముతో "వదినే! నిద్దురగాఁబోలును. ప్రాణేశ్వరుఁడు నాతో నిఁక మాట్లాడునా?" యని రాణితో ననియెను. రాణి ప్రత్యుత్తరము చెప్పుచుండఁగా ప్రసాదరాయఁడు ప్రబోధితుఁడై శిరమెత్తి చూచెను. ఆతనికనులలోఁబొంగి వచ్చుచున్న బాష్పజలమునకు వెనుక నాత్రము తొణకులాడుచుండెను. అదిగని పెట్టి రాణి తటాలున నివ్వలకు వచ్చెను. నిరవలంబయై రాధ భూమిపై గూలఁబడెను; గాని యంతలో నామె నాధుని భుజపంజరమునఁ జిక్కుకొనియెను. ఆభార్యాభర్త లిరువురు నతిదీనముగ వగవసాగిరి. కన్నీటిప్రవాహమున కడ్డులేదయ్యెను. "నాప్రాణమా, వచ్చితివా! నేను దార్భాగ్యోపహతుఁడను. ఇఁక నీజన్మమున నీదర్శనము గలుగదని తలంచితిని. ప్రియా, నిన్ను రక్షింపఁజాలకపోయితిని. నిన్నొకరుఁ డపహరించుకొనిపోఁగా నింకను మేనఁ బ్రాణములు దాల్చియుంటిని. నన్ను మన్నింతువా? ఈమానహీనుని దఱిఁజేరనిత్తువా?" యని పలుకుచు నాతఁ డామెను ముద్దులపూలతోఁబూజించెను. రాధకు విచార మధికమయ్యెను. కొంతవఱ కామె మాట్లాడఁ జాలకపోయెను. కనులుమూఁతపడెను. మఱలఁ జూచునప్పటికిఁ దానుమంచముపైఁ బరుండియుండుటయుఁ, ప్రసాదరాయఁడు క్రిందనిలిచి తత్తరముతోఁ దనదెసఁ

జూచుచుండుటయు నామె తెలిసికొనెను. తోడనే తటా లునఁ గ్రిందికిదిగి భర్తృచరణముల నంటి "నన్ను బర పురుషుఁ డెత్తుకొనిపోయెను. రెండుదినములు వానినిర్బం ధనమున నుంటిని. నాస్థితి భగవంతున కెఱుక. లోకనింద లకుఁ బాత్రనైతిని. ప్రభూ! ఈదాసికి మీహృదయమున స్థలమున్నదా? మఱల నీపరిచారిక యంగీకృత యగునా? నేను కర్కశహృదయ గాకున్న దురంతకులు నన్నిల్లు దాఁటించినపుడే గతప్రాణ నై యుందును. ఇంతియైనను నాహృదయ మింకను మీపదసేవను గాంక్షించుచున్నది. ఈదుండగము సహింపఁబడునా?" యని యామె దీనాతి దీనముగఁ బ్రార్థింపసాగెను. అదిచూడలేక ప్రసాద రాయఁ డామె నాదరముతో లేవనెత్తి గ్రుచ్చి కౌఁగిలించు కొని "దేవీ! నీకు మానభంగము చేయఁగలవాఁ డెవఁడు? నీయెడల ననుమానపడితినేని తక్షణమే నాశిరస్సు వక్క లై పోవును. నీసతీత్వమే నాజీవనాధారము. నాసర్వస్వ మును నీకనుఁగొలఁకులఁ దొలఁకులాడుచున్నది. ప్రియా! నాలజ్జను బోఁగొట్టుటకును, నావిచారముడుపుటకును నీవిట్లనుచున్నావు. నిజము చెప్పుము. నీచెంత నిలుచు టకైన నాకర్హత గలదా? నీవు నాపాలిటి రాజ్యలక్ష్మివి. నేను నీకుఁ దగినరాజనుకా" నని యాతఁ డామెనోదార్చి ప్రియమార ముద్దిడుకొనియెను. ఇరువురును క్షణకాల

మానందాతిరేకముచే మైమఱచిరి. పిదపఁ బ్రసాదరా యఁడు "దేవీ, నిన్నుఁజూచుకొనుటకు నీయందే ప్రాణములు నిలుపుకొనియున్న జానకియు, శచియు, విశేషించి రాణియు వేచియుండుదురు. రమ్మని చేయిపట్టుకొని యిల్లా లకుఁ దోడుకొనివచ్చెను. అంగణమున నెదురుగఁ గుమా రస్వామి నిలిచియుండెను. తోడనే ప్రసాదరాయఁ డాతని నదాటున గౌఁగిలించుకొని "బావా, వేయరాని వేస ములువేసి పడరాని పాట్లుపడి నాయర్ధాంగలక్ష్మినిఁ గొనివచ్చితివి. నీఋణము నెట్లు తీర్చుకొందు" నని యంగ లార్చెను. కుమారస్వామి యాతనికన్నులు తుడిచి గద్గద కంఠుడై "నేనుచేసిన దేమియు లేదు. మాతల్లిని వెదకి తెచ్చుకొంటి" నని తాను గూడఁ గన్నుల నీరుతెచ్చు కొనియెను. అందఱును గుమారస్వామినిఁ బొగడిరి. పిదప రాధ కుమారస్వామి పదములను బాష్పములతో గడిగెను. ఎల్లరు నామె నూరడించిరి.

శచి యదేపనిగ రాధదెసకు దీనదృష్టులు పరుపసా గెను. అది గ్రహించి రాధ చేతులుసాచి "రాతల్లీ, రా. మఱల నిన్ను జూచెద ననుకోలే" దని మఱలఁ గన్నుల నీరు తెచ్చుకొనియెను. తోడనే శచివచ్చి యామెను గౌఁగిలించుకొనియెను. క్షణములో నామె నందఱు నోదార్చిరి. పిదప రాణి మున్నగువా రెల్లరు రాధ

చుట్టును జేరిరి. అప్పుడు రాధ సోమమ్మ తనయెడలఁ జూపిన సౌజన్యము నంతను జెప్పెను. అందఱు నామె యెడల గౌరవభావము వహించిరి. ఈప్రస్తావనవలన రాధ నిరాహారయై యున్నదని యెల్లరకును దెలిసెను. జానకియు రుక్మిణియు, బతిమాలి యామెను లోనికిఁ గొని పోయి మంగళస్నానముగావించి భుజింపఁజేసిరి. ఆమెను జూచిపోవుటకు వచ్చిన స్త్రీప్రవాహము కట్టతెగి యంగణమునఁ బ్రవేశించెను. రాధ తొలుత వారినిఁ జూచుటకు లజ్జించెను; గాని తుదకుఁ దప్పినదిగాదు.

## 27

"హృదయేశ్వరునిచేఁ బరిగ్రహీతనగుదునా కానా" యను విచారము సమూలముగ నున్మూలితమైపోయెను; గాని యంతమాత్రమున రాధముఖమునఁ దొల్లిటి తేజ మంకితము కాలేదు. దైన్యము రవంతైన దొలఁగిపోకుండ నట్లేయుండెను. అంతకంటెను దీవ్రమగు నూత్న విచారము హృదయమునఁ బాదుకొనియెను.

సీతామహాదేవి కేవలము మహాలక్ష్మి. శ్రీరామచంద్రుఁడుగూడఁ గేవలము శ్రీమన్నారాయణుఁడు. కలంకము వారిప్రాంతములకే చేరఁజాలదు. అయినను అపహృతయై శత్రునింటనుండుటవలన నా సాధ్వీమణి

సతీత్వమును గుఱించి క్షుద్రరజకులలోఁగూడ వాదోప వాదములు పెరిగెను; రాజ కుటుంబములో నెవ్వారికి నాయనుమానమే గలుగలేదు; గాని లోకము నెవ్వారు మూయఁగలరు! రజకునివంటి ప్రాకృత పురుషునకు జానకీ దేవి యెడలఁ దీర్చుకొనవలసిన పగయేమియు లేదు. అయినను దుశ్చింతతోఁ దీసికొనిపోయిన రావణుఁడు సీతను బలవంతముచేసి యుండునని వాని సంకుచితచిత్త మున ననుమానముకలుగుటలో వింతలేదు. అట్లే తన్ను గుఱించిగూడ లోకులలో వాదోపవాదములు పెరుగ కుండవని రాధ విషాదము.

దీని నెవరు తీర్పఁగలరు? రాధాదేవివంటి సాధ్వీమణి కిట్టి యనుమానము కలుగుటలో నాశ్చర్యమును, ఈబడ బానల మామె కోమలహృదయమును దహించివేయు టలో సందేహమును లేదు. అయిన నీసందేహోన్మూల నము గావించుటకు నిశ్శంకతో మఱల రాధాదేవిని శిరసావహించిన ప్రసాదరాయునికి మాత్రము శక్తి యెక్కడిది?

మఱునాఁడు రాణి రాధాదేవి ముఖముగాంచి సందే హించి రహస్యముగఁ గొనిపోయి యావిషయమును తఱచితఱచియడిగెను. తుదకు రాధ తనదైన్యకారణమును జెప్పివేసెను. ఇదివిని చాలవగచి రాణి యిట్లు చెప్పెను.

"భుజంగరాయుఁడు నిన్నెప్పుడైనఁ దాఁకిన ట్లనుమానము గలదా?"

"నేను మత్తుమందువలన నొడలు తెలియక యుండిన ప్పటి సంగతియేమో చెప్పఁజాలను. తరువాత సోమమ్మ నన్ను లోనికిఁ గొనిపోవుట వలనను, ఆమె చెప్పిన మాటలవలనను, బిమ్మట భుజంగరాయుఁడు నాకు సాష్టాంగ మాచరించి చేసిన ప్రార్థనము వలనను, అతఁడు నన్ను స్పృశించుటకుఁ బ్రమాదవశమున నైనఁ బ్రయత్నించి నట్లు తోఁపదు. నాకుఁ గేవలము లోకులేమనుకొందురో యను ననుమానముదక్క వేఱేమియు లేదు."

"గోలా, అది తగునా? నీహృదయమున కేమియు సంశయము లేనపుడిఁక క్షుద్రజనులకొఱకు కోమలహృదయమును దావానలము పాలుచేసెదవా?"

"కాదు వదినే, సీతాదేవి యంతటి మానవతికిఁగూడ నీపాట్లు తప్పినవిగావు. నాసంగతిచెప్పుట యెందులకు?"

"లోకములో నేమియు నీప్రస్తావనయే లేదు"

"ఇంటఁగూర్చుండి మన మిట్లనుకొనవచ్చునా?"

"గుప్తచారులు దేశమంతయుఁ దిరిగివచ్చి జనులెల్లరును నిన్ను దేవీభావమున గౌరవించుచున్నారని చెప్పుచున్నారు."

"వదినే, అంతమాత్రమున నూఱట యెట్లుగలుగును?"

"బేలా, నిష్కారణముగ నీవు బాధపడుచున్నావు. ఒకటి యోచింపుము. నీవిట్లుండిన మా తమ్మునకుఁ బ్రాణము లెట్లు నిలుచును ?"

"వలదు. వదినే, వలదు. నా కేమియు ననుమానము లేదు. నా జీవితేశ్వరుని పాదసేవఁ జేయుట కెల్లప్పుడును సంసిద్ధనై యున్నాను. వారి మనస్సునకు నావలనఁ గష్టము గలిగిన నేను సహింపలేను."

రాణి మఱల రాధముఖము చూచెను. ఆమెకు రాధహృదయమునఁ గల యనుమాన మంతయుఁ దీఱి పోయినట్లు తోఁచెను. వెంటనే యామె రాధను గౌఁగి లించుకొని "తల్లీ, నీకు విచారమువలదు. అగ్నిహోత్ర మునకుఁ జెదలంటవు. అన్ని విచారములును మఱచి పొమ్ము. మాతమ్మునకు నవశక్తి సంఘటింపుము. దేవి స్వరూపిణీ, అంతయు నీచేతిలో నున్న" దని బుజ్జగించెను.

## 28

సూర్యోదయమగుచుండఁగాఁ బ్రసాదరాయఁడు మున్నగు వారు వీధి యరఁగుమీఁదఁ గూర్చుండి యుండిరి. అప్పుడు దోనెనడపువృద్ధుఁడువచ్చి ప్రసాదరాయని కొక జాబు నిచ్చి "రెండుజాముల రాత్రివేళ నొక బాటసారి కాకి నాడపోవుటకై పడవనిమిత్తము వచ్చితినని చెప్పి నాతోఁ

గూడ దోనెపైఁ బండు కొనెను. నేను తెల్లవాఱినపిదప జూడఁగా నాతఁడు కాన్పింపలేదు; గాని దోనెకీజాబు కట్టబడియున్న" దని చెప్పెను. ఇదివిని యెల్లరు నాశ్చర్య పడిరి. ప్రసాదరాయఁడది దురంతకులపని యనితలంచి జాబుచదువుమని భట్టారకున కిచ్చెను.

"ప్రసాదరాయఁడా,

మానవతియగు నీరాణి నుజల నిన్ను జేరుకొనినందు లకు నే నానందించితిని. నేనామెను హరించుకొనిపోవు టకుఁ గల కారణము లన్నియు నామెతోఁ జెప్పితిని. నదురుబాదాలో నున్న రెండుదినములు నామె పాదపూజ చేసి తరింపవలెనని భావించితిని; గాని బందిపోటుగాం డ్రకు నాయకుఁడని పేరుపడిన నన్నుగాంచి యామె భీతిల్లునని యూరకుంటిని. అట్టి సాధ్వీమతల్లి నర్ధాంగ లక్ష్మిగాఁబడసిన నీవు ధన్యుఁడవు. ఆ దేవీస్వరూపిణి శుభచింతనమే నీకు మోక్షదాయకము. ఆమె నదురు బాదాలో నున్నపు డన్నము ముట్టలేదు. నిద్ర యెఱుఁ గదు. ఆమె యనుభవించిన ఖేదము దేవుఁడెఱుఁగును. ఇట్లగునని తొలుతనే యెఱుఁగుదును. అయినను నిన్ని ప్రయత్నమునుండి మఱలించుటకై రాధాహరణము కారణముకాఁగలదని యందులకు సాహసించితిని. మా తల్లి రాధాదేవి దేవయజనసంభవయగు జానకికంటెను

బరిశుద్ధురాలు. లేనిపోని యనుమానములకుఁ బాలుగాక హృదయమున మఱల నామెకు స్థల మొసంగినందులకు నిన్నభినందించుచున్నాను."

"వీరాధివీరా! మీదంపతుల సౌజన్యము చూచిన పిమ్మట నీతో నింకను బోరవలెనను నుత్సాహము తఱిగి పోయినది. కేవలము నీవుచేయు పనులకుమాత్రమే నేను ప్రతిక్రియలను జేయుచున్నాను. నామేనత్త సోమమ్మను నీవు గౌరవము చేయుచున్నందులకు వందనములు"

"నీయభిప్రాయము ప్రత్యక్షముగఁ దెలియకపోయినను క్రియలవలన విశదమగుచునే యున్నది. కానిమ్ము. ఇట్లు స్వల్పప్రయత్నములతోఁ గాలము గడిపిన నేమగును? నాలుగైదు దినములలో నీజూదమును ముగింతము. ఈ సంగతి నీకుఁ దెలియుటయే యీలేఖ ప్రయోజనము."

ఇట్లు
భు జ ం గ రా యఁ డు

ఇది విని మాధవశర్మాదులు వింతపడిరి. ప్రసాదరాయఁడు తమ్మునిఁ, గుమారస్వామినిఁజూచి "అంతయుఁ దెలిసినదిగదా? మీరు చాల మెలఁకువతో నుండవలెను. సమయు వీరుఁడు మన యెల్లరకంఠములమీఁదను గత్తులఁ నెత్తియున్నాఁడు. ఆయాపదనుండి యెవరు తప్పించుకొనఁ గలరో తెలియదు. మీవిజయము మీచాతుర్యము

నాశ్రయించుకొని యున్నది. సంకుల సమరమునకును, ప్రకృతపు యుద్ధమునకును జాలభేదమున్నది. ఇపుడుప యోగపడునది కేవలము బుద్ధిబలము. అన్యచింతలు మానుడు. ఇట్టి యుద్ధములో మీరు విజయలక్ష్మిని బడయఁగలిగితి రేని వీరలోకము మిమ్ము వినుతించు" నని చెప్పి, జాబును రాజునకుఁ జూపుటకుఁ గుమారస్వామిని వెంటనిడుకొని తాణాకుఁబోయెను. అట రాజు, యువరాజు, ప్రసాదరాయఁడు, కుమారస్వామి, భీమారెడ్డియుఁగలసి అపాయములేని యుపాయము వెదకసాగిరి.

# 29

జాముదాత్రి యయ్యెను. రాజును, ప్రసాదరాయఁడును తాణాకచ్చేరిలోఁ దీవ్రాలోచనమున మునిఁగియుండిరి. వీధియరఁగుపై భీమారెడ్డి యొక భటునితో నేమో ముచ్చటించుచుండెను. ఇట్లుండఁగా వడివడిగ నొక యువకుఁడు సనుదెంచి భీమారెడ్డితో "నేనిప్పుడవశ్య ముగ రాజదర్శనము చేయవలయు" నని చెప్పెను. భీమా రెడ్డి యాతని నెఱింగినవాఁడగుటచే దగిన పని యుండ వచ్చునని భావించి, లోనికిఁబోయివచ్చి సెలవైనదని యాతని నంపివేసెను. ఆతఁడు పులిబూషు [illegible]సి. చంద్ర నారాయణుఁడను నా యువకుఁడు కొంత [illegible]లము భట్టా చార్యునివద్ద రాజనీతి నభ్యసించియుండెను.

చంద్రనారాయణునిఁజూచి ప్రసాదరాయఁడు తొలుత వింతపడెను. పిదప నాదరముతోఁ జేరఁబిలిచి, యాసనముసఁ గూర్చుండ నియమించి యేమో మాట్లాడఁబోయెను. అంతలోఁ జంద్రనారాయణుఁ డందుకొని యిట్లు చెప్పెను. "తమ కార్యాలోచనమునకు విఘ్నము గలిగించినందులకు మన్నింపవలెను. నేనీయూరు వదలి పదిదినములైనది. దురంతకుల వృత్తాంతము దెలిసికొని తమకు విన్నవింపవలెనని మాతమ్ముఁడు మహేశ్వరుఁడును నేనును బయలుదేఱిపోయి వారముదినముల క్రిందట దురంతకులమైతిమి. ఇప్పుడు మాయన్నదమ్ములమిరువురమే భుజంగునికి ముఖ్యసేనాధిపులము. మేము సైనికవ్యవహార నిమగ్నులమై యుండఁగా భుజంగరాయఁడు మాతల్లి రాధాదేవిని హరించుకొని పోయెను. ఆమె మజిల స్వస్థలముచేరినదని విన్నపిదప మాకుఁ బ్రాణములు నిలుపఁబడినవి. నావెంట నేఁబంద్రాశ్వికుల నంపెదరేని నాక్రిందిదురంతకులను ముప్పదుండ్రను మీవశము చేయఁగలను."

ఇదివిని ప్రసాదరాయఁ డాశ్చర్యచకితుఁ డయ్యెను. రాజు వింతపడెను. అప్పుడు ప్రసాదరాయఁడు చంద్రనారాయణుని పూర్వచరిత్రను సూక్ష్మముగఁ జెప్పెను. విద్రోహుల సేనాధిపతి మజిల నిట్లు చెప్పెను. "నేటిరాత్రి

రెండుజాములైన తరువాతఁ దన యేఁబదిమంది యను చరులతోడను వచ్చి మీపైఁబడవలెనని భుజంగరాయఁడు నిశ్చయించెను. అందులకై యాతఁడు తన దండును రెండుభాగములుగా విభజించెను. ముప్పదిమందికి మొనగాఁడనై నేనొక మార్గమున బయలు దేఱితిని. ఇరువదిమందికి మొనగాఁడై మాతమ్ముఁడు మహేశ్వరుఁడువచ్చి మమ్ము గలిసికొనును. భుజంగరాయఁడు రెండవజట్టుతో వచ్చును. నా దండిపుడు పులిబూఁటన కఱకోసుదూరమున అత్తమూరునకును, రామవరమునకును నడుమనున్న అరణ్యములో నుత్తిచెట్టుమీఁద నున్నది. ఇక్కడ మీజాగ్రత్తను బరీక్షించివచ్చెదనని నేను వచ్చితిని.''

``నీవోఁజులోనివా రందఱును గాల్బంటులా'' యని ప్రసాదరాయఁ డడిగెను.

``ఔను. నాకుఁగూడ గుఱ్ఱము లేదు. మాతమ్ముని యాధిపత్యము క్రిందవచ్చు మూఁకమాత్రి మాశ్వికసంఘము.''

``భుజంగరాయఁ డేమార్గమున వచ్చును?''

``అత్తమూరికిఁ బడమటగానున్న రాజమార్గమున వచ్చును.''

``మీప్రధానస్థాన మేది?''

"గోదావరీతీరమున, జన్నవాడకు దక్షిణముగానున్న గవల్లగూడెము."

"గవళ్ళ వాండ్రందఱును మీజట్టులోఁ గలరా?"

"తొలుతఁజేరిరి; గాని వాండ్రలోఁ జాలమంది రామవరమును గొల్లకొట్టినపుడు గాయపడిరి. వాండ్రింకను దేఱికొనలేదు."

అప్పుడు రాజులేచి నిలిచి "ఇఁక నాలోచనవలదు. ఏఁబండ్రాశ్వికులు, ఇరువండ్రు చాకలవాండ్రుగల సేనతో మహేంద్రుఁడును, భీమారెడ్డియుఁ జంద్రనారాయణుని మూఁకను భస్మముచేయుటకుఁ బోవలెను. మఱియేఁబండ్రు కాల్బంటులు, ముప్పదుండ్రు చాకలవాండ్రుగల సేనతోఁ బోయి నీవును నేను భుజంగుని మార్గము నరికట్టుదము. కుమారస్వామియు యువరాజును దక్కిన నూర్గురు రౌతులతోఁ బులిబూరు కాపాడుచుందురు. ఒకవేళ భుజంగుఁడు వేఱొక మార్గమునవచ్చి పులిబూరు ముట్టడింపవచ్చును. అట్లయిన యువరాజును గుమారస్వామియుఁ దమ ప్రభావమును జూపెద" రని పలికి భీమారెడ్డి కంతయుఁదెలిపెను. క్షణములో నన్నియేర్పాటులును జరిగెను. భీమారెడ్డియు మహేంద్రుఁడును జంద్రనారాయణునితోఁ బోయిరి. పిదప రాజు యోధవేషము దాల్చివచ్చి ప్రసాదరాయనిఁ జూచి "యోధవేష మలవ

అచుకొని యెన్నిదినములో యైనది. నేడు భుజంగరా యని కరుణచే నాచంద్రహాసమునకు రక్తాభిషేకము గలుగనున్న" దనియెను. ప్రసాదరాయఁడుగూడ "నేఁడు నాఖడ్గమునకు సంపూర్ణాభిషేక" మని యుప్పొంగెను.

## 30

గమ్యస్థానము పావుకోసుదూరమున నున్నదనఁగా జంద్ర నారాయణుఁడు మహేంద్రాదులతోఁ జెప్పఁగలసిన వన్నియుఁ జెప్పి ముందు వెడలిపోయెను. అతనిచేతిక్రింది దుకంతకు లెల్లరును మఱ్ఱిచెట్టుమీఁదినుండి యాతనికొఱ కెదురుచూచుచుండిరి. ఇంతలోఁ జంద్రనారాయణుఁడు మఱ్ఱిక్రిందకుఁబోయి సంకేతానుసారముగఁ గంఠము సవరించుకొనియెను. తోడనే యందులకు మఱ్ఱిమీఁదనుండి ప్రత్యుత్తరము వచ్చెను. క్షణములోఁ జంద్రనారాయణుఁడు చెట్టునెక్కి తనస్థానమునఁ జేరికొనియెను.

ఇరువురు మహమ్మదీయులువచ్చి చంద్రనారాయణుని చెంతఁ గూరుచుండి వార్త లేమని యడిగిరి. "విశేషము లేమియు లేవు. నిజముగా నేనీరాజు నెదిరించి పోరుచు న్నందులకు సిగ్గుపడుచున్నాను. మన ప్రతి పక్షులలో మనయెత్తున కెత్తు వేయఁగలవాఁ డొక్కండును లేఁడు. కేవలము దైవమును నమ్మియున్నట్లు తోఁచుచున్నది.

రాజుచెంత నొక బ్రాహ్మణుఁడును, ఇరువురు క్షత్రియు లును, ఒక రెడ్డియుఁ బ్రతిపక్షుల మాయలు తెలిసి కొనుటలోఁ జాల బేర్పడినవారు గలరు; గాని వారి తెలివి తేటలుగూడ నిష్ఫలము మసిబాఱిపోయినవి. తలంచు కొనిన నవ్వువచ్చుచున్నది. మనము మధ్యాహ్నము మారేడుబాకలో డాఁగియుంటిమిగదా? ఆసంగతి వారి కట్లో తెలిసినది. మనమింక నచ్చటనే యుంటిమనుకొని ముప్పదిమందిభటులతో భీమారెడ్డి బయలుదేఱుచు న్నాఁడఁట. ఇప్పటి కాతఁడు వచ్చుచునేయుండును. ఆతఁడు తన పౌఁజుతో నీమఱ్ఱిక్రిందనుండియే పోవునఁట" యని చంద్రనారాయణుఁడు బదులుచెప్పెను. ఇదివిని యవనులిరువురును నవ్విరి. పిదప వారిలో నొకఁ డిట్లు చెప్పెను.

"అట్లయిన జెట్టుదిగి మనమాయుధములను గైకొని డొంకలలో డాఁగియుండి వారినేలపరిమార్పఁగూడదు?"

"పులిబోను ముట్టడించుటయేగాని వారిని సంహరిం చుట మనపనిగాదు. వారితోఁ గలియఁబడినచో మనలోఁ గొందఱు కూలక తీఱదు. ఎంతసేపటికి యుద్ధము ముగి యునో తెలియదు. ఇట మనుష్యనష్టము సంభవించు టయేగాక, అట మన రెండవజట్టుతోఁ గలిసికొను టకుఁ గూడ వీలు చిక్కదు. వాండ్రు వెడలిపోయినచోఁ

బులిబూరు ముట్టడి మనకు సులభసాధ్యము కూడఁ గాఁగలదు.”

రెండవయువనుఁ డీయోచనయే బాగున్నదని చెప్పెను. తక్కిన వారందఱకు నీసంగతి చెప్పి చంద్రనారాయణుఁడు, “రాజభటులు మఱ్ఱిక్రిందనుండి పోవునపుడు కిక్కురుమన కుండనుండుఁ” డని యాదేశించెను.

చంద్రనారాయణుఁడు తమ్మెక్కడ విడిచి పోయెనో యక్కడనే మహేంద్రుఁడు తన సైన్యముతో నొక గడియసేపు నిలిచి బయలుదేఱెను. ప్రతిభటునకు కుడి చేత ముకుందగిరిబల్లెము, నడమచేతఁ బెద్దవెదురుకఱ్ఱ, మూఁపున మూఁడేసి చిన్ని గడ్డికట్టలు, అవలగ్నబంధమున దీర్ఘకరవాలము, మొలలోఁ గైజారు నుండెను. కొందఱకు బల్లెములకు బదులు తుపాకు లుండెను. మహేంద్రునకును, భీమారెడ్డికిని, మొలలోఁ గటారి, యవలగ్నబంధమునఁ బ్రచండచంద్రహాసము, కుడిచేతఁ దుపాకియు నుండెను. కాగడాల చాకళ్ళవద్దఁ గూడ నొకటిరెండు గడ్డికట్టలు, ఒక్కొక్క బల్లెము నుండెను.

రాజభటు లందఱును జెట్టు క్రిందికి వచ్చుట మీఁద నున్న విద్రోహు లెల్లరును జూచిరి. ఒకయువనుఁడు చంద్రనారాయణుని వీఁపుగోకెను. చాకలవాండ్రు క్షణములోఁ గాగడాలన్నియు వెలిగించివేసిరి. అంతకుఁ

బూర్వమే కొమ్మచాటున నక్కుచున్న ట్లభినయించి చంద్రనారాయణుఁడు దబాలునఁ గ్రింది కుఱికెను. కాగడాలకాంతి యాప్రదేశమును బట్టపగలు గావించివేసెను. తోడనే చంద్రనారాయణుఁడు ముందు వీనిని జాగత్త సేయుఁడని తుప్పలలోనున్న విద్రోహుల తుపాకులు బల్లెములు మున్నగు నాయుధములనుఁ జూపెను. ఇది యంతయుఁ జూచుచున్న చెట్టుమీఁది దురంతకుల మీఁది ప్రాణము మీఁది కెగిరిపోయెను.

ధూమాగ్రములగు కాగడాలన్నియు విద్రోహుల కొకచోఁ జేరిన ధూమకేతువులవలె భయంకరములై యుండెను. గుబురుకొనియున్న హరితపత్రముల యావరణములను దాఁటి స్వేచ్ఛగాఁ బోవఁజాలక చుట్టలుచుట్టలుగా వెడలుచున్న ధూమరాశి విద్రోహుల కుక్కిరిబిక్కిరి గొలుపుచుండెను. ఇంతలో మొలలోఁ గైజారునకుఁ దోడుగ ఖడ్గమును, జేతఁదుపాకినిఁ దాల్చివచ్చి చంద్రనారాయణుఁడు రాజభటులను జూచి "యింకఁ జూడవలె"దని యఱచెను. తోడనే రాజభటులు గడ్డికట్టలను వెదుళ్ళకొనలకుఁ దగిలించి నిప్పు ముట్టింపఁబూనిరి. ఈలోపుననె చంద్రనారాయణుఁడు మీనికిఁ జూచి చెట్టుమీఁదఁ దనచెంతఁ గూర్చుండిన

యొక మహమ్మదీయుని "పడవోయి పనసపండూ" యని తుపాకికాల్చెను. కనుమూసి తెఱచునంతలో యవనుఁడు భూమిపైఁబడి విలవిలఁ దన్నుకొనసాగెను. రెండవయవనుఁడు మీఁదికొమ్మకుఁ బాఱిపోయెను.

అప్పటికప్పుడే రాజభటులు గడ్డికట్టలు వెలిగించి "హూష్షు హో"ష్షని బెదరించుచు విద్రోహులమీఁదికి విసరసాగిరి. ఈమంటలవలన మఱ్ఱియాకులు కొన్ని మాడి పోసాగెను. కొందఱు యవనుల బిరుసుగడ్డములు మాడి పోయెను. కొందఱి కాళ్ళు కాలిపోయెను. కొందఱిదుస్తు లంటుకొని యొడలంతయు బొబ్బలులేచెను. ఈబాధలు పడఁజాలక కొందఱు అప్రయత్నముగఁ గ్రిందికిఁ బడిపో సాగిరి. తోడనే వారి శిరములు భూమిపై దొర్లుచుండెను. కొందఱు మంటల కందకుండ నా కొమ్మమీఁదనుండి యీకొమ్మకు, నీకొమ్మమీఁదనుండి యాకొమ్మకును దుముకసాగిరి. ఈ చంక్రమణమువలన వటవృక్షముఝంఝూమారుత విక్షేపముచేవలె గజగజ వడఁకిపోసాగెను. ఏడెనమండ్రు విద్రోహులందకుండఁ జిట్టచివరకుఁబోయిరి; గాని రాజభటుల తుపాకుగుండ్లు వారిని విడువలేదు. విద్రోహు లందఱును నాశనమై పోయిరి. ఈతీరున విద్రోహులను రూపుమాపి మహేంద్రాదులు వెనుకకు మఱలిరి.

# 31

రెండుజాములరాత్రి యయ్యెను. జగమంతయు గాఢాంధకారపరిలిప్తమై చాల గంభీరముగ నుండెను. వాయువశమున నటునటు జెదరియున్న మేఘశకలములు నక్షత్రకాంతినింగూడ మందగించు చుండెను.

ఈసమయమున అ_త్తమూరు గ్రామమునకుఁ బడమటి రాజమార్గమునఁ గొందఱాశ్వికు లతిగంభీరముగబయలుదేఱి వచ్చుచుండిరి. గుఱ్ఱపుడెక్కల తాఁకుడువలన బృథివి టకటకధ్వనుల నీనుచుండెను; గాని గుఱ్ఱములు మెల్లగనే వచ్చుచుండెను. ఇరుకెలంకుల గుబురుకొని యున్న మఱ్ఱిచెట్లచే రాజమార్గము గుహావలె భయంకరమై యున్నచోటికి రౌతులు వచ్చునప్పటికిఁ జెవులు గింగురుమనునట్లొక్కెలపొకటి వినవచ్చెను. తోడనే ముందరుగుచున్న రౌతు హారహారాయని గుఱ్ఱమును గశాఘాతము గావించి ముందున కుఱికి, తటాలున వెనుదిరిగి కత్తి దూసెను. అంతకుఁ బూర్వమే "హుషార్" అను ప్రోత్సాహవాక్యములు వినవచ్చెను. వెంటనే ప్రక్కల నున్న తుప్పలనుండి కొందఱు ముందునకు దూఁకి గుఱ్ఱముల మోఁకాళ్ళు విఱుగఁగొట్టిరి. గుఱ్ఱములన్నియు గీపెట్టుచు మోఁకారించెను. పతనవేగమును దప్పించుకొనుట రౌతులకుఁ జాలఁ బ్రయాసఅయ్యెను.

అంతలో ముప్పదికాగడా లొక్కమారుగ నాస్థలము బట్టపగలుచేసివేసెను. ఇరుతెగలవారు నొకరి నొకరు బాగుగ జూచుకొనిరి. రాతులకు—భుజంగరాయనితోఁ గలిసి పులిబూరువచ్చుచున్న హంతకులకు విన్నబాటొదవెను; గాని వారు వెంటనే కత్తులుదూసిరి. అంతకుఁ బూర్వమే కత్తిదూసియున్న మొదటియాశ్వికుఁడు—చంద్రనారాయణునితమ్ముఁడగు మహేశ్వరుఁడు గుఱ్ఱము దిగి హంతకులపైఁ బడెను. రాజును బ్రసాద రాయఁడును గూడఁ దూఁకిరి; గాని ప్రసాదరాయఁడు భుజంగుని మీఁది కుఱుకుటఁజూచి యొక యవనుఁ డడ్డుపడెను. అయిన నంతకుఁ బూర్వమే భుజంగుని వక్షఃస్థలము నందలి కవోష్ణరక్తమునఁ బ్రసాదరాయని ముకుందగిరి బల్లెము పదార్పణము గావించెను.

పోరు ఘోరమయ్యెను. ఈకల్లోలమును జూచిగుఱ్ఱము లెట్లో తప్పించుకొనిపోయెను. చాకలవాండ్రతిచమత్కారముగఁ దమపైఁబడఁ బోవు నాకస్మికాఘాతములను దప్పించుకొనుచు రాజపక్షమున కనుకూలముగసంచరింప సాగిరి. రాజును, ఠాణేదారుఁడునుగూడ నొక్కమాఱుగ నొఱలనుండి ఖడ్గములు దూసిరి. కాగడాలకాంతిలో నారెండు ఖడ్గములును జకచకల నీనుచు వైరివీరులకుఁ గన్నులు పోఁగొట్టుచుండెను. యోధులకెల్లరకును ఖడ్గ

ములును, బల్లెములునే సాధనములయ్యెను. ఈసంకుల సమరమునఁ దుపాకులు తీయుటకు నవకాశము లేకపోయెను.

రాజును, ఠాణేదారుఁడును గూడ ననేకవిధములఁ బ్రయత్నించిరి; గాని భుజంగరాయఁడుమాత్రము వారి కందఁడయ్యెను. ద్రోహియగుటనో, మఱియేకారణమువలననో యాతఁడు మహేశ్వరునితోఁ బోరఁజొచ్చెను. యువనులు చాల పట్టుదలతోఁ బోరసాగిరి. రాజసాన్నిధ్యము వలన రాజభటుల తెగువయు, వైదగ్ధ్యము నంతకుమించి పోయెను. ఇట్లు కొంతతడవు జరుగునప్పటికి విద్రోహుల సంఖ్య క్షీణించెను. రాజభటులు వాండ్రనందఱను బంధించివేసిరి. మఱియొకక్షణములో మహేశ్వరుఁడు భుజంగరాయనిఁగూడ బద్ధునిఁ గావించివేసెను.

ఈసంగతి రాజపక్షమువారి కందఱకును తెలిసిపోయెను. తోడనే "మహారాజావారికి జయము, ఠాణేదారు వారికి జయ"మని యానందధ్వాన ముప్పతిల్లెను. మహేశ్వరుఁడు భుజంగరాయని కాలుచేతులుగట్టి కాళ్ళచెంతఁ బడవైచినపుడు రాజునకుఁ గలిగిన విజయానందము నెవరు వర్ణింపఁగలరు? అయినను గరుణించి విడుచుటకు రాజు ద్రోణభట్టారకుని వంటివాఁడు గాఁడు. ఇది యట్టి ప్రసంగము గూడఁ గాదు. రాజు చేతులుజోడించుకొని

యెదుట నిలిచియున్న మహేశ్వరునిఁ జేరఁబిలిచి వీఁపు తట్టుచు "మహేశ్వరా, నీచే భుజంగము బద్ధమగుట వింత గాదు. నీ సామర్థ్యము మాకుఁజాల మెప్పుగలిగించినది. రామచంద్రపుర సంస్థానము నల్లకల్లోలము చేయుచున్న పిచ్చియేనుఁగును లొంగదీసిన నీ బాహుబలము సంస్తవనీయ" మని బుజ్జగించెను. పిదప రాజు ప్రసాదరాయనిఁ బిలిచెను; గాని యాతఁడెక్కడ?

రాజు నలుదిక్కులనుజూచి మఱలమఱలఁ బిలిచెను. అప్పటికినిఁ బ్రత్యుత్తరము రాకపోవుటవలన రాజున కపాయశంక గలిగెను. మహేశ్వరుఁడుకూడఁ జాల భయపడెను. రాజభటు లన్వేషణము ప్రారంభించిరి. మహేశ్వరుఁడు వెదకివెదకి యొకయవనుని కళేబరమునుండి ప్రవహించు రక్తపుఁగాల్వలోఁ దడియుచుఁ బడిపోయియున్న ప్రసాదరాయనిఁ జూచెను. తోడనే యాతఁడంతయుఁ దలక్రిందులై పోయెనని యఱచి కూలఁబడిపోయెను. రాజుగుండె గుబాలు మనియెను. గడగడ వడఁకుచున్న కాళ్లతో నాతఁ డెట్లో నడచిపోయి ప్రసాదరాయనిచెంతఁ గూలఁబడెను; ప్రసాదరాయని విశాలవక్షమునఁ గాడ విఱిగిపోయిన బల్లెపుటలుఁగు లోఁతుగఁ గ్రుచ్చుకొని చాల బాధించుచుండెను.

ఈస్థితినిజూచిన వెంటనే రాజునకు నిరాశ గలిగెను.

మహేశ్వరుఁడు కెల్లబోయి చూడసాగెను. రాజభటులు రోదనము ప్రారంభించిరి. బద్ధులైయున్న శత్రుభటులొకటి రెండుసారులు ఆనందముతోఁ గేకలువేసిరి. వెంటనేరాజ భటులు వాండ్రను బండ్లూడునట్లు చెప్పుదెబ్బలుకొట్టి విడిచిరి. ప్రసాదరాయనికిఁ దటస్థించిన యవస్థఁ దెలిసి కొని భుజంగరాయఁడుమాత్రము చాల వగవసాగెను.

ఒకింతతడవునకుఁ గొంచెము శక్తి తెచ్చుకొని ప్రసాద రాయఁడు రాజున కిట్లు చెప్పెను. "నేనిట్లయితి నని మీరు విచారింపవలదు. హంతకులు నాయకునితోఁ గూడఁ బట్టుపడినందులకు సంతోషము. విద్రోహులను నాశనముచేయు ప్రయత్నమునఁ బ్రాణాపాయము సంభ వించుట నాకు మిగుల గౌరవకారణము. మహారాజా! ఏలినవారి సేవకకుటుంబము నెడలఁ జూపిన యాదరము త్రికాలములందు ససమానము. ఏలినవారినిఁ జిరకాలము కొలుచుట కవకాశములేకపోయెనను విచారము తక్క నాకన్యవిచారములేదు. నాయంతమిఁక గడియలోనున్నది. నాయంత్యసమయమున మాతల్లి రాణిని, నా ప్రాణమి త్రుఁడు యువరాజును, గుమారస్వామిని, మహేంద్రుని, జానకీరుక్మిణులను, శచీరాధలను, మేనత్త మేనమామలను మమ్ము కన్నబిడ్డలవలెఁ బెంచిన వంటలక్క వెంకమ్మ పిన్నిని, నాకుడిభుజమగు భీమారెడ్డిని, జగ్గయ్యను ఒక్క మాఱు చూపిన నాకదియే పదివేలు"

ఈమాటలు వినుటతోడనే రాజుగుండెలు నీరైపో యెను. తోడనే యాతనికంట నొక్కుమ్మడిగ బొప్పలవారి యవ్యాహతముగఁ బ్రవహింపసాఁగెను. ప్రసాదరాయఁ డూరడించినపిదప రాజు గ్రామమునకుఁ బోయి పాలకీగొనిరమ్మని మహేశ్వరున కాజ్ఞాపించెను.

# 32

మహేంద్రుఁడు, భీమారెడ్డి, చంద్రనారాయణుఁడు కాల్వంటులను వెంటనిడుకొని వచ్చి దుఃఖసాగరమునఁ గూలిపోయిరి. మఱి కొంతసేపటికి యువరాజును, కుమారస్వామియుఁగూడ వచ్చి యాయనంత విచారసాగరమునందే పడిపోయిరి. ఈస్థితి యంతయుఁజూచి యొచ్చటిభటు లచ్చటనే కూలఁబడి విచారింపసాగిరి.

ఇట్లొక పదినిముసములు జరుగునప్పటికి మహేశ్వరుఁడు పల్లకీతోఁగూడ వచ్చెను.

రాజు, యువరాజు, కుమారస్వామియుఁ బ్రసాదరాయని నతిజాగ్రత్తతోఁ బల్లకీయందుఁ బరుండఁబెట్టిరి. బోయీలకుఁ దెలుపవలసిన వన్నియు ముగిసిన పిదప నెల్లరును బయలుదేఱిరి. అందఱును గాలినడకనే రాఁదొడఁగిరి. భీమారెడ్డి బద్ధులను జాగ్రత్తగాఁ జూచుటకు నియమింపఁబడెను. కాగడాల ప్రకాశము దారిపొడుగున

గాఢాంధకారమును జీల్చి చెండాడు చుండెను; గాని దుఃఖాంధకారమును బాపు ప్రకాశ మిప్పు డెక్కడ నున్నది?

ఇందఱు నడచివచ్చుచున్నను జీమ చిటికు్కమనినను వినఁబడు నంతటి నిశ్శబ్దముగా నుండెను. అప్పుడు సమీపమునందే యున్న భీమారెడ్డితో భుజంగరాయఁ డిట్లు చెప్పెను. “నేనెప్పుడు నిట్లగునని తలఁపలేను. ప్రసాదరాయఁడు నాపైఁ బ్రబలవైరము వహించినను ఈవ్యవహారము ప్రారంభించిన పిదప నేను చనిపోయినను సరియే గాని ప్రసాదరాయఁడు నిరపాయుఁడై నూఱేండ్లు జీవించి దేశవిఖ్యాతినిఁ బడయవలెనని కోరుచుండువాఁడను. భట్టాచార్యులవారి హత్యను గుఱించి యెట్లో నామనస్సును సమాధానపెట్టుకొనుటకైనను కారణములున్నవి; గాని ప్రసాదరాయని వధనుగుఱించి కల్పించుకొనుటకుఁ గూడ హేతువులులేవు. నేను చేసిన పాపముకంటె రామచంద్రపురసంస్థానము చేసిన పుణ్యము గొప్పదైనచోఁ బ్రసాదరాయఁ డీ యపాయకర స్థితినుండి విముక్తుఁడు కావచ్చును.”

అంతటను గాంభీర్యము విరాజమానముగు చుండుట వలన నిది యెల్లరకును వివవచ్చెను. “అంతయుఁ జిత్తగించితిరా” యని ప్రసాదరాయఁడు రాజు నడిగెను.

వింటిననీ రాజు ప్రత్యుత్తర మిచ్చిన తరువాత నాతఁ డిట్లు చెప్పెను. "ప్రభువులు సర్వజ్ఞులు. ఏలినవారికి విన్నవింపవలసిన దేమియులేదు. నావిషయమున భుజంగ రాయని హృదయము నిష్కళంకమని నమ్ముటకు నా కెట్టి యభ్యంతరమును లేదు. అయినను ఆతఁడు చేసిన ప్రయత్నము మిగుల నింద్యమైనది. ఆతనికి రామవర గ్రామవాసులవలనఁ దీవ్రావమానము గలుగుట నిజమే; గాని యందులకుఁ దగిన ప్రతిక్రియ కొల్లగొట్టుటగాదు. దైవనిర్ణయమువలన మాటలతోఁబోవు వ్యవహారము రక్తపాతిమైనఁ గాని శాంతించినదిగాదు. ఏలినవారు భుజంగునిఁ దగినట్లు శిక్షింపకున్నచో నియమస్థితి కపా యము సంభవించును. ఇట్లే మఱికొందఱుగూడ నేవో కొన్ని కారణములను బురస్కరించుకొని యుక్తమార్గ మును విడిచి క్రూరకృత్యములను జేయుటకు సాహసింప కుండుటకుఁ గూడ భుజంగుని శిక్షింపవలసియున్నది. అది దేవరకే విశదము."

ఇదియంతయు విని రాజు "బాబూ, అంతయు నెఱుఁ గుదును. నీవు మాట్లాడవల" దనియెను. మఱల గాంభీ ర్యము విరాజమాన మయ్యెను.

## 33

చంద్రనారాయణుఁడు వచ్చి తెలుపు తెలుపుఁ డనునంత దనుక మాధవశర్మకు స్థిమితములేదు. గుమ్మము దాట

కుండ స్త్రీలను నిలుపవలసిన భారము తొలఁగినంతటనే రగుల్కొనుచున్న విచారాగ్ని యుబ్బెత్తుగ నెగసి, ప్రసాదరాయనిఁ జూచినతోడనే యాతని హృదయమును దహించివేయసాగెను. "బాబూ! నీకప్పుడే నూరేండ్లు నిండిపోయినవా" యను నొక్క-మాటయు నెట్లో వెలువడినతరువాత నాతని కంఠస్వరము పూర్తిగ రుద్ధమై పోయెను. అంతలో మహేంద్రుఁడు వచ్చి కౌఁగిలించుకొనియెను; గాని యిద్దఱునుగూడ మాట్లాడఁజాలక పోయిరి. ఇరువురనేత్రముల నుండియు బాష్పలహరి యవ్యాహతముగఁ బ్రవహింపసాగెను.

చంద్రనారాయణుఁడును మహేశ్వరుఁడును లోనికిఁ బోయి యొకపఱుపుఁ గొనివచ్చి యంగణమునఁ బఱచిరి. తోడనే కుమారస్వామియు మహేంద్రుఁడును బ్రసాద రాయనిఁ గొనివచ్చి దానిపైఁ బరుండపెట్టిరి. తనస్థితి జూచుకొని ప్రసాదరాయఁ డప్పుడుమాత్ర ముస్సురని నిట్టూర్పు విడిచెను. ఇంతలో రూపొందిన శోకదేవతలవలె రాణి, రాధ మున్నగు స్త్రీలందఱు నంగణము ప్రవేశించి ప్రసాదరాయని చుట్టును మూఁగిరి. రాధ ప్రసాదరాయని చేతులుపట్టుకొని "జీవితేశ్వరా, అవతారము చాలించెదవా!" యని యేడ్చెను. రుక్మిణి "అన్నా, మమ్ము విడిచిపోయెదవా" యని యేడువసాగెను. జానకి "అన్నా

మాకిఁక దిక్కెవ్వ” రని విలపింపఁజొచ్చెను. శచి యెల్లర కంటెను ఘోరముగ నాక్రోశింపఁదొడఁగెను. మాధవ శర్మ గృహిణి, కుమారస్వామి తల్లిగూడ వచ్చిరి. వెంకమ్మ “చిట్టితండ్రీ, పాడుదేవుని కండ్లకు నీవే గుఱి యైతివా” యని రోదనము చేయసాగెను.

పదినిముసములవఱకును ప్రసాదరాయనికి మాట్లాడుట కవకాశమే చిక్కదయ్యెను. అప్పు డెట్లో తెలివి చేసికొని యాతఁడు రాధను జూచి “దేవీ, నీవింతభీరురాలవని యెన్నఁడును దలంపలే” దనియెను. జానకిని, రుక్మిణినిఁజూచి “మీరింతగా వగచెదరా? మీరింతకంటె నెక్కుడు విచారించినయైన నన్ను బ్రతికింపఁగలరా? మన మందర మేడ్చియు నాయనగారిని బ్రతికింపగలిగితిమా?” యనియెను. రాణి నారసి “అమ్మా, నీకుఁగూడ నజ్ఞానమా? నీవీ పసిపాపల నూరడింపవలదా” యనియెను. శచీదేవినిఁ దక్కిన వారినిఁగూడ నిట్లే యూరార్చెను. అప్పుడు ప్రసాదరాయఁడు రాజును, రాణినిఁజూచి యిట్లనియెను. “నేను కేవలము దురదృష్టవంతుఁడను. చిరకాలము మీసేవఁజేసికొనుటకుఁ బెట్టిపుట్టనైతిని. సర్వము నాకీ యిరువదియైదేండ్ల ప్రాయమునందే తీఱిపోయినది. మీరికఁ నన్ను మఱచిపోవలెను. మానిమిత్తము మీరనుభవించిన శ్రమలకును, మాయెడల మీరుచూపిన

ప్రేమకును మితిలేదు. ఈక్షుద్రసేవకునియెడలఁ దాము చూపిన యాదరము నారసి లోకమంతయు నాశ్చర్యపడి పోవుచున్నది. అతిపరిచయమువలన మేము మీగౌరవమును దెలిసికొనఁజాలక అపచారములుచేసితిమి. ఇదియంతయు సహించుకొనన మీయాత్మోన్నతిని గొలువ నెవ్వరితరము? సాలగ్రామమును గాళ్లతోఁ ద్రొక్కిన తరువాత నిఁక మన్నింప నెంతప్రార్థించినను లాభమేమి? అయినను ఇప్పుడు నావిశేషప్రార్థన మేమనఁగా? మీరిఁక మావలననైన సకలాపరాధములను మఱచిపోవలెను. కన్నులు తెఱువని పసిబిడ్డని, మామహేంద్రుని మీపాదకమలములచెంత నిడుచున్నాను. అంతకంటెను లోకమెఱుఁగని పసిపాపలు, నాకూర్మిచెల్లెండ్రగు జానకీ రుక్మిణులుగూడ మీపాదముల నాశ్రయించుకొనియున్నారు. నన్నుగురించి యనేకశ్రమ లనుభవించిన క్షమాశాలి బుద్ధిబాహుబలముల సాటిలేని మేటి, నాకూరిమిబావ కుమారస్వామి మీపాదసేవకుఁడు. మీకంటె మాకుటుంబమునకు వేఱు దిక్కులేదు. ఈ యవసానకాలమున నీదీనుఁడు మిమ్మొక వరము ప్రార్థించుచున్నాఁడు. అది క్రొత్తదిగాదు. మేమిదివఱకే దాని ననుభవించుచున్నాము. అయినను మఱలమఱలఁ గోరుటవిపన్నుల లక్షణము. నేనిప్పుడభయమును వేఁడుచున్నాను.

మాకుటుంబ మంతయు మీపూర్ణ రక్షణమును గోరు చున్నది. మీయంగీకారము నాచెవులఁబడిన నాకంతియే చాలును" రాజదంపతులు శోకాతిరేకమ్మునఁ గొంత తడవు మాటాడఁజాలక తుదకిట్లనిరి. "అంతయుఁ దల క్రిందులై పోయినది. మీకుటుంబము మాసంస్థానమును గాపాడినది. అట్టిచో మేము మీకుటుంబమును రక్షించె దమని చెప్పుటకు నోరాడకున్నది. అయినను నీవు మొగ మోటపెట్టుటవలన నీకభయమిచ్చుచున్నాము. బాబూ, మీకుటుంబమును గుఱించి నీ కేమియుఁ జింతవలదు" ఇట్లు చెప్పునప్పు డాదంపతులు చాల విచారించిరి.

పిమ్మటఁ బ్రసాదరాయుని చూడ్కు లుయువరాజుపైఁ బ్రసరించెను. ప్రసాదరాయఁడు కుమారమహీపతి చేతులు పట్టుకొని యిట్లనియెను. "ప్రభుకుమారా, నాయెడల నీవు రాజకుమారభావమును మఱచిపోతివి. మీతల్లిదం డ్రులకంటె నన్నెక్కుడు ప్రేమించితివి. మన మిరువుర మును గేవల మొక్కతల్లి కడుపునఁ బుట్టిన యన్నదమ్ము లవలె మసలితిమి. ఈచనవువలన నీవు రాజకుమారుఁడ వను మాటయే నేను మఱచి పోయితిని. ధీమణీ, నీవు నన్నుఁ జూచి "నీవునాకు సాచివ్యముచేయ నంగీకరింపవేని నేను సింహాసనమే యెక్క" నని పలికితివి. ఇఁక నాయెడల నీకుఁ గల యనురాగమునకును, దయకును, మైత్రికినిఁ

బారమెక్కడిది? నాకంతకంటె గౌరవ మేమిగలదు? మిత్రుఁడా, యిఁకనన్ను మఱచిపొమ్ము. ప్రసాదరాయఁ డనువాఁడు పుట్టనేలేదని యనుకొనుము. ఇఁక నీహృదయమును మహేంద్రునివైపునకుఁ ద్రిప్పి నీయనురాగలహరి నాతనిమీఁదికి మఱలింపుము. నిన్ను సేవించుటకు మహేంద్రుఁడు సర్వసిద్ధుఁడు. కుమారస్వామిని మఱువవలదు. ఆతఁడు సానలుదీరిన జాతిరత్నము. నీవాతనిని జాగ్రత్తగా నుపయోగింపుము. రామచంద్రపురసంస్థానభారమును మాకుటుంబరక్షణభారము నీభుజస్కంధములపై నొక్కమాఱుగఁ బడును. రాజపుత్రా! నీవు సార్వభౌముఁడవై వెలయుదువుగాక."

యువరాజునకు దుఃఖమువచ్చెను. "మిత్రమా, నిన్ను విడిచి నేనుండఁజాలను. నిన్నుజూచుకొని నేను చేసిన భావికల్పన లన్నియుఁ గేవలము మరుమరీచికలై పోయినవి. నీయనుగ్రహమున్న నేను రామచంద్రపురసంస్థానమును విలాసముగఁ బాలింపఁగలననియు, సార్వభౌముఁ డనగుట క్షణమనియుఁ దలంచితిని; గాని యిట్లగునని యూహించుట కెన్నఁడు నవకాశమే కాలేదు." అని చెప్పి యాతఁడు మఱియొకమాఱు దుఃఖించెను.

అపుడు ప్రసాదరాయని చూడ్కులుమాధవశర్మపై ప్రసరించెను. తోడనే కన్నుల నీరు గిఱ్ఱునదిరుగ మాధవ

శర్మ దగ్గరకు వచ్చి కూర్చుండెను. ఆతని పదముల సంటి ప్రసాదరాయఁ డిట్లు చెప్పెను. "మామా! నీకేమి చెప్పగలను? ఇందు నీకుఁ గానివారెవరు? అందఱును బసిపాపలు. అన్నమునిదినుట మైన నెఱుఁగరు. మాయమ్మ మమ్ము నీయొడిలోఁ గూర్చుండఁబెట్టి పోయినది. నీవు మా కేమియు లోటు చేసి యెఱుఁగవు. "కడుపునఁబుట్టిన బిడ్డలులేని కొఱఁత మీవలనఁ దీఱెన" దని మమ్ముఁ జూచి యనేకపర్యాయములంటివిగదా! మేమజ్ఞానులము. మిమ్మనేకవిధములఁ గష్టపెట్టితిమి. అన్నియు సహించి తివి. ఇఁక ముందుఁగూడ నీపసిపాపల నిట్లే పెంపవలసిన దని నిన్నుఁ బ్రార్థింపవలసిన పనియేలేదు" ప్రసాదరా యఁడు మేనత్తకుఁగూడ నిట్లే చెప్పెను. "నాయనా. జరుగవలసిన దేమియు నిలిచిపోదు. మీతల్లియు నేను నొక్కకడుపున నెప్పుడు పుట్టితిమో యప్పుడే నేను మీకల్యాణమును గోరవలసినవాఁడనైతిని. మీయభ్యు దయమునుజూచి నే నుప్పొంగిపోయితిని; గాని యిట్లగు నని కలనైనఁ దలంపలేదుతండ్రీ" యని మాధవశర్మ ప్రత్యుత్తరమిచ్చెను. ఆతని గృహిణిగూడ యుత్తరీతిని సమాధానము చెప్పెను. ఆదంపతు లిరువురునుగూడ దుఃఖోద్రేకమువలన నీమాటలు చెప్పలేక చెప్పలేక చెప్పిరి.

పిమ్మటఁ బ్రసాదరాయఁడు కుమారస్వామినిఁ జూచెను. విచారసాగర ముత్తరంగిత మగుటవలనఁ గుమారస్వామి లేవలేక కన్నీరువిడువసాగెను. అదిచూచి ప్రసాదరాయఁడు "బావా, నేఁటితో మనకు శాశ్వతవియోగము గలుగుచున్నది. మఱల నొకరికొకరు కాన్పించుటయసంభవము. ఈయవసానసమయమున నొక్క మాఱు కౌఁగిలించుకొందువేని నేను నిర్విచారుఁడ నయ్యెద" నని చెప్పెను. అప్పు డెట్లో శక్తి తెచ్చుకొని "బావా, మంత్రోపదేశమునకు మాఱుగ నప్పగిఁతలుచేయుటకుఁబిల్చుచున్నావా!" యని కన్నులనీరుగ్రక్కుచు వచ్చి కుమారస్వామి, చెంగటఁ గూర్చుండెను. ఇరువురు నొక్కమాఱు కౌఁగిలించుకొనిరి. ప్రసాదరాయఁ డిట్లుచెప్పెను. "బావా, నీవు నాకు బెట్టనికోటవై కుడిభుజమవై నాజీవితరథమును నడిపితివి. యుక్తరీతులఁ జేఁదోడు వాఁదోడుగా నిల్చి రాజసభయందును విశేషసన్మానము గలిగించితివి. ఇఁకఁ గన్నులకైనఁ గాన్పింపదనుకొన్న నాయర్ధాంగలక్ష్మిని దెచ్చియిచ్చితివి. నాకొఱకింక ననేకకష్టములనుభవించితివి. పురుషసింహా! నీఋణము నెట్లుతీర్చుకొందును? నీవు చిన్నవాఁడవు. ఆశీర్వచనయోగ్యుఁడవు. సుఖముగా వర్ధిల్లుమని దీవించుటకంటె నేనేమి చేయఁగలను? ప్రేమైకనిలయా! నాచెల్లెలు రుక్మిణి యేమియు నెఱుఁగని గోల. ఒకచెంపఁ

గొట్టిన సీరు నొకచెంపఁగొట్టిన బాలును దొరలు సుకు మార. కేవలము ముద్దరాలు. నీమహామహిమ తెలిసి కొనఁజాలదు; మాయమర్మము లెఱుఁగని మృదు హృదయ. గాని నీకంటె నన్యము లేదని నమ్మియున్న అమాయకురాలు. ఆమెవలన నేమైన నపరాధము గలిగిన క్షమింపవా ? తలిదండ్రులులేని యాపసిబిడ్డను మనసిచ్చి కాపాడవా? ఆమె చిన్నప్పటినుండియు నాయొడిలోఁ బెఱిగినది. దిక్కులేని ఆగోలకు నీకంటె దిక్కెవరుగలరు ? మఱియుఁ దమ్ముఁడు మహేంద్రుఁడు అంతకంటె నసహాయుఁడు. కేవలము దుందుడుకు పిల్లవాఁడు. వానినిఁ బెంచి యొకయింటివానినిఁ జేయవలసిన భారము నీమీఁదఁగూడ మోపుచున్నాను. జానకి కేవలము నిరాధారురాలు. మహేంద్రుఁడును రుక్మిణియునే యామెకుఁ బ్రాణము. వారికిఁ గష్టములు గలిగిన నామె మనఁజాలదు. అంతేయు నీచేతఁగూడ నున్నది భట్టాచార్యు నారి యిల్లు పడిపో లేదని లోకమునకుఁ దెలియునట్లు చేయవలసినపని నీవంతు సుమా.” ఇదివిని కుమారస్వామికొంతతడవు నిరుత్తరుఁడై “పురుషసింహా, ఈమాట లేల చెప్పెదవు? ప్రళయసాగరము జగత్తంతయు ముంచివేసినపిదప నిఁకఁ జేయవలసిన దేమిగలదు ? నీ యపాంగవీక్షణమువలననే మాహృదయ యంత్రములు నడుచుచున్నవి. నీవులేకున్న నిఁక మాకు

బ్రతుకెక్కడిది? నిన్ను ముంచివేసిన ప్రళయసాగరము మమ్ము విడుచునా?" యని దుఃఖించెను.

పిమ్మటఁ బ్రసాదరాయఁడు మహేంద్రునిఁ జూచెను. వెంటనే మహేంద్రుఁడు డేడ్చుచుఁ జెంతకువచ్చి కూర్చుండి "అన్నా! ఇఁక నాకప్పగింతలు చేయుట తరువాయి యున్నదా? నీపలుకులు నిశితభల్లములై నా హృదయమును భేదించుచున్నవి. అన్నియు వింటిని. ఎల్లవిధముల నన్ను రక్షింపవలసినవాఁడవు నీవు నామీఁద సకల భారమును మోపుచున్నావా? ఎదుటికి రాకుండ నెట్లో నీ వెనుకనిలిచి కాలము గడుపవలయు ననుకొంటిని. అట్టి నన్ను ముందున కీడ్చుచున్నావా?" యని పలికెను. ప్రసాదరాయఁ డాతనిశిరము మూర్కొని "తండ్రీ, విచారమువలనఁ బ్రయోజనము లేదు. మనవంశమున నింతవఱకు నప్రయోజకుఁడు పొడసూపలేదు. నాయనగారు సర్వతోముఖ ప్రజ్ఞాధురంధరులగుటచే నాకీర్తికి భంగము రాకుండఁ గాపాడినారు. నామీఁదఁ బడవలసిన యాభారమంతయు నొక్కుమాఱుగ నీపైఁబడినది. నీవు తొందర పడకుమా తండ్రీ! అన్నివిధములను నాయనగారి యంశ నీయందు సంపూర్ణముగనంకితమైయున్నది. నీసామర్థ్యము నెడల నాకేమియుసందేహములేదు. తండ్రిగారికాలమునఁ గంటె నీకాలమున మనవంశమునకుఁ గీర్తి పెంపందును.

అన్నియు నీకుఁ దెలియును. ఎప్పుడెప్పుడు నీకుఁ గార్యా లోచనము తోఁపకుండునో యప్పుడప్పుడెల్ల నాయనగారి పాదపద్మములను స్మరించుకొనుచుండుము. తోడనే నీకు నవశక్తి యొదవుచుండును. మహారాజావారిని భక్తితోఁ గొలువుము. కుమారస్వామి సాక్షాత్తుగఁ దారకాసురభంజకుఁడగు కుమారస్వామియని తెలిసికొనుము. ఆతని యనుగ్రహముగూడ నాశింపుము. ఆపదలయం దధైర్యమువలదు. నేఁడుచేయవలసిన కార్యము త్రేపటివఱకును నిలుపఁబోకుము. మనస్సునకెక్కని పనినిఁ జేతికి రానీయకుము. అట్లయిన నీసంసారసాగరమున నీవు దరి జేరఁగల"వని చెప్పెను. మహేంద్రుఁడీమాటలన్నియుఁ జాల విచారముతోడను జాలశ్రద్ధతోడను విని అన్నపదముల నంటెను.

పిదపఁ బ్రసాదరాయఁడు జానకినిఁజూచెను. హఠాత్తుగ నామెహృదయమునవిచారసముద్రముపొంగిపొరలి యుక్తి బిక్కిరిచేసివేసెను. ఆమె 'తండ్రీ,నానంతువచ్చినదా!' యని మాటుపలుకఁజాలకపోయెను. "తల్లీ, సెలవిమ్ము. నిన్ను జూచిన నాహృదయము వ్రక్కలై పోవుచున్నది. చెల్లెలవేగాని తల్లివలె రక్షించితివి. నన్ను దండ్రివలెఁ జూచితివి. వదినెను దల్లియని పూజించితివి. అమ్మా, నీవంటి రమణీమణి యిఁకఁ బ్రపంచమునఁ గాన్పింపదు. ఇఁక నేమి

చేయఁగలము? నన్ను మఱచిపొమ్ము. మహేంద్రుఁడు బాలుఁడు, శచి యేమియు నెఱుఁగని పిల. రుక్మిణి సంగతి చెప్పనక్కఱలేదు. నీవిఁక వారినిరక్షింపుము. వారికి నీవే పెద్దదిక్కు" అని చెప్పి ప్రసాదరాయఁడు రుక్మిణి దెసఁ జూడ్కులు సారించెను. శోకాతిరేకమ్మున మాట రాక జానకి నిశ్చేష్టయయ్యెను.

ప్రసాదరాయఁడు తనదెసఁ జూచినంతనే రుక్మిణి హృదయము సహస్రధా విదారితంబై పోయెను. తోడనే యామె యన్నగారిచేతులు పట్టుకొని "అన్నా, వరుస బెట్టి యప్పగింతలు చేయుచున్నావా?" యని వగవసాగెను. ప్రసాదరాయఁ డిట్లు చెప్పెను. "చిట్టితల్లీ! వగచినఁ బ్రయోజనము లేదు. నిన్ను జూచిన నాగుండె నీరయిపోవు చున్నది. ఏమియు నెఱుఁగవు. ముక్కుపచ్చలారని పసిపావవు. నాచేతులలోఁ బెరిగితివి. సంపూర్ణముగ నీసౌభాగ్యమును నేను చూచుటకు నోచిపుట్టనైతిని. ఏమిచేయఁగలము? చెల్లాయీ, ఇఁక మీకు లోపములు కలుగవు. పెద్దల యాన మీఱకుము. నీభర్త చాల గొప్పవాఁడు. నీకనుకూలుఁడు. ఆతనిని సేవించుకో. జానకినిఁ గన్న తల్లిగా భావింపుము. మహేంద్రుని యభ్యుదయమును గోరుకొనుము. శచి చిన్నపిల్ల. ఆమెను బ్రేమింపుము. మనకు మేనత్తమేనమామలు తల్లిదండ్రులు. వారి హృద

యములకు వెట్టగలిగింపకుము. భట్టాచార్యులవారి వంశ మర్యాద నీయందును, జానకియందును మూర్తీభవించి యున్నది. దానినిఁ గాపాడుము. నీయత్తగారు కష్టసుఖము లెఱిఁగిన సాధ్వి. నీకంటె నామెకుఁ బ్రేమాస్పదము లేదు. ఆమెను బూజింపుము. మహారాణి మిమ్ము మఱచిపోదు. ఆమె దేవీస్వరూపిణి. ఆమెనుగూడ సేవింపుము" అదివిని రుక్మిణిగూడ శోకావేగమ్మున మాట్లాడఁజాలకపోయెను.

తరువాతఁ బ్రసాదరాయనిచూపులు శచీదేవిపైఁ బ్రసరించెను. తోడనే యాముద్దుబాల "నాకుఁగూడ నప్పగింతలు చేయవలెనా వదినే" యని రాణినిఁ గౌఁగిలించుకొని యేడువసాగెను. జానకియు, రాణియు నామె నోదార్చిరి. ప్రసాదరాయఁ డిట్లు చెప్పెను. "తల్లీ! నీ వాక్కృతవే యిప్పుడు మావంశమున కాధారమవై యున్నావు. మహేంద్రుని బ్రతుకంతయు నీయఱచేత నున్నది. జానకి నిన్ను గన్నబిడ్డవలె రక్షించును. రుక్మిణినిఁ గడుపునఁగన్న బిడ్డయని భావించుకొనుము. రాణినిఁ బ్రసన్నురాలినిఁ జేసికొనుము. సకలైశ్వర్యములతో నీవు నూఱేండ్లు వర్ధిల్లుము" ఇదివిని శచి యదే పనిగ నేడువసాగెను. మఱల నోదార్చుట చాలఁ గష్టమయ్యెను.

# 34

"ప్రసాదరాయఁ డందఱకును జెప్పును; గాని రాధకేమియుఁ జెప్పఁడేల? ఆమె మాటయే యెత్తఁడేల?" ఈ సందేహము తొలుత రాణికిఁ గలిగెను. పిదప జానకికిఁ గూడఁ దోఁచెను. పిదప నందఱకును గలిగెను. రాధ మాత్రము నిశ్చలయై భర్త చెప్పుచున్న దంతయు వినుచుండెను. ఈవిషయమునఁ బ్రసాదరాయని భావమేమో, రాధ యదెంతవఱకును గ్రహించెనో యెవరు చెప్పఁ గలరు? ప్రసాదరాయఁడే గంభీరుఁడనుకొనిన రాధ యంతకంటెను గంభీరహృదయ. ఆగభీరహృదయములలో నేమి కల్పనలు ప్రవర్తిల్లుచున్నవో?

శచీదేవిని దీవించుట యైనతరువాతఁ బ్రసాదరాయఁడు రాధకేదో చెప్పునని యందఱును దలంచిరి; గాని దీనికి వ్యతిరేకము జరిగెను. ప్రసాదరాయఁడు కుమారస్వామి తల్లిని, వెంకమ్మను బిలిచి వారికిఁగూడ నప్పగింతలు పెట్టెను. పిదప భీమారెడ్డినిఁ బిలిచెను. ప్రసాదరాయని పలుకు లన్నియు వినుచు, విచారభరమ్మున మాఱుమాటలాడఁజాలక గోడకుఁ జేరఁబడినిలిచియున్న భీమారెడ్డి ప్రసాదరాయని యెదుటికివచ్చి చేతులు జోడించుకొని, కన్నుల నీరు గ్రుక్కుచు "ప్రభూ!

ఈసేవకుని యెడలఁ గల ప్రేమకుఁ గృతజ్ఞుఁడను; గాని మీపలుకులు ములుకులై హృదయభేదనము గావించు చున్నవి. ఈయధీరున కేమి చెప్పఁదలఁచితిరి ? ఈయశక్తుని వలన నేమి నిర్వహింపఁబడునని యూహించితిరి! వెంటరమ్మని సెలవిండు. బ్రతుకుఁదెరువు నుపదేశింప వలయు" అని ప్రార్థించెను. ప్రసాదరాయుని కంతటితోఁ దృప్తి గలుగలేదు. దగ్గఱకువచ్చి కూర్చుండుమని చెప్పెను. అప్పుడు భీమారెడ్డి యింకను జేరవచ్చి మోఁకారించెను. ఎన్నివిధములఁ జెప్పినను గూర్చుండకపోవుటఁ జూచి ప్రసాదరాయఁ డాతని చేతులు పట్టుకొని యిట్లు చెప్పెను. "నీవిపుడు చావఁగోరుటవలనఁ బ్రయోజనము లేదు. రామచంద్రపుర రాజ్యలక్ష్మి యింకను నీ సేవను గోరుచున్నది. నీభావికాలము చాల నున్నతమైనది. నీ శక్తి నీ వెఱుఁగవు. పులిబూరు తాణా నీబాహుబలమును నమ్ముకొని యున్నది. నీయనంత సామర్థ్యమువలననే పులిబూరు గుఱ్ఱపుదండు వైరిగర్భనిర్భేదకమై వెలయుగలిగినది. నీవలన మాకులమున కెంత వన్నెగలిగినదో నీకేమి తెలియును? సాంగ్రామిక వ్యాపారములలో భట్టాచార్యులవారి హృదయమునఁ బ్రథమస్థాన మాక్రమించిన నీవు వీరలోకమున కెంతటి గౌరవము తెచ్చితివో రామచంద్రపుర సంస్థానమునఁ దెలియని దెవ్వరికి? భట్టాచా

ర్యులవారి పదాంకములను విడువఁజాలక మహారాజావారి సాన్నిధ్యమునుగూడ నుపేక్షించిన నీగురుభక్తికిఁ బార మెక్కడిది? వీరమణీ, నీ వియోగమును నేను భరింపఁ జాలను. అయినను జేయునదిలేదు. ఈమి త్రునిమఱవకుము. నీవు సర్వసేనాధిపత్యమును నిర్వహించుచుండఁగాఁ జూడ వలయునని యెంతో ముచ్చటపడితిని. నేను బ్రతికియుంటి నేని చూచియుందును; గాని యావిషయమును గుఱించి యిప్పు డేమనుకొనిన నేమి ప్రయోజనము? ఇఁక నిప్పటి నావిశేష ప్రార్థన మేమనఁగా? మహేంద్రుఁ డున్నాఁడు. ఆ గురుపుత్రునియం దనురాగ ముంపుము. ఏమియునెఱుఁ గని యాబాలుని నీవుపెట్టనికోటవై రక్షించెదవేని భట్టా చార్యులవారి కదియే గురుతర గురుదక్షిణ. అదియే నీకు శ్రేయస్కరము. ప్రభువులకు నీయెడలఁ బరమానుగ్ర హము గలదు. నీరాజభక్తి లోకమునకుఁ దెలియనిది గాదు. పులిబూరికి వీరభూమి యను బిరుదమును నిలుప వలసిన భారము నీభుజస్కంధముపై గలదు. అన్నియుఁ దెలిసిన నీకింతకంటె వేఱుగఁ జెప్పవలసిన దేమున్నది?"

ఇదివిని భీమారెడ్డి వగచుచు నిట్లుచెప్పెను. "ఇఁక నేనేమి చెప్పఁగలను? ఏమి చేయఁగలను? భట్టాచార్యుల వారిమరణమువలన నేనరసచ్చియుంటిని. ఇప్పుడు మీరు నన్ను వాగ్భల్లములచే మఱింత నొప్పించుట తగునా?

మీవలననైన మంచి యంతయు నాపై నారోపించుట యేటి ధర్మము? మిమ్ముఁజూచి నేను భట్టాచార్యులవారిని మఱచిపోయితిని; గాని యిప్పుడు గంభీరాంధకార కూపమునఁ గూలఁబడిపోయితిని. మీయనుగ్రహమువలన నాకుఁ గలుగుననుకొన్న భవిష్యదౌన్నత్యము కలలోని ముచ్చట యైపోవునని యెన్నఁడు నూహింపలేదు.”

ఇదియైన తరువాతఁ బ్రసాదరాయఁడు రాధాదేవి ప్రస్తావన చేయునని యెల్లరునూహించిరి; గాని యాతఁడు జగ్గయ్యను జేరఁబిలిచెను. మఱియల నందఱును దొల్లవోయిరి. జగ్గయ్య వగచుచు నెదుటకువచ్చి “ప్రభూ, ఇప్పుడు నా వంతువచ్చినదా? ఇట్టి కష్టసమయమున నీక్షుద్రసేవకు నైన మఱచిపోఁగూడదా? భల్లప్రహారమువలన గురుతర బాధ ననుభవించునప్పుడు గూడ నీదీనునకు నీహృదయమునఁ జోటిచ్చుటవలన నేను సంతోషింపవలసినదే. అయినను నాకు విచారము కన్నులు గప్పివేయుచున్నది. మహారాజా, నిన్ను నాభుజములపై నెక్కించుకొని యాడించితిని. నాచేతులలోఁ బెంచితిని. నిన్ను చక్రవర్తి బిడ్డగా భావించితిని. నీయభ్యుదయమునుజూచి యానంద సాగరమున మునింగిపోవుచుంటిని. తండ్రీ! తుదకా యానందసాగరమును దుఃఖసాగరముగా మార్చివేసితివా? ఆసౌఖ్యమంతయుఁ గష్టముగాఁ దేల్చివేసితివా? నన్ను

జీవచ్ఛవము గావించివేసి స్వర్గమునకుఁ బోవుచుంటివా? బాబూ! నాయేక పుత్రుని విషయమునఁ గూడ నింత దుఃఖ మెఱుఁగను. నాకడుపు చెఱువై పోవుచున్నది. నీమాటలు నేను వినఁజాలను. ప్రభూ! మన్నించి నన్ను మఱచిపో” మ్మని ప్రార్థించెను; గాని ప్రసాదరాయఁడు జగ్గయ్య నింకను జేరఁబిలిచి యొకమాఱు వీఁపుపై దట్టి యిట్లు చెప్పెను. “జగ్గారెడ్డీ! భట్టాచార్యులవారికి నీవు నల్లగుండెవై యుంటివి. నేను చిన్నతనము మొదలుకొని నిన్న మొన్నటి వఱకును నీపై నెక్కి త్రొక్కితిని. నీకు సౌఖ్యమున కవకాశము లేకుండఁ జేసితిని. అయినను నీవు మనసులోఁ గూడ నామీఁద గోపమెఱుఁగవు. త్రొక్కిన కొలఁది నానందించితివి. నాకొఱకు నీయేక పుత్రుని గుఱించిన దుఃఖమునుగూడ మఱచిపోయితివి; గాని నేను నీఋణము దీర్చుకొనఁ జాలకపోయితిని. నిన్నెంతో సుఖపెట్టవలయునని యెన్ని మాఱులో తలం చితిని. అయినను వ్యాపార బాహుళ్యమువలన నా యాలోచనలు విస్మృతములై పోయినవి. ఇఁక నాశయే లేకుండఁ బోయినది. జగ్గారెడ్డీ! ఒక్కమాట చెప్పుము. నావలన సంభవించిన కష్టములన్నియు మఱచిపోయెదవా? నాకృతఘ్నతను దలఁచుకొనుట మానివేసెదవా? నన్ను మఱచి పోయెదవా?” “ప్రభూ! అట్లు చెప్పవల” దని

జగ్గయ్య ఘోరాతిఘోరముగఁ విలపించెను. ప్రసాద రాయఁడు మహేంద్రుని మఱలఁ బిలిచి యిట్లనియెను. "తమ్ముఁడూ! జగ్గయ్యను మఱచిపోకుము. మనమాతని చేతఁ బెఱిగితిమి. తొలుత మనచేత వింటినిఁ బట్టించినవాఁ డాతఁడు. నీచేతఁ దొలుతఁ దుపాకి ప్రేయించినవాఁ డాతఁడు. నాకును నీకు నాతనియెడలఁ గల యనురాగ మంతయు నీవే చూపవలెను సుమా."

ఇఁకఁ బ్రసాదరాయుని చూపు్కలు రాధ దేస మఱలు నని మఱల నెల్లరును దలఁచిరి; గాని యిప్పుడు గూడ నందులకు వ్యతిరేకమే జరిగెను. ఆతఁడు చంద్రనారాయణుని మహేశ్వరునిఁ జేరఁబిలిచెను. మఱల నెల్లరును నిర్విణ్ణులైరి. అవశములై యున్న వారి హృదయములు మాత్రము ప్రసాదరాయని యౌచిత్యమును గీర్తించెను. విచారమువలన స్తబ్ధులై చంద్రనారాయణుఁడును మహేశ్వరుఁడును జెంతకువచ్చి కూర్చుండిరి. ప్రసాద రాయఁడు వారి చేతులఁబట్టుకొని యిట్లు చెప్పెను.

"మనము సహాధ్యాయులము. భట్టాచార్యులవారు మిమ్ము నాతో సమానముగఁ బ్రేమించిరి. మీకందులకు మించిన గురుభక్తి గలదు. మీ పాండిత్యమును సర్వతో ముఖము. గురువధగావించిన పాతకినిఁ బట్టుకొనిన మహా గౌరవము కేవలము మీది. మీ సాహాయ్యము లేకున్న

నింత సులభముగా దురంతకులు పట్టుపడుట కలలోని వార్త. రాజసభలో మీకు మహోన్నతసమ్మానము జరుగనున్నది. మీయభ్యుదయముదైవోద్దిష్టము. మీకుఁ గలుగనున్న గౌరవమును గనులారఁ జూచుటకు నా కదృష్టము లేనందులకుఁ జాల వగచుచున్నాను. నాకిట్టియవస్థ తటస్థించినందులకు మీ రెంతమాత్రమును వగవవలదు. మీమిత్రుఁడు మహేంద్రుఁడు గలఁడు. విపత్తులయందును, సంపత్తులయందును మీరాతనికి సమభాగులై యుందురేని భట్టాచార్యులవారి యాత్మ చాల సంతోషించును. మీకంతటను విజయము గలుఁగుఁగాత. మీరు మహారాజావారి సేవకులమను మాట యెల్లప్పుడును స్మరించుకొనుచుందురేని మీయభ్యుదయమునకు దేవతలు గూడ విఘాతము గలిగింపజాలరు." పిదపఁ బ్రసాదరాయఁడు మహేశ్వరునితోఁ బ్రత్యేకముగ నిట్లుచెప్పెను. "సుకవీ, నీకవితాధార మహోత్కృష్టము. భట్టాచార్యులవారిమీఁదను, రాజావారిమీఁదను నీవుచెప్పినపద్యములు పీయూషతరంగితములు. నీకవిత్వముకంటె నా కాప్యాయకరమగు వస్తువులేదు ; గావున నెప్పుడైన నీకుఁ దీఱుపాటు గలిగిన యెడలను నాయెడలఁ దయ యున్న యెడలను నన్ను దలఁచి యొక్కపద్యము గానముచేసెదవేని నాయాత్మ యానందించును."

అయ్యన్నదమ్ములు మఱలనగచి "మేము కేవలము దైవోపహతులము. లేకున్న భట్టాచార్యులవారును మీరు నొక్కమాఱుగ రామచంద్రపురసంస్థానము నంధకారకూపమునఁ ద్రోసిపోవుట తటస్థింపదు. ఇఁక మాకు దిక్కెవ్వరు? పరమానందముతో మమ్ముఁ దట్టుచు "సెబాసు మిత్రులారా!" యని మీరు మెచ్చుకొనుట కవకాశము లేనప్పుడు మాకుఁ జరుగబోవు సమ్మానము పూర్ణానందకారణ మెట్లు కాఁగలదు? మా శ్రమకు మీరానందించిన జాలు ననుకొంటిమి. మేము దేనిని ముఖ్యముగాఁ గోరుకొంటిమో యది సంపూర్తిగలభించుటకే వీలులేనపుఁ డిఁక మాకుఁ బ్రశంసయేల!" యని చెప్పిరి. మహేశ్వరుఁడు ప్రత్యేకముగ నిట్లు చెప్పెను. "రసికప్రభూ, నాకవిత్వమునకు జీవముపోసి, బైటకుఁ దెచ్చి, దానికి విలువగలిగించినవారు మీరు. నేను ప్రారంభించిన గ్రంథము పూర్తిగాక పూర్వమే మీరు స్వర్గమునకుఁబోవుట నాదురదృష్టముకంటె వేఱేమున్నది." ఇట్లు చెప్పినపుడు మహేశ్వరుని కవితాధార యపస్ఖలమగుటకుదాహరణముగ నాతని కన్నులనుండి బాష్పధార యవ్యాహతముగ దొరలెను.

## 35

తాణేమున్నగు వారి హృదయములు మఱల నాలోచనాధీనములు కాకపూర్వమే ప్రసాదరాయఁడు రాధదేసఁ

జూచి "దేవీ, నీవేమందు" వని యడిగెను. ఇంతవఱకును మిగుల గంభీరమైయున్న రాధ ముఖమండల మీమాట వినిన తోడనే ప్రసన్నమయ్యెను. రాధ నిశ్చలమై ప్రసాద రాయనిం జూచుచు "జీవితేశ్వరా, ఒకప్పుడు నీవు నన్ను 'నాకుం దగినభార్య' వని ప్రశంసించితివి. నేను నిన్ను విడిచి భూలోకమునందే యుండిన నీకుం దగినదాన నగుదునా?" యని పలికెను. "దేవీ, అట్లైనన్నటికినిం గాదు. నీవు నాకు యథార్థముగ దగినరాణివే యగుదువు. సందేహము లేదు. నీకుం దెలియనిదేమున్న" దని యతి ప్రేమతోం బ్రసాదరాయండు రాధచేతులు పట్టుకొని పలికెను. రాధహర్షాశ్రుగద్గదయై మాట్లాడంజాలక పోయెను.

ఇదంతయు వినుచున్నవా రందఱును నిర్విణ్ణులైరి. రాణిమాత్రము శీఘ్రముగం బ్రబోధితయై "ఇదియేమి తలంపు తమ్ముండూ! ఇంక రాధనుగూడ మాకుంగాన్పింపకుండం జేయందలంచితివా? మాపైనంతనిర్దయ యేల కలుగవలెను తండ్రీ! ఏమితల్లీ, నీకీబుద్ధి యేల పుట్టెను? విచారసాగరమున మునింగిపోయియున్న మాకుం బ్రపంచమే లేకుండంజేసెదవా?" యనియెను. తోడనే జానకి "వదినే, మమ్ము విడిచిపోయెదవా?" యని రోదనము ప్రారంభించెను. ఆమె వెనుక రుక్మిణియు, నంతకుంబూర్వమే శచియుంగూడ నేడ్వందొడంగిరి. వృద్ధాంగనలుగుం

డెలు బాదుకొనసాగిరి. రాణిగూడఁ గన్నీరు విడువఁ జొచ్చెను. మహేంద్రుఁ డశనిపాతముచేవలె నిశ్చేష్టుఁ డయ్యెను. కుమారస్వామియుఁ, గుమారమహీపతియు "ఇదియేమి ఘోరము వీరాధివీరా" యని తెల్లవోయిరి. "ఏమిబాబూ, ఇట్లుతలంచితి" వని రాజాశ్చర్య చకితుఁ డయ్యెను. మాధవశర్మ తెల్లవోయెను. తక్కినవా రంద అును హాహాకారములు ప్రారంభించిరి.

ఎంతోకష్టముమీఁద మఱల నిశ్శబ్దత నెలకొనిన పిదప రాధయందఱితో నిట్లనియెను. "మీకు నాపైఁ గలఁ ప్రేమాదరము లపారములనియు, నావియోగమును మీరు సహింపఁజాలరనియు నేనెఱుఁగుదును; గాని నే నిఁక భూమిపై నుండిన నేమి సుఖమో తలంపుఁడు. చోరాపహరణకారణమున నాపతిమరణానంతరము నాకైహిక జీవితము విషపూరితమై పోవును. నేనిప్పుడు నాపతితో సహగమనము చేసితి నేని ఒకటి రెండు సంవత్సరములలో నాపేరీలోకమున విలుప్తమైపోవును. లేకున్న లోకసామాన్యధర్మము ననుసరించి నేనింకను నలువదియేండ్లో యేఁబదియేండ్లో లోకుల వాదోపవాదములకుఁ బాలుగావలసివచ్చును. ఆస్థితి యెంత దుస్సహమో యోచింపుఁడు. మీరందఱును నాసుఖమును గోరుటలో నను మానములేదు; గావుననే నాసుఖకారణమగు నాభర్త

తోడి సహగమనమునకు మీరాక్షేపణలు సేయఁగూడదు. నేనిపుడే సగము చచ్చియున్నాను. నావిభుఁడు పాంచభౌతిక దేహమును విడిచినతరువాత నాప్రాణములను మీరెట్లును నిలుపఁజాలరు. అంతమాత్రమునకు మీరిపుడేల నిషేధములు చెప్పెదరు!''

జానకీరుక్మిణుల కింతటితోఁ దృప్తిగలుగలేదు. వారేడుపు మానలేదు. శచి యీమాటలనే వినలేదు. అప్పుడు రాణి "తమ్ముఁడా! నీవైన రాధ నీప్రయత్నమునుండి మఱలింపరాదా?'' యనియెను; గాని తోడనేయాతఁడు "అక్కా! రాధపలుకులయం దసంబద్ధమేమున్నది? సర్వము తెలిసిన నీవుగూడ రాధ కడ్డుచెప్పెదవా?'' యనియెను. రాణి యిఁక మాట్లాడఁ జాలక పోయెను. రాధ మఱల మఱల జానకీ రుక్మిణుల నంగీకరింపఁజేయుటకుఁ బ్రయత్నించెను. తుద కామె "మీరింత పట్టు పట్టెదరా? నాపై నింత నిర్దయ జూపెదరా? భట్టాచార్యులవారి పుత్రికలై యుండి ధైర్యమును విడిచి మీరింతవాపోయెదరా?'' యని యనేకవిధములఁ జెప్పెను. జానకీరుక్మిణులు రాధ యీనిశ్చయమునుండి యెట్లును మఱలదని నిశ్చయించుకొనిరి. రాణిగూడ నట్లే చెప్పెను. చేయునదిలేక తుద కందఱు నంగీకరించిరి; గాని యొక్కరిమనస్సును స్వాధీనమున లేదు. రాధకు మాత్రము విచారముడిగెను.

అప్పటికి రెండుగడియల రాత్రియుండెను. ప్రసాద రాయునికి సంభవించిన యవస్థఁదెలిసి యూరివారందఱును వచ్చి వీధిలో నిలిచిపోయిరి. భీమారెడ్డి లోనికివచ్చి "ఊరివారందఱును వచ్చియున్నారు. ఠాణేదారుగారినిఁ జూచుట కనుజ్ఞవేఁడుచున్నా" రని రాజుతోఁ జెప్పెను. ప్రసాదరాయఁడు తొలుత నూరిపెద్దలను బదుగురను రప్పింపుమని చెప్పెను. భీమారెడ్డి యట్లేచేసెను. పెద్దలు వచ్చి ప్రసాదరాయనిఁ జూచి చాల వగచిరి. ప్రసాద రాయఁడు వారికిఁగూడ నప్పగింతలు చేసెను. కొంత తడవు విచారించి తరువాత వారినిఁ బ్రక్కకోసరిల్లుఁ డని చెప్పి ప్రసాదరాయఁడు తక్కినవారిని రానిమ్మని రెడ్డి కానతిచ్చెను.

మహాప్రసాదమని వీధిలోనికిఁ బోఁ బోవుచున్న భీమారెడ్డితో రాజు "అంగణము చాలనిరుకుగ నున్నది. వచ్చినవారి సంఖ్య యనంతమైయున్నది. ఠాణేదారుగారి బాధగూడ దుస్సహమైయున్నది. ఇన్నికారణములవలన వచ్చినవా రిక్కడ నిలుచుట కవకాశము లేదు. వచ్చె డువారు వచ్చుచుండఁగా వచ్చినవారు పోవుచుండవలె" నని చెప్పెను. భీమారెడ్డి యూరివారి కట్లే చెప్పెను. గ్రామవాసులు నట్లే చేసిరి. వారందఱు బ్రసాదరాయనిఁ జూచి మ్రొక్కువారే. అందఱు నేడ్చువారే. ఊరివారి

బాష్పధారవలన మార్గము వర్షము కురిసినట్లయిపో యెను. నారు లోనికి రాఁదొడఁగినది మొదలుకొని యెల్ల రును వెడలిపోవు నంతదనుకఁ బ్రసాదరాయఁ డంజలిబంధ మును విప్పలేదు.

పిదప నాఁతఁడు తమ్మునిఁబిలిచి "అంతకంతకు బాధ దుస్సహముగుచున్నది. ఎట్లో సహించుకొని యుండుట వలనఁ బ్రయోజనము లేదు. కావున నీభల్లపుటలుఁగును దీసివేయు" మని చెప్పెను. అందఱును గొల్లుమనిరి. ఇఁక నుంచుటవలన లాభములేదని రాజుగూడఁ జెప్పిన తరు వాత మహేంద్రుఁడు ప్రసాదరాయని చెంతఁజేరి విలపిం చుచు "అన్నా! పూర్వజన్మమున నేనేదో గురుతర పాపము చేసియుంటిని. కావుననే నాకీప్రాప్తి. నీతలక్రింద నిప్పు పెట్టఁదలఁచియున్నాను గదా! ఇఁక నీప్రాణములు తీయుట నాకెంతపని?" యని బల్లెముమీఁదఁ జేయివే సెను. జానకీరుక్మిణులయొక్కయు, శచీదేవియొక్కయు, రోదనధ్వనులు మిన్నుముట్టసాగెను వృద్ధాంగనలు చూడ లేక ప్రక్కకుఁ దొలఁగిపోయిరి. రాణికన్నులనుండి యశ్రు లహరి ప్రవహింపసాగెను. రాజు కుమారస్వామియును నిశ్చేష్టులైరి. ఊరిపెద్దలు రామరామా యని కన్నులు మూసికొనిరి. కానిరాధమాత్రము నిశ్చలయై నాథుని రెండుచేతులను బట్టుకొని రెప్పవేయకుండ నాతనిం జూడ

సాగెను ప్రసాదరాయఁడుగూడ నట్లేచేసెను. ఆదంప తుల నాల్గుచేతులు నేకమయ్యెను. నాల్గుకన్నులు నేక మయ్యెను. ఉభయుల తనులతలయందును విద్యుద్వాహిని కూలంకషమై ప్రవహింపఁజొచ్చెను. ఈరూపమున రెండు హృదయములుగూడ నేకమయ్యెను. ఇప్పుడు ప్రసాదరా యనికిఁ బ్రత్యేకవ్యక్తిత్వము లేదు. అట్లే రాధాదేవికిఁ గూడలేదు. ప్రసాదరాయఁడే రాధ. రాధయే ప్రసాద రాయఁడు. ధర్మానుప్రాణితమగు ననంతప్రేమవలననైక్య మైపోయిన యాదంపతుల చైతన్య మిప్పుడు విశుద్ధపరం-జ్యోతిలో విలీనమైపోయెను.

ఈస్థితి భారతీయదంపతులకు సంకల్పమాత్రమున సిద్ధించును. నేఁడు విదేశములన్నియు విజ్ఞాననిధుల మని విఱ్ఱవీగుచున్నవి. సాగరకన్య మాయింటి పరిచారికయని గర్వించుచున్నవి; అయినను ప్రేమ, ధర్మము, దయ, దాక్షిణ్యము, ఆత్మత్యాగము వీనికి నేఁటికిఁ గూడ భారత దేశమే నిధానము; గాని యీవిశాల దేశముమీఁద దౌర్భాగ్యమేఘమాలికయు, భారతీయుల హృదయాకా శముమీఁద నవిశ్వాసమేఘపంక్తియు నావరించియున్నవి.

మహేంద్రునకుఁ గూడఁ జైతన్యములేదు; గానియాతఁ డెట్లో బల్లెమును బెఱికివేసెను. ప్రసాదరాయని కన్నులు మూఁతలుపడియెను. రాధకన్నులుగూడ మూఁతలు

పడెను. ఊర్ధ్వముఖమైయున్న ప్రసాదరాయని శిరము ప్రక్కకుఁ బడిపోయెను. క్రొక్కాఱు మెఱుపుతీవవలె రాధాదేవి తనులతగూడ భూతలమునఁ బడిపోయెను. ప్రసాదరాయని వక్షఃపీఠమునుండి కవోష్ణరక్తధార యాకస్మికముగ నెగసి రాధాదేవి కభిషేకము చేసెను. తోడనే యంతటను రోదనధ్వనులు మిన్నుముట్టెను. రాణియు, మాధవశర్మగృహిణియు రాధను లేవఁదీసి కూర్చుండఁబెట్టిరి; గాని యామెకుఁ బ్రపంచజ్ఞానము లేదు. ఆమె కనుదమ్ములు కొంచెము వికసించెను; గాని వానికి నిజశక్తి లేదు. అంతటను గాఢాంధకార మావరించెను.

## 36

గృహోద్యానవనమున సాయంకాలము రాధాదేవితో నిష్టాలాపంబులం బ్రొద్దుపుచ్చుటకై ప్రసాదరాయఁడు ప్రత్యేకముగ నిర్మించుకొనిన లతానికుంజమునకుఁ బ్రక్కఁ జితినిర్మించుటకు రాజాజ్ఞయయ్యెను. అరుణోదయమునకుఁ బూర్వమే మంచిగంధపుఁజెక్కలతో విశాలముగు చితి నిర్మింపఁబడియెను. ఇది తయైన వెంటనే కుమారస్వామియు యువరాజును బోయి దానిపైఁ గుసుమసహస్రములతోఁ బ్రసాదరాయని కళేబరము నుంచుటకు శయ్యానమర్చి సుగంధతైలమును జిలుకరించిరి. మహేశ్వరుడు జగ్గయ్యను

కుమారవీరయ్యను వెంటబెట్టుకొనిపోయి రాధామార్గమున వీధిగుమ్మము మొదలు చితివఱకును బుష్పములను బఱపించెను. చంద్రనారాయణుఁడు తోటయందలి పూవులన్నియుఁ గోయించి గంపలలో నింపియుంచెను. అట రాజు ప్రసాదరాయుని కళేబరము నూరేగించుటకుఁ దగు ప్రయత్నములు చేయుచుండెను.

సూర్యోదయ మయ్యెను. మహోత్సవము ప్రారంభమయ్యెను. మంగళవాద్యములవలనఁ బురిబూ రంతయుఁ బోరుకలంగెను. చంద్రనారాయణుఁడు, మహేశ్వరుఁడు, కుమారస్వామి, మఱియొక బ్రాహ్మణుఁడు శవవాహకులైరి. మహేంద్రుఁ డగ్నిహోత్రమును బట్టుకొని ముందు నడచుచుండెను. పూలమాలికలతో నిండిపోయియున్న శవముపై నూరి స్త్రీ పురుషులందరును పూలవాన కురిపించిరి. రెండుగడియల ప్రొద్దెక్కనప్పటికి శవము చితిచెంతకుఁ గొనిరాఁబడెను.

చితిచుట్టును, మార్గమున కిరుకెలంకుల నొకదెస స్త్రీలును, మఱియొకదెసఁ బురుషులును వచ్చి క్షణములో మూఁగిపోయిరి. సూర్యకిరణ ప్రసారమునకు గృహ మడ్డు వచ్చుటచే మార్గమునందును, జతిమీఁదను జల్లఁబడిన ప్రఫుల్లకుసుమములు విలక్షణ తేజస్సుతోఁ బ్రకాశించుచుండెను. ప్రజలెల్లరును హాహాకారము చేయుచుండఁ

ప్రసాదరాయని కళేబరమును చితిపై నునిచి యథాశాస్త్రముగ మహేంద్రుఁ డగ్నిసంస్కారము గావించెను.

అంతవఱకును బిక్కమొగముతో నున్నరాజు "వీరమణీ. పోయితివా!" యని కుమిలికుమిలి దుఃఖింపఁ జొచ్చెను. మాధవశర్మ యుత్తరీయమును ముఖముపై గప్పుకొని శోకింపగడఁగెను. కుమారస్వామి, యువరాజు మహేంద్రుఁడు మున్నగువారి విచారమును వివరింపవలసిన పనిలేదు. గ్రామవాసుల విషాదమును వర్ణింపఁజాలము.

అగ్నిహోత్రము చితి నల్వంకల నలముకొనెను. రాధాదేవి వచ్చుచున్నదని కోలాహలము ప్రబలెను. తోడనే చంద్రనారాయణుఁడును, మహేశ్వరుఁడును, బోయి పూలగంపలు తెచ్చి పుష్పములు స్త్రీపురుషులకెల్లరకును బంచియిచ్చిరి. ఇంతలో రాధాదేవి దృక్పథమునఁబడెను. వెంటనే సాగరఘోషమును మించిన యా జనఘోషము హఠాత్తుగఁ జల్లఁబడెను.

రాధాదేవి, కుసుమకోమలములగు పాదములను బూలపై నతిమృదువుగ విన్యస్తముగావించుచు నంజలిబద్ధయై యతి గంభీరముగ వచ్చుచుండెను. ఆమె కంఠమున వివిధకుసుమమాలికలు వెలయుచుండెను. తళతళ మెఱయు బనారసుచీరనుండియు, భ్రమరరాశిం బురడించు వినీల కేశజాలమునుండియు సుకుమారసౌరభము గుబా

ళించుచుండెను. రాధ ధర్మముకొఱకును బ్రణయము కొఱకును బతి ననువర్తించుచుండుటచే దివ్యతేజమామె భౌతికశరీరమునఁ గూడ నిండి తొలుకాడుచుండెను. దానినిఁజూచి యెల్లరును ముగ్ధు లగుచుండిరి. రాణి, జానకి, రుక్మిణి, శచి, మాధవశర్మ గృహిణి, ఊరియందలి మఱికొందఱు రమణీమణులు నాపవిత్రరమణీమూర్తిపైఁ బూలవాన గురియుచు వెనువెంట వచ్చుచుండిరి. అది చూచి మార్గమున కిరుప్రక్కల నున్నవారుగూడఁ బుష్ప ప్రవర్షణము ప్రారంభించిరి; గాని రాధ కీసంగతి యేమియుఁ దెలియదు.

అచ్చటనున్న యెల్లరకన్నులును రాధాదేవిమీఁదనే నల్లకలువ పూవులను జిమ్ముచుండెను. ఆపతివ్రతాశిరో మణినిఁ జూచి రాజప్రభృతులు అంజలిబద్ధులై హృదయ ములయం దామె మహిమను గీర్తింపఁజొచ్చిరి. నడుమ నడుమఁ గొందఱు పరిచారికలు రాధపైఁ బన్నీరు చల్లు చుండిరి. మఱికొందఱు అత్తరువులు చిలుకుచుండిరి. రాధ యివియు నెఱుఁగదు. ఆమె నడచుచునేయుండెను. ఆమె నడచుచుండఁగనే యిన్నియు జరిగిపోవుచుండెను. పుష్పప్రవర్షణము ముగిసినపిదప నందఱును రాధాదేవికి వందనము లర్పించిరి. అప్పటి కప్పుడే యామె చితిని సమీపించెను.

వెంటనే సకలజనుల హృదయములును దామరాకు మీఁది నీటిబిందువులవలెఁ గఁపించిపోవసాగెను. అందఱ చూపులును జెదరిపోవుచుండెను. అంతకంతకుపెజృంభించు చున్న వీతిహోత్రుఁడు స్వాగతమిచ్చి రాధాదేవినిఁజేఁ బిలువసాగెను. అందఱును దిగ్భ్రాంతులై చూడలేక కన్నులు మూసికొనిరి; గాని వారుత్తర క్షణమునందే కన్నులు విప్పిచూచిరి. అప్పటికప్పుడే రాధాదేవి చితి నధిరోహించెను. అందఱును రాధధరించిన పూలదండలు కమలి పోవునంతవఱనును జూచిరి. ఆమె కోమల దేహ మంతకుఁ బూర్వమే కమలిపోయెను.

## 37

స్త్రీలెల్లరును రాధాదేవి గుణగణములను గీర్తించు చొనుచు నిండ్లకుఁ బోయిరి. సమయజ్ఞయగు రాణి "ఇది భుజంగరాయనికి శిక్ష విధించు సమయము. ఇఁక మన మిచ్చట నుండరాదు పోద" మని జానకి రుక్మిణి మున్నగు వారిని వెంటఁబెట్టుకొని మాధవశర్మ యింటికిఁబోయెను. పురుషులెల్లరును వీధిలోనికిఁ బోయి నిలిచి యనేకవాదో పవాదములు ప్రారంభించిరి. అప్పుడే జరిగిపోయిన సమా చార మంతయువిని వచ్చి రామవరపురహితులు చాల వగచి లోనికిఁబోయి మిన్నంటిమండుచున్న చితినిఁజూచి

వెనుకకు మఱలిరి. అవకాశమైనపిదప వారు రాజదర్శనము చేసి ప్రసాదరాయని గురించి చాల విచారమును వెలి బుచ్చిరి.

రాజాజ్ఞవలన గ్రామవాసు లందఱు మధ్యాహ్నము మఱల భట్టాచార్యులని వీథిలో నిండిపోయిరి. భుజంగ రాయనికి విధింపవలసిన శిక్షను నిశ్చయించుకొని రాజు, కుమారస్వామి, మహేంద్రుఁడు, మాధవశర్మ, చంద్ర నారాయణుఁడు మున్నగువారు వచ్చిరి. వారు అరఁగెక్కి నతోడనే జనసంఘమునుండి యొక యువకుఁడు "మహా ప్రభూ, భుజంగునినిలుఁవబెట్టిచిత్రవధఁజేయవలె" నినియఱ చెను. మఱియొకఁడు "ఏనుఁగుకాళ్ళక్రిందఁబెట్టి త్రొక్కింప వలె"ననియెను. ఇంకొకఁడు "తలగొరిగించి గాడిదమీఁద నూరేగించి రాళ్లుకట్టితుల్యానదిలో విడువవలె"ననియెను. వేఱొకఁడు గడ్డిమోపులోఁ జుట్టఁబెట్టి నిప్పు ముట్టింప వలె" ననెను. మఱియొకఁడు కాళ్ళకుఁ ద్రాళ్లుగట్టి వ్రేలాడఁదీసి క్రింద నగ్గిగుండము తయారుచేయవలయు" ననియెను. కొండొకఁడు నూనెగుడ్డలు చుట్టి నిప్పు ముట్టించి, మీఁద నూనె చల్లవలె ననియెను. రామవర గ్రామవాసియుఁ భుజంగుని దౌర్జన్యమునకు మొదటఁ బాల్పడినవాఁడు నగు నొక ముసలిరహితు "ఒడలినిండ గాయములుచేసి మిరపకాయలపొడి యంటింపవలె" నని

యెను. ఇంకొకరహితు "ఆపైని మీఁదికి వృశ్చికములను విడువవలె" ననియెను. రాజధానికిఁ బోవుచున్న యువరాజుముందు విగ్రోహులు చీటిగట్టినరాయి విసరిపోయి నప్పుడు వానిని బట్టుకొనుటకుఁ బులిబూరునుండి బయలుదేఱిన రాతులతో భుజంగుని బంధించుటకు జనవనారపగ్గము తెచ్చిన యువకుఁడు దూరమునుండి యెలుఁగెత్తి "చాలదు మహాప్రభూ, ఉప్పుపాతర వేయవలె" నని యఱచెను.

ఈకోలాహల మంతయు వినుచున్న రాజు వెంటనే చంద్రనారాయణునిఁ జూచి కన్ను గీటెను. అప్పుడు చంద్రనారాయణుఁడు చేయెత్తి కలకలము నడచి "తొందరపడవలదు. మహారాజావారు మన భుజంగరాయనికి ఆమహోత్సవమునే, యీక్షణమందే నెఱవేర్పనున్నా" రని చెప్పెను. అంతట నానందధ్వానములు మిన్నుముట్టెను.

రాజాజ్ఞవలన భట్టాచార్యుని గృహోద్యానవనము నందే దక్షిణమున సేవకులు ఉప్పుపాతరవేయుటకుఁ దగిన గోతిని క్షణములోఁ దయారుచేసిరి. ఊరియందలి పెద్దకోమటి యుప్పుబస్తాలను బండిమీఁద వేయించుకొని వచ్చెను. రాజాజ్ఞ కాకపూర్వమే జనసంఘమునందలి దృఢకాయులు కొందఱు ఆబస్తాలను గోతిదగ్గఱకుఁ

జేర్చిరి. మహేశ్వరుఁడును, భీమారెడ్డియుఁ బోయి భుజంగ రాయనిం గొనివచ్చిరి. ఆతని నారసి జనసంఘము నిందా దండకము ప్రారంభించెను. క్షణములో జనులందఱును రంగస్థలమునఁ జేరికొనిరి. మహేశ్వరుఁడు బంధములను విప్పి భుజంగరాయని గోఁతి చెంత రాజున కెదురుగ నిలిపెను. భుజంగరాయఁడు రాజుతో నిట్లు చెప్పెను.

"ప్రభూ, ఏలినవారు నాకిపుడు విధించిన శిక్షనుగుఱించి నేనేమియు విచారించుటలేదు. ప్రసాదరాయని కేమియు నపాయము వాటిల్లియుండనిచో నేనీగోఁతిలో నిశ్చింతతో దిగియుందును. నా కపజయము కలిగినందులకు విచారించుట లేదు. ప్రసాదరాయఁడును దేవరవారునునామీఁద దీవ్ర ద్వేషము వహించినతరువాత మాయూరివారికెదురుగ నవమానముచేసి పిదప నేనోడిపోవుటయే మంచిదని తలంచితిని. ఆ రెండును నెఱవేఱినవి; గాని తుదకుఁ బిట్ట పిడుగువలెఁ బ్రసాదరాయనికి సర్వనాశము సంభవించినది. ఆవీరాధివీరుఁడు స్వర్గారోహణము గావించినపిదప మాయూరివారిమీఁది పగఁ దీర్చుకొనుటకు నేను చేసిన ప్రయత్న మక్రమమని తెలిసికొనఁగలిగితిని. ధర్మమూర్తులగు నేలినవారియెదుట విన్నవించుకొనఁనచో నాకుజరిగిన యవమానమునకుఁ దగిన ప్రతీకారమే జరిగియుండును; గాని యిప్పుడేమనుకొన్నను లాభము లేదు. మీరు విధించిన శిక్ష ననుభవించుటకు సంసిద్ధుఁడనై యున్నాను"

ఇదివిని యెల్లరు నాతని తీవ్రచిత్తతను నిందించిరి. "నీప్రయత్న మక్రమమని తెలిసికొనఁగలిగితివి; గాన సంతోషము. నీవు తుదకెంత పరితాపపడినను ఆపరితాపము హృదయపూర్వకమే యైనను, నియమస్థితికొఱకు నిన్నుశిక్షింపక తీఱ" దని రాజు చెప్పెను. "మీరు నిర్ణయించిన శిక్షకు నేను వెనుదీయుటలే" దని భుజంగ రాయఁడు దబాలున గోతిలో నుఱికెను. రాజభటులు క్షణములో నాతని నుప్పు పాఁతరలో సమాధిచేసిరి.

ప్రసాదరాయఁడు చనిపోయిన తరువాతఁ బదునైదు దినములకుఁ బులిబూరు వచ్చి రాజు, ప్రముఖుల నందఱను తానాకుఁ బిలిపించి "భట్టాచార్యులవారి గృహోద్యానమున శవసంస్కారములు జరుగుటవలన గ్రామవాసు లిచ్చట వసించుటకు సందేహించుచున్నట్లు తెలియ వచ్చినది. నిజముగఁ బులిబూరు శ్మశానవాటిక యైపోయినది; గావున నీసందేహము సహేతుకము. ఈసందియము మాకు భట్టాచార్యులవా రగ్నిసంస్కారము చేయఁబడినపుడే గలిగినది; గావుననే మేము తరువాయి తీర్చివేసి యాసందేహమును బలపఱిచితిమి. ఇక్కడకుఁ దూర్పునఁ బావుకోసుదూరమున మఱల నీయూరు కట్టించుటకు మేము మొదటనే యేర్పఱుచుకొంటిమి. ఎల్లవారికి నక్కడఁ గావలసిన స్థలమిచ్చెదము. అక్కడ

నూరు తయారైన తరువాత నిప్పటి గ్రామము దానికి శ్మశానవాటిక యగు'' నని చెప్పెను. అందఱు నంగీకరించిరి. నాల్గుమాసములకే క్రొత్తగ్రామము తయారయ్యెను.

తొలుత, విష్ణుకుండిన వంశజుఁడు, ఏకాదశాశ్వమేధావబృథస్నానశోభితుఁడు, విక్రమాశ్రయుని పౌత్రుఁడు, గోవిందవర్మకుఁ బుత్రుఁడు నగు మాధవవర్మ, పూంగీ దేశమును జయించునిచ్ఛతో గోదావరిని దాఁటుచుఁ గమ్మక రాష్ట్రవాసి, గౌతమ గోత్రపవిత్రుఁడు, దామశర్మ పుత్రుఁడునగు శివశర్మకు ఫాల్గునశుద్ధపూర్ణిమా సోమగ్రహణకాలమున సర్వదోషపరిహారముగాఁ దుల్యా తీర విరాజమానమగు పులిబూరు గ్రామము నగ్రహారముగా దానముచేసెను; గాని యీదానము నిలిచినది గాదు. దాతవిజయము సుస్థిరము గాదయ్యెను. పిఠాపురము రాజధానిగా వేంగి కళింగ దేశముల నేలిన యాంధ్ర చాళుక్యవంశజుఁడగు కుబ్జవిష్ణువర్ధన మహారాజునకు జయసింహావల్లభుఁడు కుమారుఁడు. ఈతఁడు క్రీస్తుశకము ౬33 మొదలు ౬౬౩ వఱకును బరిపాలనము చేసెను. ఈప్రదేశ మంతయు నీతని స్వాధీన మయ్యెను. అయిన నీతఁడు బ్రాహ్మణాగ్రహారములను హరింపలేదు. విజయమును బడసిన వెంటనే యీతఁడు దామశర్మకుఁబౌత్రుఁడు,

స్వపితురధికరణ గుణగణాధి వాసుఁడగు శివశర్మకుఁ బుత్రుఁడు, త్రైత్రిరికసబ్రహ్మచారి, వేదద్వయాలంకృత శరీరుఁడు, స్వకర్మానుష్ఠానపరుఁడు, పూర్వాగ్రహారికుఁడునగు రుద్రశర్మకు మఱల బులిబూరు గ్రామము నగ్రహారముగా దానముచేసెను.

(పులిబూరు తామ్రశాసనములు)

ఈపులిబూరే నేఁడు 'పొలమూరు' అని వ్యవహరింపఁ బడుచున్నది. పులిబూరుండిన స్థలము పొలమూరి కిప్పుడు శ్మశానవాటిక.

సమాప్తము

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము 7728/1953

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రచనలు

## చిన్న కథలు

| | | | |
|---|---|---|---|
| 4వ సంపుటం | (నాలుగు కథలు) | ... | 1-4-0 |
| 5వ సంపుటం | (వడ్లగింజలు) | ... | 1-4-0 |
| 6వ సంపుటం | (మూడు కథలు) | ... | 1-4-0 |
| 7వ సంపుటం | (మార్గదర్శి) | ... | 1-4-0 |
| 8వ సంపుటం | (కన్యాకాలే యత్నా ద్వరితా) | | 1-4-0 |
| తల్లిప్రాణం | (విడిగా చిన్నకథ) | ... | 0-4-0 |

(కథలు ఏసంపుటానికా సంపుటంలో నేపూర్తి అయిపోతాయి)

1, 2, 3, సంపుటాలు రెండో కూర్పు అచ్చులో వున్నాయి

## నవలలు

| | | | |
|---|---|---|---|
| 1 విషభుజంగము | (ఇదే శ్మశాన వాటిక) | ... | 2-8-0 |
| 2 రక్షాబంధనం | (రెండో కూర్పు అచ్చు) | ... | |
| 3 ఆత్మబలి | (సైకలాజికల్ నవల) | ... | 3-8-0 |
| 4 మల్లికార్జునరావు | (విద్వాన్, కం అప్పన్నశాస్త్రిగారిది) | | 1-4-0 |

## నాటకాలు

| | | | |
|---|---|---|---|
| 1 నిగళబంధనం | (గొప్పనాటకం) | ... | 1-8-0 |
| 2 రాజరాజు | (సారంగధరుని కథ) | ... | 1-0-0 |

## చరిత్రలు

| | | |
|---|---|---|
| 1 చంద్రగుప్తచక్రవర్తి | ... | 1-0-0 |

## అచ్చులో

1 ప్రేమపాశం (నాటకం)

2 రూపికలు (కలంపోటు, టీపార్టీ వగైరాలు

3 అనుభవాలూ, జ్ఞాపకాలూను 1, 2 రెండుసంపుటాలు

కలాభివర్ధనీ పరిషత్తు
ఇన్నీస్ పేట — రాజమండ్రి

2.40

